The Largest Circulated Telugu Monthly

# చతుర




పి.చంద్రశేఖర అజాద్ ★ భువికి దిగిన తార

ప్రస్తుత పోటీ ప్రపంచంలో అధ్యాపకులు బాగా చెప్పగలిగి ఉండడం మాత్రమే కాకుండా పోటీ పరీక్షలకు సరిగ్గా సరిపోయేవిధంగా విషయాన్ని విద్యార్థులకు అందించి వారు విజయాన్ని సాధించేట్లు చేయాలి.

ఇటువంటి ఎందరో అత్యున్నతస్థాయిలో బోధించ గల విశేషానుభవము కలిగిన అధ్యాపకులు Net Workలో ప్రారంభించబడి చిరకాలంలోనే అందరి ప్రశంసలనందుకుంటున్న S.V.Kలో ఇంటర్‌మీడియట్‌కు అడ్మిషన్లు జరుగుచున్నవి.

డైరెక్టర్ **యస్.విజయకుమార్‌రెడ్డి**

# SVK

**RESIDENTIAL JUNIOR COLLEGE**

**(Res. Jr. College)**

**Balaji Theater Complex**

**TIRUPATI**

**Ph: Off: 20686, Res: 23151.**

RESIDENTIAL JUNIOR COLLEGE

(Res. Jr. College)

Balaji Theater Complex

TIRUPATI

Ph: Off: 20686, Res: 23151.

# అధునిక విద్యాకేంద్రాలు రెసిడెన్షియల్ స్కూళ్లు-కాలేజీలు

'చతుర' సమర్పణ

ఇది పోటీ ప్రపంచం. 'విద్య' అనే విషయంలో ఏ ఒక్క తప్పటడుగువేసినా ఈ పరుగుపందెంలో వెనుకబడక తప్పదు. మెడిసిన్, ఇంజినీరింగ్ ప్రవేశపరీక్షలకి ఇంటర్మీడియట్‌స్థాయి విద్యార్థులే అర్హులు గనుక ఇంటర్మీడియట్‌లో ప్రతి నిమిషం విద్యార్థి జీవితాన్ని మలుపుతిప్పే కీలక క్షణమే.

మెడికల్, ఇంజినీరింగ్ ఎంట్రన్స్ పరీక్షలకు వత్తిడి ఎక్కువ కనుక తల్లిదండ్రులు సహజంగా రెసిడెన్షియల్ స్కూళ్ళకు మొగ్గుతున్నారు. రెసిడెన్షియల్ స్కూళ్ళలో విద్యార్థులని క్షణం వృధాకానీయకుండా చదివిస్తారు. ఆటపాటలకు విరామం అతితక్కువ. రోజూ ఉదయం ఐదుగంటలకి నిద్రలేచిన విద్యార్థి ఆరుగంటలకల్లా క్లాసులకి సిద్ధం కావాలి. ఏడున్నరకి కాఫీ విరామం. తరువాత మధ్యాహ్నం భోజనంవరకు క్లాసులు నడుస్తాయి. భోజనం తరువాత రెండుగంటలు విశ్రాంతి. మధ్యాహ్నం రెండునుంచి రాత్రి ఎనిమిది గంటలవరకు మళ్ళీ క్లాసులు. కొన్ని కాలేజీలు ఆటలకు విరామం ఇస్తాయి. కొన్ని హాస్టల్స్‌లో వీడియోలు ఏర్పాటు చేస్తారు. విద్యార్థుల్ని వినోద కాలక్షేపానికి బయటికి పోనీయరు. వారానికి ఒకటి, రెండుసార్లు బజారుకి మాత్రం వెళ్ళనిస్తారు. ఈ కళాశాలలో పిల్లల ఆరోగ్య పర్యవేక్షణకు డాక్టర్లుంటారు.

పిల్లలకి మంచి శిక్షణ గరపి వారి ప్రతిభకు మెరుగులు దిద్దుతున్న ఈ రెసిడెన్షియల్ కళాశాలల్లో ప్రభుత్వం నిర్దేశించిన పాఠ్యాంశాలతోపాటు విద్యార్థుల మానసిక వికాసాల్ని దృష్టిలో ఉంచుకుని పలు దేశీయ, విదేశీ క్రీడలకు ప్రోత్సాహమిస్తూ యోగా తదితర పద్ధతుల్ని విద్యార్థులకి అలవరుస్తున్నారు. కుల, మత భేదాలకు దూరంగా ఉంటూ విద్యార్థుల్లో సామాజిక చైతన్యం కల్పించటంలో ఈ స్కూళ్లు ప్రముఖపాత్ర వహిస్తున్నాయి.

ప్రభుత్వ పాఠశాలల్లో సిబ్బంది కొరత, నిర్లక్ష్యం, నిధుల లేమివల్ల విద్యాప్రమాణాలు అడుగంటిపోయాయన్న కారణంగా తమ పిల్లలను ప్రైవేటు పాఠశాలల్లో చేర్చడం ఈ రోజుల్లో సర్వసాధారణమైపోయింది.

విద్యాప్రమాణాల పెంపుదల ఇతర ఆశయాలతో 1969లో ప్రభుత్వ ఆధ్వర్యంలో గురుకుల పాఠశాల ఏర్పాట్లు ప్రారంభమై నేడు రాష్ట్రవ్యాప్తంగా 105 వరకు పాఠశాలలున్నాయి. ఈ పాఠశాలల్లో విద్యాఫలితాలు బాగుంటున్నందుకు తల్లిదండ్రులు వీటిల్లోనే తమ పిల్లల్ని చేర్పించాలని ప్రయత్నిస్తున్నారు. గురుకుల పాఠశాలలో ప్రారంభదశనుండి ఉత్తమ విద్యాప్రమాణాలు అందిస్తూ, ఫలితాలు సాధించి ప్రజల విశ్వాసాన్ని చూరగొని ప్రశంసల్ని అందుకున్న పాఠశాలలు కొన్ని నేడు విమర్శలకు గురవుతుండటంవల్ల ప్రైవేటు సంస్థలు నిర్వహించే రెసిడెన్షియల్ స్కూళ్ళవైపు సహజంగానే విద్యార్థులు ఆకర్షితులవుతున్నారు. గురుకుల పాఠశాలల్లో ఐదవ తరగతి మొదలు పదవతరగతి వరకు విద్యాబోధన జరుగుతుంది. కొన్ని ప్రాంతాల్లో ఇంటర్మీడియెట్, డిగ్రీ కోర్సులు సైతం గురుకుల విద్యాసంస్థలలో నిర్వహిస్తున్నారు. ఈ విద్యాసంస్థలలో చేరడానికి ముందు విద్యార్థులకు ప్రవేశపరీక్షలు నిర్వహిస్తారు. ముందు సమితి స్థాయిలో ప్రవేశపరీక్ష ఉంటుంది. ఇందులో ప్రతిభ చూపిన విద్యార్థులకి జిల్లాస్థాయిలో ప్రవేశపరీక్ష నిర్వహించి అందులో ఉత్తమ విద్యార్థుల్ని ఎంపికచేస్తున్నారు. గురుకుల పాఠశాలల్లో ఒక్కొక్క తరగతిలో 36 మంది విద్యార్థులు విద్యాభ్యాసం చేయవలసి ఉంది.

1986లో కేంద్రప్రభుత్వం ప్రవేశపెట్టిన జాతీయ నూతన విద్యావిధానంలో భాగంగా నెలకొన్న జవహర్ నవోదయ విద్యాలయాలలో సెంట్రల్ బోర్డు ఆఫ్ సెకండరీ ఎడ్యుకేషన్ పద్ధతిలో విద్యాబోధన జరుగుతుంది. మనరాష్ట్రంలోని అన్ని జిల్లాల్లో 261 నవోదయ విద్యాలయాలున్నాయి. గ్రామాల్లో ఉన్న నిరుపేదలకు ఉన్నత విద్యావకాశాలు కల్పించడానికే స్థాపించిన నవోదయ విద్యాలయాలు కొన్ని అద్భుతమైన ఫలితాలు సాధిస్తుండగా మరికొన్ని వెనుకబడి ఉన్నాయి. ప్రైవేట్ రెసిడెన్షియల్ కాలేజీలు వృద్ధిచెందడానికి ప్రభుత్వ విధానాలే కారణమని కొందరి వాదన.

# మురళీకృష్ణ ఎడ్యుకేషనల్ సొసైటీ




**Regd. No. 161/83,**

వేదాయపాళెం, నెల్లూరు-524 004.

# అడ్మిషన్ - నోటీసు

నర్సు ట్రైనింగ్ చేయగోరు ఆసక్తిగల మహిళా అభ్యర్థినులనుండి ఈ దిగువ తెల్పిన కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.

**1. మురళీకృష్ణ M.P.H.W (F) ట్రైనింగ్ ఇనిస్టిట్యూట్**

(ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మరియు ఇండియన్ నర్సింగ్ కౌన్సిల్‌వారిచే గుర్తింపబడిన సంస్థ)

వేదాయపాళెం, నెల్లూరు-524004.

**చేరుటకు కావలసిన అర్హతలు:**

| | | |
|---|---|---|
| 1. కోర్సు కాలపరిమితి | : | 18 నెలలు |
| 2. విద్యార్హతలు | : | S.S.C. లేదా తత్సమాన పరీక్షయందు ఉత్తీర్ణత |
| 3. వయస్సు | : | 17 సం-30 సం.ల మధ్య, అవివాహితులై ఉండవలెను. SC, ST, BCలకు 5 సం.ల సడలింపు కలదు. |

**2. మురళీకృష్ణ స్కూల్ ఆఫ్ నర్సింగ్**(జనరల్ నర్సింగ్ & మిడ్‌వైఫరీ కోర్సు)

(ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మరియు ఇండియన్ నర్సింగ్ కౌన్సిల్ న్యూఢిల్లీవారిచే గుర్తింపబడిన సంస్థ)

వేదాయపాళెం, నెల్లూరు-524 004.

**చేరుటకు కావలసిన అర్హతలు:**

| | | |
|---|---|---|
| 1. కోర్సు కాలపరిమితి | : | 3 సంవత్సరములు |
| 2. విద్యార్హత | : | ఇంటర్ లేదా 10+2 యందు ఉత్తీర్ణత |
| 3. వయస్సు | : | 17 సం-25 సం॥ల మధ్య వయస్కులైన అవివాహిత స్త్రీలు |

**3. విశాఖ స్కూల్ ఆఫ్ నర్సింగ్** (జనరల్ నర్సింగ్ మరియు మిడ్‌వైఫరీ కోర్సు)

(ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మరియు ఇండియన్ నర్సింగ్ కౌన్సిల్ న్యూఢిల్లీవారిచే గుర్తింపబడిన సంస్థ)

డాక్టర్సు కాలనీ, సీతమ్మధార, విశాఖపట్టణం-13.

**చేరుటకు కావలసిన అర్హతలు:**

| | | |
|---|---|---|
| 1. కోర్సు కాలపరిమితి | : | 3 సంవత్సరములు |
| 2. విద్యార్హత | : | ఇంటర్ లేదా 10+2 యందు ఉత్తీర్ణత |
| 3. వయస్సు | : | 17-25 సం॥ల మధ్యవయస్కులైన అవివాహిత స్త్రీలు |

**దరఖాస్తు చేయువిధానం:**

పైన తెలిపిన ఏ నర్సు ట్రైనింగ్ స్కూల్‌లోనైనా చేరదలచినవారు ఆ స్కూలు ప్రిన్సిపాల్‌కు స్వయముగాగాని లేదా M.O. ద్వారాగాని Rs. 30/– చెల్లించి అప్లికేషన్ ఫారమ్ మరియు ప్రాస్పెక్టస్ పొందవచ్చును. పూర్తిచేసిన అప్లికేషన్ ఫారమ్‌లు స్వీకరించుటకు చివరితేది. 20-6-94. విధిగా హాస్టల్‌యందు ఉండవలెను, అభ్యర్థినుల ఎంపిక ప్రభుత్వ నిబంధనల ప్రకారం జరుపబడును.

**సి. హెచ్. గోపాల్**

సెక్రటరీ & కరస్పాండెంట్

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కూడా ప్రైవేటు కాలేజీల్ని ప్రోత్సహిస్తున్నాయి. డబ్బుకు వెను కాడని తల్లిదండ్రుల పట్టుదల, వృత్తివిద్యలప ట్ల ఉన్న ఆకర్షణ రెసిడెన్షియల్ కాలేజీలు వృద్ధిచెందడానికి అసలు కారణాలు.

మనకు గల రెసిడెన్షియల్ స్కూళ్ళలో విశేషమైన కృషితో, సత్ఫలితాలు సాధించాల న్న లక్ష్యంతో విద్యార్థుల్ని తీర్చిదిద్దుతున్న కొన్ని స్కూళ్ళ వివరాలు ఇలా ఉన్నాయి.

హైదరాబాద్ నగరానికి దూరంగా విశాల మైన ప్రాంతంలో నిర్మించబడిన 'రాజధాని రెసిడెన్షియల్ స్కూలు'లో క్రమశిక్షణతో కూడిన విద్యాబోధన, సమతుల ఆహారం, విద్యార్థి సదుపాయాలపట్ల ప్రత్యేక శ్రద్ధ చూపి అవసరమైనప్పుడు సరైన వైద్యం కూడా అందిస్తున్నారు.

'శీలేన శోభతే విద్యా' అన్న నినాదంతో నెల్లూరులో ప్రారంభమైన 'రత్నం ఎడ్యుకేష నల్ కాంప్లెక్స్' అపర గురుకుల విద్యాలయంలా అద్భుతమైన ఫలితాల్ని సాధించి విజయభేరీ మోగిస్తోంది. ఎందరో విద్యార్థుల్ని సక్రమ మార్గంలో నడిపి, విద్యపట్ల విపరీత మైన ఆసక్తిని పెంపొందించి వారి ఉజ్వల భవిష్యత్తుకు తోడ్పడుతున్న ఈ సంస్థ రత్నం కోచింగ్ సెంటర్, రత్నం రెసిడెన్షియల్ జూనియర్ కాలేజీ, రత్నం రెసిడెన్షియల్ మహిళా కళాశాల, రత్నం రెసిడెన్షియల్ హై స్కూలు, రత్నం గర్ల్స్ హైస్కూలుగా శాఖోప శాఖలుగా విస్తరిల్లుతోంది.

బోడుప్పల్, హైద్రాబాద్‌లో సుమారు ఏడు సంవత్సరాలక్రితం కో-ఎడ్యుకేషన్ స్కూలుగా స్థాపించిన 'సిద్ధార్థ రెసిడెన్షియల్ పబ్లిక్ స్కూల్'లో మంచి విద్యాబోధనతోపాటు సంగీతం, కరాటే, నృత్యం, నిర్బంధ కంప్యూటర్ విద్య, స్కౌట్స్ అండ్ గైడ్స్ కూడా ప్రవేశపెట్టారు. ప్రత్యేకమైన కోచింగ్ ఇచ్చి, అద్భుతమైన ఫలితాల్ని సాధించారు. 1992వ సంవత్సరం ఈ స్కూల్లో 10వ తరగతి విద్యార్థులు నూటికి నూరుశాతం ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు.

1993లో 97 శాతం ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులుకాగా ఈ 1994లో 100 శాతం ప్రథమశ్రేణి సంపాదించేందుకు విశేషంగా కృషిచేశారు.

దాదాపు పది సంవత్సరాలకిందట స్థాపించిన 'జాయ్స్ మెమోరియల్ మహిళా జూనియర్ కళాశాల', చైతన్యపురి, హైదరాబాద్ అనుభవజ్ఞులైన అధ్యాపకులచే క్రమశిక్షణతో కూడిన ఉన్నతస్థాయి బోధన లక్ష్యంగా పెట్టుకుంది. యాజమాన్యం విద్యార్థి సర్వతోముఖ వికాసానికి గణనీయంగా కృషిచేస్తోంది.

ఎంట్రన్స్ పరీక్షలుగానీ, డొనేషన్ల వసూళ్ళుగానీ లేకుండా నేరుగా పాలిటెక్నిక్ డిప్లొమా, ఇంజినీరింగ్‌లలో అడ్మిషన్లు ప్రవేశపెట్టిన సంస్థ 'మార్గదర్శి పాలిటెక్నిక్ మరియు కాలేజ్ ఆఫ్ ఇంజినీరింగ్ సంస్థ', దిల్‌సుక్‌నగర్, హైద్రాబాద్‌లో ఉంది. పరిమితమైన ఫీజుతో విద్యార్థులన్ని తయారుచేయటమే లక్ష్యంగా ముందుకు సాగుతోంది ఈ కాలేజి.

గత సంవత్సరకాలంగా చక్కని క్రమశిక్షణ, ఉన్నత ప్రమాణంలో విద్యాబోధన నిర్వహిస్తున్న సంస్థ హైద్రాబాద్‌లోని 'ఇంటర్నేషనల్ స్కూల్'

వృత్తివిద్యలో మరియు సాంకేతిక విద్యలలో విద్యార్థులకి శిక్షణనిచ్చేనిమిత్తం 1983లో మురళీకృష్ణా ఎడ్యుకేషన్ సొసైటీ అనే సంస్థను స్థాపించారు. ఈ సంస్థ 1984లో నర్సుల శిక్షణార్థమై ANM స్కూలు ప్రారంభించింది. ఈ సంస్థ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మరియు ఇండియన్ నర్సింగ్ కౌన్సిల్‌చే గుర్తింపు పొంది అనేకమందికి ANM కోర్సునందు శిక్షణ ఇచ్చింది. తరువాత 1987లో మురళీకృష్ణా స్కూల్ ఆఫ్ నర్సింగ్ పేరిట నెల్లూరులో 3 సం॥ల నర్సింగ్ డిప్లొమా కోర్సు ప్రారంభించింది. అప్పటినుండి సుమారు 200 మంది నర్సులు శిక్షణ పొంది దేశ, విదేశీ సంస్థలలో ఉద్యోగాలు చేస్తున్నారు. ఈ సంస్థ అన్ని వసతులు కలిగి వున్నందున ఇండియన్ నర్సింగ్ కౌన్సిల్‌వారు రికగ్నిషన్ ఇచ్చి చివరి జాబితాలో చేర్చుకున్నారు. ప్రతి జూన్‌లో అడ్మిషన్లు జరిగే 3 సం॥ల నర్సింగ్

# SHYAM SIDDHARTHA JUNIOR COLLEGE

(Recognised by Govt. of A.P.)

*Regd. Office:*
Opp: Blood Bank,
YMCA Circle,
Narayanaguda,
Hyd.–29, Ph: 592567.

*College block*
Padmashali Bhavan,
Near Shalimar Theatre,
Narayanaguda,
Hyd.–29, Ph: 510417.

**ADMISSIONS ARE OPEN FOR**
**INTERMEDIATE I & II YEAR**
**MPC BPC MEC CEC HEC**
**Co–Education. Both English & Telugu Media**




## INSTITUTE OF ENGINEERING STUDIES

Opp. Blood Bank, Narayanaguda
Hyderabad - 500 029, Ph: 592567, 510417

**The Institution which has students from allover India.**

Institute of Engineering Studies (Estd. 1981) a reputed Institution in A.P. offers excellent coaching for Govt. recognised Diploma & Degree Courses in Engineering

**Degree Courses: Equivalent to B.E.,/B.Tech., Degree**

**• AMIE • AMIMechE • AMIETE • AMAeSI**

(Civil / Mechanical / Electronics / Electrical / Aeronautical / Textile etc.)

**Diploma Courses: Equivalent to Polytechnic Diploma**

**• T.Engg. • Dip. IETE • A.T.Engg. • P.T.Engg.**

(Mechanical / Electronics / Automobile / Production)

| Qualification | Diploma Course | Degree Course |
|---|---|---|
| **SSC** | **3 Years** | **5 Years** |
| **Inter (BPC)** | **2 Years** | **4 Years** |
| **Inter (MPC)** | **1 1/2 year** | **3 1/2 years** |
| **Diploma Holders** | | **2 1/2 years** |

For Details Contact in person or obtain the prospectus and Application for Admission for Rs. 20/– (M.O./D.D.)



**K.Shyam Siddhartha, B.Tech.**
**Secretary & Correspondent.**



కోర్సుకు 17-25 సం॥ల వయసు కలిగిన ఇంటర్ పాస్ అయిన విద్యార్థినులు అర్హులు. 18 నెలల ANM కోర్సులో 17-25 సం॥ల వయసు కలిగియుండి పదవతరగతి పాస్ అయినవారు అర్హులు. ఈ కోర్సులలో అత్యుత్తమ శిక్షణ ఇచ్చి దేశ, విదేశాల్లో ఎక్కడైనా నర్సు వృత్తి చేయడానికి అవకాశం కల్గించడమే ఈ సంస్థ ముఖ్యోద్దేశం.

పదవతరగతిలో ఉన్నత ఫలితాల్ని సాధించేందుకు గణనీయంగా కృషి చేస్తోన్న సంస్థ - శ్రీ చైతన్య పబ్లిక్ స్కూల్ అండ్ హైస్కూల్, రెసిడెన్షియల్ అండ్ నాన్ రెసిడెన్షియల్, విజయవాడ.

గత మూడు సంవత్సరాలుగా ఎంసెట్, ఈసెట్, పాలిటెక్నిక్, బిఇడి, ఎం.సి.ఎ. ఎంట్రన్స్ కోర్సులకు శిక్షణ ఇస్తూ ప్రతియేటా స్టేట్ రాంకుల్ని సాధిస్తోన్న సంస్థ - వి.ఐ.పి. ట్యుటోరియల్ కాలేజి, విజయవాడ.

హనుమకొండలోని నక్కల గుట్టలో కాకతీయ మహిళా జూనియర్ కాలేజీ, తక్షశిల రెసిడెన్షియల్ జూనియర్ కాలేజి, తక్షశిల విద్యానికేతన్, చేతన ప్రైమరీ స్కూలు వంటి సంస్థలు విద్యార్థుల ప్రగతిపై గణనీయంగా కృషిచేస్తున్నాయి.

స్కూలు స్థాయినుండి మెరిట్ విద్యార్థులకి వివిధ ఎంట్రన్స్ పరీక్షల దృష్ట్యా శిక్షణనిచ్చి ప్రత్యేక పద్ధతిలో నడుపుతున్న సంస్థ శ్రీ కృష్ణవేణి రెసిడెన్షియల్ టాలెంట్ స్కూల్.

గత సంవత్సరం జూనియర్ ఇంటర్‌లో స్టేట్‌రాంక్, ఎంసెట్‌లో 8 మెడికల్ సీట్లు, 13 ఇంజినీరింగ్ సీట్లు సాధించిన సంస్థ - ఆదర్శ రెసిడెన్షియల్ కాలేజి, ఒంగోలు. దీనిలో అధునాతన వసతులతో కూడిన ప్రత్యేక హాస్టల్ సౌకర్యం ఏర్పర్చారు.

ఉత్తమ ఉపాధ్యాయ వర్గంతో ప్రశాంత వాతావరణంలో నడిచే సిద్ధార్థ రెసిడెన్షియల్ స్కూల్, గుంటూరులో ఈ స్కూలు అత్యుత్తమ ప్రమాణాలకూ, ఫలితాలకూ వేదిక అని చెప్పవచ్చు.

45 సం.లుగా. వేలకొలది విద్యార్థుల్ని

# రాష్ట్రంలో మొట్టమొదటి రెసిడెన్షియల్ టాలెంట్ స్కూల్

A.P. రెసిడెన్షియల్
పాఠశాలలు, నవోదయ పాఠశాలల తరహా
లోనే కాక ప్రైవేట్ రంగంలో ప్రప్రథమంగా స్కూల్ స్థాయి నుండి
Merit Studentsకు వివిధ ఎంట్రన్స్ పరీక్షల దృష్ట్యా (EAMCET, APRJC,
POLYTECHNIC ఎంట్రన్స్) శిక్షణ ఇచ్చు ప్రత్యేక పద్ధతిలో నడుపుచున్న సంస్థ

"శ్రీ కృష్ణవేణి టాలెంట్ స్కూల్"

1993 సం॥లో శ్రీ కృష్ణవేణి సంస్థలో శిక్షణపొందిన విద్యార్థులు, **APRJC** ఎంట్రన్స్ **(MPC)**లో **FIRST** ర్యాంకు, పాలిటెక్నిక్ ఎంట్రన్స్‌లో **STATE FIRST RANK,** ఇంజనీరింగ్ ఎంట్రన్స్‌లో **(ECET–93)** లో మూడు బ్రాంచిలలో **FIRST RANK** సాధించుటతో పాటు 23మంది **STATE** రాంకులు, సుమారు 350 మంది ఇంజనీరింగ్ సీట్లు, 300 మంది పాలిటెక్నిక్, **APRJC** సీట్లు కూడా సాధించిన అనుభవముతో స్కూలుస్థాయినుండే **Merit Students**కు ఎంట్రన్స్ పరీక్షల దృష్ట్యా శిక్షణ ఏర్పాటుచేస్తూ ప్రత్యేక తరహాలో స్కూల్ కార్యక్రమము ఏర్పాటు చేయుచున్నాము

– చిగురుపాటి వరప్రసాద్ B.Tech.,M.E.. కరస్పాండెంట్

| **APRJC – FIRST RANK** | **POLYTECHNIC – FIRST RANK** |
|---|---|
|  |  |
| **V. Ravichandra Receiving Rs. 20,000/–** | **K. Harinarayana Receiving Rs. 50,000/–** |
| శ్రీ కృష్ణవేణి టాలెంట్ స్కూల్‌లో శిక్షణపొంది 1993 సం॥లో **APRJC** ఎంట్రన్స్‌లో **FIRST** రాంకు సాధించిన V. రవిచంద్రకు రాష్ట్ర సాంకేతిక విద్యాశాఖామాత్యులు శ్రీ M.K. బేగ్ గారిచే రూ. 20,000/– **Cash Award** ఇచ్చిన దృశ్యం | శ్రీ కృష్ణవేణి సంస్థలో శిక్షణ పొంది 1993 సం॥లో పాలిటెక్నిక్ ఎంట్రన్స్‌లో **State First Rank** సాధించిన K. హరినారాయణరావుకు రాష్ట్ర సాంకేతిక విద్యాశాఖామాత్యులు శ్రీ M.K. బేగ్ గారిచే రూ. 50,000/– **Cash Award** ఇచ్చిన దృశ్యం. |

## అడ్మిషన్లు

- ★ IV నుండి X వరకు **(English Medium State Syllabus)**లో అడ్మిషన్లు ఇవ్వబడును (హాస్టలులో ఉండే విద్యార్థులకు మాత్రమే)
- ★ IX, Xలలో మాత్రమే **(Telugu Medium)** అడ్మిషన్లు ఇవ్వబడును.
- ★ ప్రతి ఆదివారము **Test/Interview** ప్రాతిపదికపై అడ్మిషన్లు ఇవ్వబడును. **(Previous** క్లాస్ సబ్జక్టుపై **Test** జరుగును)
- ★ అప్లికేషను, ప్రాస్పెక్టస్ కొరకు ఈ క్రింది అడ్రసుకు రూ. 25/- **M.O.** పంపండి.

**Sri Krishnaveni Residential School**
K.C.P. Colony, VIJAYAWADA–7, Phone: 58449

**Academic Council Members of our Talent School (1993–94)**

- ★ Sri R. Ramachandra Rao Retd. Head Master
- ★ Sri M. Venkateswara Rao Retd. Head Master
- ★ Sri A. Mohandas Retd. Head Master
- ★ Sri B. Jampa Reddy Retd. Teacher
- ★ Sri Ramacharyulu Retd. Head Master
- ★ Sri A. Rama Mohan Rao Retd. Head Master
- ★ Sri N. Chakradhara Rao Retd. Teacher
- ★ Sri Janaki Ramaiah Retd. Teacher
- ★ Sri A. Subba Rao Retd. Teacher
- ★ Sri Sangeet Kumar Retd. Head Master

Director of Public School
**Sri N.C.S. RAO**
Retd. Principal of Public School & Sainik School, Korukonda

SHAH - Bor

# శ్రీకృష్ణవేణి రెసిడెన్షియల్ టాలెంట్ స్కూల్

**Campus:**
పోరంకి, విజయవాడ

Administrative Office & Address for correspondence



**Sri Krishnaveni Residential School**
K.C.P. Colony, Vijayawada–7
Phone: 58449

డాక్టర్లుగా, లాయర్లుగా తీర్చిదిద్దిన సంస్థ శ్రీరామా రూరల్ కళాశాల, చిలమూరు. స్టేట్ రాంకుల సాధన కొరకు ప్రత్యేక శిక్షణ విభాగం ఏర్పర్చారు ఈ విద్యాలయంలో.

జి.వి.ఆర్&యస్. జూనియర్, డిగ్రీ కళాశాల, (గుంటూరు)లో ఇంటర్, డిగ్రీ కోర్సులతోపాటు ఎంసెట్‌కి కూడా కోచింగ్ ఇస్తున్నారు.

అత్యున్నతస్థాయిలో బోధించగల విశేషానుభవం కలిగిన అధ్యాపకులతో ప్రారంభించబడి ప్రశంసలు పొందుతున్న సంస్థ తిరుపేట లోని యస్.వి.కె. రెసిడెన్షియల్ జూనియర్ కాలేజ్.

పరిమిత సంఖ్యలో ప్రవేశాలనిచ్చి ప్రతి 15 మంది విద్యార్థులకి ఒక ఉపాధ్యాయునిచే ప్రత్యేక శ్రద్ధ తీసుకునే పతంజలి రెసిడెన్షియల్ స్కూల్, సిద్దిపేట. స్కూలు విద్యార్థులకి చదువుపై శ్రద్ధ పెరిగేలా చేసి ఉత్తమ ఫలితాల్ని సాధించేందుకు గణనీయంగా కృషిచేస్తోందిది

స్టేట్ రాంకులు సాధించేందుకు విద్యార్థులకి ప్రత్యేక శిక్షణలిస్తూ అత్యుత్తమ విద్యాప్రమాణాలకి ఆదర్శప్రాయంగా నిలిచిన సంస్థ రామకృష్ణా రెసిడెన్షియల్ జూనియర్ కాలేజ్ & పబ్లిక్ స్కూల్ విశాఖపట్నం.

ఇంటర్మీడియట్ బాలబాలికలకు సునిశిత శిక్షణ ఇచ్చే శ్యాంసిద్దార్థ జూనియర్ కాలేజి & ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంజనీరింగ్ స్టడీస్, హైద్రాబాద్. ఇంజనీరింగ్ స్టడీస్‌కి అత్యుత్తమమైన శిక్షణనిస్తోంది. బి.ఇ., బి.టెక్ డిగ్రీ కోర్సులకి సమమైన కొన్ని కోర్సులకేగాక డిప్లొమా కోర్సులకీ బోధనందిస్తోంది.

ఇంటర్ విద్యార్థులకి ఉత్తమ శిక్షణనిచ్చే సంస్థ సాధన రెసిడెన్షియల్ కాలేజ్ & కోచింగ్ సెంటర్, నెల్లూరు. గత 2 సంవత్సరాలనుండి వివిధ తరగతులలో అపూర్వమైన ఫలితాలు సాధిస్తోంది. వీరి అనుబంధ సంస్థ అయిన స్పందన ఇంగ్లీషు మీడియం స్కూల్లో ఎల్.కే.జి నుండి 10వ తరగతి వరకు శిక్షణనిస్తోంది.

మా అబ్బాయి కృష్ణచైతన్య గత సంవత్సరం నుండి పతాంజలి రెసిడెన్షియల్ స్కూల్‌లో చదువుతున్నాడు.

# మేము తీసుకున్న నిర్ణయం మీరు కూడా తీసుకోండి



పతాంజలి రెసిడెన్షియల్ స్కూల్‌లో చేర్పించినప్పటి నుండి మా అబ్బాయిలో ఎంతో మార్పు వచ్చింది. ఇప్పుడు తనకి చదువుపై శ్రద్ధ చాలా పెరిగింది. తన భవిష్యత్తు గురించి మాకెప్పుడూ ఆందోళనగా ఉండేదితర్వాత కృష్ణచైతన్యలో వచ్చిన మార్పును చూస్తుంటే మాకు చాలా సంతోషంగా ఉంది. మీరు కూడా ఒకసారి ఈ స్కూల్‌ను చూసి అక్కడి ప్రిన్స్‌పాల్‌ని కలిసి మీ పిల్లల భవిష్యత్తుకు మంచి మార్గాన్ని చూపించండి.

మీ శ్రేయోభిలాషులు శ్రీమతి & శ్రీ జి. మురళీకృష్ణ, అవిడి, కొత్తపేట మండలం, తూర్పుగోదావరి జిల్లా, ఆంధ్రప్రదేశ్.

• 1వ తరగతి నుండి 7వ తరగతి వరకు 140 విద్యార్థులకే అడ్మిషన్. • ప్రతి 15 మంది విద్యార్థులకు ఒక ఉపాధ్యాయుడిచే వ్యక్తిగతశ్రద్ధ. • సికింద్రాబాద్ నుండి 80 కి.మీ.ల దూరంలో ఉంది. • ప్రశాంత వాతావరణంలో, కాలుష్యానికి దూరంగా, సువిశాలమైన 100 ఎకరాల విస్తీర్ణంలో ఉంది. • కంప్యూటర్లు, అధునాతనమైన దృశ్య మరియు శ్రవణ పరికరాలు ఉత్తమమైన విజ్ఞానాన్ని అందించే ఉపాధ్యాయులు. • ఆహార నిపుణుల పర్యవేక్షణలో తయారు చేయబడిన పుష్టికరమైన ఆరోగ్యకరమైన ఆహారం. • యోగ శిక్షణ, లలితకళలకు ప్రాముఖ్యత. • స్విమింగ్‌పూల్, క్రికెట్, ఫుట్‌బాల్, బాస్కెట్‌బాల్, టెన్నిస్ మరియు హాకీ మైదానాలు.

ప్రిన్స్‌పాల్
లెఫ్టినెంట్.కర్నల్.హెచ్.జి.గుగ్‌లి(రిటైర్డ్),
ఎమ్.ఎ, ఎమ్.ఎస్.సి,ఎమ్.బి.ఎ, బి.ఇడి
(రిటైర్డ్ ఆర్మీ ఎడ్యుకేషన్ కోర్)

ప్రొఫెసర్ టి.నవనీతరావు, మాజీ వైస్‌చాన్స్‌లర్
ఉస్మానియా యూనివర్సిటీ మరియు
శ్రీ కె.వి.రమణ ఐ.ఎ.ఎస్. ల ఆధ్వర్యంలో
ప్రముఖ అడ్వయిజరీ కమిటీ.

ఇతర వివరాలు, అప్లికేషన్ ఫామ్ కోసం
దిగువ తెలిపిన చిరునామాను సంప్రదించండి.

పరిపాలనా కార్యాలయము. 1-11-256/B, ఎయిర్‌పోర్ట్‌రోడ్, ఎయిర్‌పోర్ట్ ఇన్ హోటల్‌దగ్గర, బేగంపేట్, హైదరాబాద్-16. ఫోన్.841813.
స్కూల్‌కేంపస్: మెదక్ రోడ్, సిద్ధిపేట్ 502 103. మెదక్ జిల్లా, ఆంధ్రప్రదేశ్. ఫోన్.08457-3555 గ్రామ్స్. రాగా.




**పతాంజలి**
**రెసిడెన్షియల్ స్కూల్**
**సిద్దిపేట్**



సమత రెసిడెన్షియల్ హైస్కూలు, సమత బాలుర రెసిడెన్షియల్ కాలేజి, సమత జూనియర్ కాలేజి, నవోదయ బాలికల రెసిడెన్సియల్ కాలేజి హైద్రాబాద్‌లోఅనుభవజ్ఞులైన అధ్యాపకులచే బోధన, ఇంటర్‌తోపాటు ఎంసెట్‌కై శిక్షణ, హాస్టల్స్ సౌకర్యం ఇక్కడి ప్రత్యేకతలు.

అకాడమీ ఆఫ్ కాంపిటేటివ్ ఎక్జామ్స్‌నెల్లూరు.వారు బ్యాంక్ క్లర్క్కు, ప్రొబేషనరీ ఆఫీసర్లు 7 ఆర్.ఆర్.బి. యస్.యస్.సి., ఎ.ఎ.ఒ.యస్, ఇన్‌కంటాక్సు ఇనస్పెక్టర్ల ఉద్యోగార్థులకి చక్కని శిక్షణ నిస్తున్నారు

అనుభవజ్ఞులైన అధ్యాపకవర్గంతో కూడిన ఉజ్వల బాలికల గురుకుల కళాశాల మరియు పాఠశాలకరీంనగర్‌లోఉంది. ఇందులోఎంసెట్‌కీ స్టేట్ రాంకర్లకీ ఉచిత శిక్షణ లభిస్తుంది.

విద్యార్థులకి ఉన్నతస్థాయిలో శిక్షణ, క్రమశిక్షణ, ఉత్తమ ఫలితాలు అందిస్తున్న రెసిడెన్షియల్ కళాశాలల్ని అభినందించి, వారు ఇక ముందు కూడా విద్యార్థుల శ్రేయస్సు కోసం, దేశశ్రేయస్సుకోసం ఇతోధికంగా శ్రమపడి సత్ఫలితాల్ని సాధించాలని ఆశిద్దాం.

-జ్యోతిరాణి

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రను మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

...... జూన్ చతుర నవల **భువికి దిగినతార** ..................

**సమీక్షకుని పేరు :** ..................

**చిరునామా :** ..................

..................

..................

..................

# చతుర - కథలు

## ఖుషీ

బస్సెక్కిన బుచ్చిబాబు ఖాళీ సీటు వెతుక్కుని కూర్చున్నాక, మాస్ సర్దుకోబోతూ క్రిందకి చూసాడు. కళ్లు జిగేల్‌మన్నాయి. కారణం అక్కడున్నది వంద రూపాయల కాగితం. వెంటనే అటూ ఇటూ చూశాడు. ఎవరూ తనని గమనించలేదు. క్రిందకి వంగి దానిని తీసి జేబులో పెట్టబోతూంటే అది తననుకున్నట్టు ఒకటి కాదు. రెండు నోట్లు అని తేలింది.

ఏదేమైనా తను అదృష్టవంతుడే! లేకపోతే ఎప్పుడూ శలవివ్వడానికిష్టపడని ఆఫీసర్ అడగ్గానే శలవివ్వడమేమిటి? అప్పుల బతుకైపోయిన తనకి పండుగ ముందు ఎరియర్స్ రావడమేమిటి? ఏ ఖర్చూ లేకుండా పండుగ బట్టలకి కేటాయించగలగడమేమిటి? పైగా అనుకోకుండా ఈ రెండు వందలు లాభం. తను మహా అదృష్టవంతుణ్ణని మురిసిపోయాడు బుచ్చిబాబు.

అంతలోనే ఏదో గుర్తొచ్చినవాడిలా పైజేబు సాగదీసి చూసాడు. అందులో డబ్బు క్షేమంగా వున్నాననటూ కన్పించింది. అంతలోనే జిప్ వక్కన నడుం లైనింగ్ లోపల ఎవరికీ కనబడకుండా డబ్బులు దాచుకోడానికి కుట్టించుకున్న టికెట్ పాకెట్ మీద చెయ్యివేసి తడిమాడు. "మేమూ క్షేమంగానే వున్నాం" అన్నట్టు అందులోని నోట్లు ఎత్తుగా తగిలాయి. దాంతో ఇవి నిజంగా దొరికిన నోట్లే అని నిర్ధారించుకున్నాడు.

నగటు గుమాస్తా అయిన బుచ్చిబాబు ఆ రెండు వందలతో ఏం చేయాలా? అనే ఆలోచనలో పడ్డాడు. కాస్త సెంటిమెంట్స్ మనిషి గనుక అవి దొరికినందుకు సంతోషించినా అక్రమంగా వచ్చిన సంపాదన నిలవదని, పైగా అనర్థాలు కలిగిస్తుందని ఓ నమ్మకం. అలాగని దొరికింది చూస్తూ చూస్తూ పారేయలేడు. అందుకే అది అనర్థాలు కలిగించేలోగా సద్వినియోగం చెయ్యాలనుకున్నాడు. అంతలోనే గుర్తొచ్చింది... పిల్లలకి స్కూలు యూనిఫారం చిరిగిపోయింది కొనమని శ్రీమతి పెట్టేపోరు. అందుకే అది తీర్దామనుకున్నాడు.

బస్సు దిగి బజార్లోకి వెళ్లి తనకు కావలసినవన్నీ తన ఎస్టిమేషన్ ప్రకారం అన్ని షాపులు తిరిగి కొనేసాడు. తను తెచ్చిన డబ్బు సరిపోవడంతో హుషారుగా వుందతడికి. ఇప్పుడిహ ఆ రెండు వందలమీదా కేంద్రీకరించాడు.

ఎదురుగా వున్నకొట్లో స్కూల్ బాక్సులు వేలాడుతూ కన్పించాయి. పిల్లలిద్దరూ ఎన్నాళ్లగానో అలాంటివి కొనమంటున్న విషయం గుర్తొచ్చింది. తన ఇబ్బందుల వలన ఇన్నాళ్లూ కొనలేదు. మరి ఆలోచించకుండా పెద్దగా బేరమాడకుండానే కొనేశాడు. ఇంకా నలభై రూపాయలు మిగిలింది. ఎదురుగా హొటల్ కన్పించింది. చాలా రోజుల్నుంచి హొటల్‌లో ఫుల్ టిఫిన్ చెయ్యాలనే కోరిక కోరికగానే మిగిలిపోవడం గుర్తొచ్చి తన కిష్టమైనవన్నీ ఒకదాని తర్వాతొకటి ఆర్డరిచ్చి తిని భారీగా బిల్ చెల్లించి బయటపడ్డాడు. ఇంకా కొంత డబ్బు మిగిలిపోయింది. వక్కనేవున్న కిళ్లీ కొట్లో వేలాడుతున్న పత్రికల్ని చూసి ఎప్పుడో పెళ్లికాకముందు చదివిన విషయం గుర్తొచ్చి తన గుమాస్తా బతుకుని తిట్టుకుని రెండు పత్రికలు కొన్నాడు. కొంత చిల్లర మిగిలింది.

"రిక్షా కావాలా బాబు!" అన్న రిక్షావాడి మాటలు విన్పించి వాడిని చీదరింపుగా చూశాడు. "ఎప్పుడూ వెధవ రిక్షా బతుకేనా?" అన్పించింది. ఆటోని పిలిచి సామాన్లు అందులో వేసి "కాంప్లెక్స్‌కి పోనీ" అన్నాడు. అక్కడ దిగాక మీటర్ డబ్బులిచ్చాడు. అప్పటికి తన దగ్గరి రెండు రూపాయలతో సహా ఇందాకటి రెండు వందలూ ఖర్చయ్యాయి.

ఇంట్లోవారికి తెచ్చిన వస్తువుల్ని చూపి వారిలో కన్పించే ఆనందాన్ని గమనించి ఆస్వా

ముఖచిత్రం: జగ్‌మోహన్




దించాడు. ముఖ్యంగా స్కూల్ బాక్సులు తెచ్చినందుకు పిల్లల ఆనందం అంతా ఇంతా కాదు.

నందడి తగ్గాక శ్రీమతి అంది "ఇంతకీ సుబ్బాయమ్మగారు తెమ్మన్న మందులు తెచ్చారా?" అని

అప్పుడు గుర్తొచ్చిందతడికి పొద్దున్న తను బయలుదేరుతూంటే పక్కింటి సుబ్బాయమ్మగారు వచ్చి తనక్కావాల్సిన మందులు ఈ ఏరియా షాపుల్లో దొరకటంలేదని, రెండు వందలిచ్చి తెచ్చిపెట్టమన్న విషయం. పెద్ద మొత్తం కాబట్టి దాన్ని టికెట్ పాకెట్లో పెట్టిన విషయం గుర్తొచ్చింది.

"అయితే అవేమయినట్టు?" అని ఆలోచిస్తూండగానే అతడి భార్య అంది,

"మీరు హడావుడిలో మందుల చీటీ ఇంట్లో వదిలేసినపుడే అనుకున్నాను ఇలాంటిదేదో అవుతుందని. పాపం ఆ ముసలావిడకి మందులు లేకపోతే గడవదాయె" అంది స్వగతంగా అనుకుంటున్నట్లు.

అవేవీ తన తలకెక్కలేదు బుచ్చిబాబుకి. ఉదయం జరిగిన సంఘటనల్ని తలచుకోడంలో నిమగ్నమయ్యాడు. సుబ్బాయమ్మగారిచ్చిన రెండువందలూ హడావుడిగా టికెట్ పాకెట్‌లో పెట్టబోయి నడుం దగ్గర ఖాళీగా వున్న చోట దోపేసి వుండొచ్చనీ, అవే జారి బస్సులో తన కాళ్లదగ్గర తనకే దొరికి ఉండవచ్చనీ ఊహించడానికెంతోసేపు పట్టలేదతడికి.

ఆ వూహ రాగానే సుబ్బాయమ్మగారి దగ్గర తన పరువు నిలబెట్టుకునేందుకు హడావుడిగా బయటికి పరుగెత్తాడు బుచ్చిబాబు, ఓ రెండు వందల అప్పివ్వగల వాడెవడా అని ఆలోచిస్తూ.

**-అయ్యగారి శ్రీనివాసరావు**

---

## అమాయకురాలు

"మన పురుషోత్తం వైఫ్ మెడలో మంగళసూత్రం గొలుసు తెంచుకుపోయాడట ఎవడో దొంగ! వాడు లబోదిబో మంటున్నాడు" ఆఫీసులో అడుగుపెడుతూనే అన్నాడు పరాంకుశం.

"నిజమా... ఎలా జరిగిందేమిటి? ఆవిడ అసలు ఇల్లువదిలి బయటికేరాదని వాడు ఎన్నోసార్లు అన్నాడే?" అందరం ఆశ్చర్యపోతూ అడిగాం కోరస్‌గా.

"వేసవిగదా రాత్రి పెరట్లో మంచాలు వేసుకుని పడుకున్నారట... ఏటైంలో ఎలా జరిగిందో ఏమో ఆ దొంగతనం? వివరాలు అడిగితే, 'అంతా నా ఖర్మ, నా తలరాత' అంటాడే తప్ప వివరాలేం చెప్పడంలేదు" సీట్లో కూర్చుంటూ అన్నాడు పరాంకుశం.

"వాళ్ళావిడ ఒట్టి అమాయకురాలట గురూ? పాపం వాడెన్నోసార్లు నా దగ్గర చెప్పుకుని వాపోయాడు కూడాను" అన్నాడు కాంతారావు.

"ఏమో మనమేం చెప్పగలం?" అని సాంబశివుడు ఏదో అనబోతుండగా నేను కల్పించుకుని, "సరే సాయంత్రం ఆఫీస







య్యాక వెళ్ళి పలకరించి వద్దాం. వెళ్ళి ధైర్యం చెప్పడం మన కనీస బాధ్యత'' అన్నాను.

''ఓకే'' అన్నారు సహోద్యోగులు.

★ ★ ★

అనుకున్న ప్రకారం సాయంత్రం పురుషోత్తం ఇంటికి చేరుకునేసరికి వరండాలో ఈజీ ఛెయిర్‌లో కూర్చుని ఉన్నాడు పురుషోత్తం. ముఖమంతా పీక్కుపోయి ఉంది. పాపం ఎంతైనా దిగులు దిగులేగదా. మమ్మల్ని చూస్తూనే జీవంలేని నవ్వొకటి నవ్వి 'రండి రండి' అంటూ లేచి ఆహ్వానించాడు. ఆ తర్వాత వాళ్ళావిడ్ని ఉద్దేశించి, 'ఏమోయ్ నిన్నే... మావాళ్ళొచ్చారు ఓ ఆరు కప్పులు కాఫీ'' అన్నాడు లోనికి చూస్తూ.

''ఇప్పుడిలాంటి మర్యాదలేమీ వద్దు... అసలేం జరిగిందో చెప్పు'' అన్నాన్నేను సూటిగా విషయంలోకి వచ్చేద్దామని.

''ఏం చెప్పమంటావ్? అంతా నా ప్రారబ్ధం!'' అంటూ నుదురుపట్టుక్కూర్చుండిపోయాడు పురుషోత్తం.

''ఎన్ని కాసులుంటుందేమిటి?''

''నాలుగు వాయిదాల్లో కొన్నానామధ్య. దాని తాలూకు బాకీ ఇంకా పూర్తిగా తీరనేలేదు'' దిగులుగా అన్నాడు వాడు. పాపం వాడిపరిస్థితి చూస్తే మాకందరికీ వల్లమాలిన జాలేసింది. ఇంతలో కాఫీ కప్పుల ట్రేతో వరండాలోకొచ్చింది వాడి శ్రీమతి మంగతాయారు. కాఫీ కప్పు అందుకుంటూ, ''అసలు జరిగిందేమిటో నువ్వైనా చెబుతావా అమ్మాయ్?'' చనువుగా అడిగాన్నేను.

ఆమె ఏమీ మాట్లాడలేదు.

''అది సరేనమ్మా... దొంగవెధవ మెడలో గొలుసుతీస్తుంటే నీకు మెలకువైనా రాలేదా?'' కాఫీ సిప్ చేస్తూ అడిగాడు పరాంకుశం.

''మెలకువ రాకపోవడమేంటండీ... అసలు వాడు పెరటిగోడ దూకి దొడ్లోకి వచ్చినపుడే మేలుకున్నాన్నేను'' అందామె నేల చూపులు చూస్తూ.

''మరైతే గట్టిగా కేకలు పెట్టాల్సింది...'' అన్నాడు కాంతారావ్.

''అదే అనుకున్నానండి. కానీ నిన్న శుక్రవారం గదాండీ''

''శుక్రవారమైతే?'' పరాంకుశం గొంతులో సస్పెన్స్ ఉట్టిపడింది.

''శుక్రవారం నాకు మౌనవ్రతం గదండీ! వ్రతభంగమౌతుందనీ...''

మేమందరం షాక్ తిన్నాం. రెండు నిముషాల తర్వాత నేనే ఎలాగో గొంతు పెగుల్చుకుని ''పోనీ కనీసం పక్కనున్న మీ ఆయన్ని చేత్తోనైనా తట్టి లేపాచ్చుగా?'' అన్నాను.

''అబ్బే అదెలా వీలవుతుందండీ?''

''ఎందుకు వీలుకాదు?'' నాకు కోపం తన్నుకొస్తోంది.

''రాత్రి రెండు చేతులకీ గోరింటాకు పెట్టుకుని పడుకున్నానుగదండీ'' అంటూ చరచర లోపలికి వెళ్ళిపోయింది శ్రీమతి మంగతాయారు.

-ప్రతాపచంద్ర

# ఘోర ప్రపంచం

## కపాలమోక్షం?

మనదేశంలో పెద్దఎత్తున జరుగుతున్న కపాలాల వ్యాపారం గురించి చాలామందికి తెలియదు. హిందువుల శవాలను ఎక్కడికక్కడ దహనంచేస్తున్నా లక్షలాది పుర్రెలు ఇక్కడి నుంచి విదేశాలకి ఎగుమతి అవుతున్నాయి. పైగా ప్రభుత్వం 24 సంస్థలకు ఈ మానవపుర్రెల వ్యాపారం చేసుకుందుకుగాను లైసెన్స్‌లు ఇచ్చినట్టు తెలుస్తోంది. మరో 50 సంస్థలవారు ఈ లైసెన్స్‌లకోసం ప్రభుత్వానికి దరఖాస్తులు పెట్టుకొని వేచిచూస్తున్నారు. సి.బి.ఐ. రిపోర్ట్‌ప్రకారం ఇండియా మొత్తంమీద ఈ 24 కాక ఇంకా ఎన్నో సంస్థలు లైసెన్స్ లేకుండానే ఈ వ్యాపారాన్ని నడుపుతున్నట్టు తెలుస్తోంది.

కొన్ని సంస్థలు చట్టసమ్మతంగాను, మరికొన్ని సంస్థలు దొంగతనంగాను చేస్తున్న ఈ వ్యాపారం సుమారు 50 దేశాలతో జరుగుతోంది. దీని రాబడి సంవత్సరానికి మూడుకోట్లు.

ఫ్రాన్స్, కెనడా, ఆస్ట్రేలియా, వెస్ట్‌జర్మనీ, బ్రిటన్, ఇరాక్, ఇజ్రాయిల్, బెల్జియం, న్యూజిలాండ్, స్విట్జర్లాండ్, హాంగ్‌కాంగ్, స్వీడన్, నార్వే, సింగపూర్ దేశాలు భారతీయ కపాలాలను, కంకాళాలను దిగుమతిచేసుకోవడంలో మిగతాదేశాలకన్న అగ్రగాములుగా వున్నాయి. చనిపోయిన వ్యక్తిని భద్రంగా భూస్థాపితం చేసే క్రైస్తవదేశాలవారు తమ దేశాల్లోని నిబంధనలవల్ల, మతపరమైన ఇబ్బందులవల్ల పుర్రెలను పోగుచేయలేక, దహనంచేసే హిందూదేశంనుంచి దిగుమతి చేసుకుంటున్నారంటే ఆశ్చర్యకరమైన విషయమే. ఈ కపాలాలను, కంకాళాలను ఆయా దేశాల్లో ఆసుపత్రులలోను, ప్రయోగశాలల్లోను, మ్యూజియం, వైద్యకళాశాలల్లోనూ ఉపయోగిస్తున్నారు.

ఇండియా మొత్తంమీద కలకత్తానుంచి అధికసంఖ్యలో కపాలాలు ఎగుమతి అవుతున్నట్లు తెలుస్తోంది. ఇక్కడ పదిహేను సంస్థలకు పైగా ఈ వ్యాపారాన్ని చేపట్టాయి. ఏటా లక్షకు పైగా పుర్రెలు, అస్థిపంజరాలు ఇక్కడి



నుంచి ఎగుమతి అవుతున్నట్టు లెక్కలు చెబుతున్నాయి.

పుర్రెయొక్క ఖరీదు, దాని విలువ ఆ పుర్రెకుండే పళ్ళమీద ఆధారపడివుంటుంది. ఈ వ్యాపారస్థులు పుర్రెకుండే పళ్ళను తమ పరిభాషలో 'ముత్యాలు' అంటారు. 19 నుంచి 32 పళ్ళవరకూ వున్న పుర్రెకు లేదా అస్థిపంజరానికి విలువ ఎక్కువ. అటువంటి పుర్రె ధర ఇండియాలో 300 వుంటే విదేశాల్లో 3,000 పలుకుతుంది.

అసలు ఈ కపాలాల, కంకాళాల వ్యాపారం మొట్టమొదట 1936లో ప్రారంభమయింది. 1954లో దీనికి చట్టసమ్మతంగా లైసెన్స్ కూడా దొరకడంతో అప్పటినుంచీ ఇది మూడుపుర్రెలూ, ఆరు అస్థిపంజరాలు అన్నట్టు అభివృద్ధి చెందుతోంది. ఇది అత్యంత లాభదాయకమైన వ్యాపారంగా రూపొంది, దీన్ని చేపట్టిన వ్యక్తి అనతికాలంలోనే కోటీశ్వరుడైపోవడం జరుగుతోంది. దాంతో ఈ వ్యాపారంలో ఎన్నో అవకతవకలు, అక్రమాలు చోటుచేసుకుంటున్నాయి.

ఆసుపత్రులనుంచి శవాలు అదృశ్యమయిపోతున్నాయి. 1976లో ఇందిరాగాంధీ ప్రధానమంత్రిత్వంలో ఈ వ్యాపారం నిషేధించబడింది. అప్పటి హోమ్ మినిష్టర్‌గారు కూడా 'ఈ వ్యాపారంమీద వచ్చే 1.30 కోట్ల రూపాయలకంటే దేశగౌరవం, మర్యాద ముఖ్యం' అన్నారు. కానీ 1977లో జనతాప్రభుత్వం ఈ వ్యాపారంమీద నిషేధాన్ని తొలగించింది. అటుతర్వాత పార్లమెంటులో బి.జె.పి. అభ్యర్థులు ఈ విషయంపై కలకలం లేవదీసి, ఈ వ్యాపారాన్ని నిషేధించవలసిందిగా వత్తిడితెచ్చారు. కానీ దీంట్లో ఎలాంటి అవకతవకలు జరగకుండా జాగ్రత్త తీసుకుంటామంటూ పాలకవర్గం వారిని సమాధానపరిచింది.

చాలా రాష్ట్రప్రభుత్వాలు తమ రాష్ట్రాల్లో లైసెన్స్ ఇచ్చిన సంస్థల గురించే ఆలోచించారుగానీ, లైసెన్స్‌లేని ఎన్నో సంస్థలు ఈ వ్యాపారాన్ని అక్రమపద్ధతుల్లో చేస్తున్నాయన్న విషయాన్ని పట్టించుకోకుండా తెలియనట్టు ఊరుకుంటున్నాయి.

అలాంటి రాష్ట్రాల్లో బీహార్ ఒకటి. పశ్చిమబెంగాల్ తరువాత అత్యధిక సంఖ్యలో కపాలాల ఎగుమతి వ్యాపారాన్ని సాగించేది బీహార్ రాష్ట్రమే. ఇక్కడ 11 సంస్థలకి పర్మిషన్లుండగా 20కి పైగా సంస్థలు పర్మిషన్ లేకుండా ఎగుమతిచేస్తున్నాయి. 'ఈ సంస్థల్లో సంఘంలో పేరు మోసిన పెద్దల హస్తం కూడా వుండటంతో ప్రభుత్వం నోరు విప్పటంలేదు' అంటారు కొందరు.

హాస్పటళ్ళనుంచి, నదీతీర ప్రాంతాలనుంచి, స్మశానాలనుంచి శవాలను దొంగిలించి తెచ్చి అనాథ ప్రేతాలనో, లేదా తమవాళ్ళేననో అబద్ధమాడి వ్యాపారాన్ని చేస్తున్నారు చాలామంది. 'నిజానికి అనాథ ప్రేతాలకి దహన సంస్కార ఖర్చులు పెట్టుకోవలసింది ప్రభుత్వం. మరి అలాంటి అనాథప్రేతాలను ఎవరో మాకు కావాలని తీసుకుపోతుంటే చూస్తూ వూరుకోడంలో అర్థం ఏమిటి? అని నిలదీస్తున్నారు కొందరు. అసలు చనిపోయిన వ్యక్తి తాను బతికుండగాగానీ, లేదా చనిపోయాక అతని బంధువులుగానీ అతని దేహాన్ని సమాజసేవకులు తీసుకుని ఉపయోగించుకోవచ్చు అన్న అంగీకారాన్ని రాతమూలకంగా ఇస్తేగానీ లైసెన్స్ పొందిన వ్యాపారులకు శవం హస్తగతం కాదు. అటుపైన ఆ ప్రాంతం పోలీసుల నుంచి 'నో అబ్జెక్షన్' సర్టిఫికెట్ తీసుకోవలసి వుంటుంది. అప్పుడే ఆ కంకాళం విదేశయానానికి సిద్ధపడేది. ఈ లాంఛనాల వ్యవహారంలోని లావాదేవీలే ఎంతోమంది దొంగవ్యాపారులని పెంచిపోషిస్తున్నాయని విమర్శిస్తున్నారు కొందరు. ఆమధ్య బీహారులో ఓ గ్రామంనుంచే దాదాపు 600 అస్థిపంజరాలు ఒకే వ్యక్తిద్వారా ఎగుమతి చేయబడ్డాయి. అంటే అతని పలుకుబడిని ఊహించుకోవచ్చు.

## ఎగిరే మనుషులు

ఆమధ్య దూరదర్శన్‌లో నడిచిన 'స్పైడర్ మాన్' సీరియల్ చిన్నపిల్లలనేకాక యువతని కూడా కొంతవరకూ ప్రభావితం చేసిందనే చెప్పాలి. ఏమాత్రం కష్టపడఖ్ఖర్లేకుండా అలా హాయిగా గాలిలో విన్యాసాలు చేసే శక్తివుంటే బాగుండునని ఎవరికి మాత్రం అనిపించదు. అనిపించడంవరకే అయితే ఫరవాలేదుగానీ,







ఆ శక్తేదో వచ్చేసినట్టు భావించేసి దాన్ని ప్రయోగించబోయినప్పుడే అసలు చిక్కులు ఎదురయ్యేది. ఈ చిక్కులు కొనితెచ్చుకున్న పిల్లల్లో శంకర్ అనే కుర్రవాడొకడు. ఆరేళ్ల శంకర్ ఓ ఎత్తయిన గోడెక్కి స్పైడర్‌మాన్ అని అరుస్తూ ఒక్క దూకుదూకి కాళ్లు విరగ్గొట్టుకున్నాడు.

మధ్యలో కొన్నాళ్లపాటు ఈ సీరియల్‌ని ఆపేస్తే ప్రేక్షకులు దూరదర్శన్ ఆఫీసువద్దకు వచ్చి సానా అల్లరీ చేయడంతో మళ్లీ కొనసాగించారు టీవీ వారు.

ఆమధ్య అమెరికాలో జరిగిన సంఘటన కూడా చాలా హృదయ విదారకమనక తప్పదు. మార్టిన్ అనే కుర్రవాడు స్కూల్లో విచిత్ర వేషధారణ పోటీలకు స్పైడర్ మాన్ డ్రస్‌తో వెళ్లి ఫస్ట్ ప్రైయిజు తెచ్చుకున్నాడు. అందరూ వాడిని మెచ్చుకుంటూ కొట్టే చప్పట్లు మార్టిన్‌లో తెలియని ఉత్సాహాన్నీ ధైర్యాన్నీ తెచ్చాయి. తను కూడా స్పైడర్ మాన్‌లా ఎగరగలననుకున్నాడు. అంతే ఆసాయంత్రం ఎవరూ చూడకుండా 20 అంతస్థుల భవనంపైకి వెళ్లి స్పైడర్‌మాన్ అని అరుస్తూ దూకేశాడు. అటుపైన మార్టిన్ స్థితి ఏమిటో మనం ఊహించుకోగలం. ఈ సంఘటన అమెరికా మొత్తాన్ని దడదడలాడించడంతో ఆ సీరియల్‌ని తక్షణం నిలిపివేయమని ప్రభుత్వం ఆర్డరు జారీ చేసింది.

ఏది ఏమయినా టీవీలు లేదా రేడియోలు లాంటి ప్రసార సాధనాలు ప్రజలకు విజ్ఞానాన్ని వినోదాన్ని అందివ్వాలిగానీ ఇలాంటి ప్రాణాంతకపు ఆలోచనలని పుట్టించేవిగా వుండరాదనేది నిర్వివాదాంశం.

## అసలు జబ్బు అదీ...

**అ**సలే చిత్రమైన రోగాలు పుట్టుకొస్తున్న ఈ రోజుల్లో డాక్టర్ల అజాగ్రత్తవల్ల కొన్ని ప్రాణాంతకాలుగా కూడా మారుతున్నాయి. 22 సంవత్సరాల వయసులో గుండె ఆపరేషన్ జరిగింది ఓ ఆసామికి. ఆపరేషనయ్యాక కొద్ది రోజులదాకా బాగానే వున్నాడు అతగాడు. అటుపైనుంచీ తరచూ జలుబు, దగ్గు వగైరాలతో బాధపడేవాడు. చల్లటి పదార్థాలు తింటే దగ్గు మరింత ఎక్కువయ్యేది. ఈ బాధపడలేక ఓసారి డాక్టరు వద్దకు వెళ్లాడు అతడు. పరీక్షలన్నీ చేసిన మీదట గుండె వాల్వ్ ఒకటి చెడిందనీ, ఆపరేషన్ చెయ్యవలసి వుంటుందనీ బెదిరించాడా వైద్యుడు. అయినా ఆ మాటల్ని పట్టించుకోక తాత్కాలికోపశమనం కోసం యాంటీ బయొటిక్స్, కాఫ్ సిరప్పులూ వాడి ఊరుకున్నాడు. ఇంతలో అతనికి విదేశయానం తగిలింది.




విదేశాలకి వెళ్లాడేగానీ అక్కడా దగ్గూ, జలుబు అతన్ని వదల్లేదు. పైగా బరువైన దగ్గుతోపాటు ఉమ్మితే రక్తం పడడం ప్రారంభించింది. అక్కడొక టి.బి. స్పెషలిస్టును కలిశాడతడు. ఆయన బ్రాంఖియోస్కోపీ చేశాడు. దీని ప్రకారం నోటినుండి ఊపిరితిత్తులదాకా ఒక గొట్టాన్ని పంపి దాని చివర ఒక లైటు నమర్చి ఆ లైటు సాయంతో ఊపిరితిత్తుల స్థితిగతులను తెలుసుకోవచ్చు. కానీ ఊపిరితిత్తులు హాయిగా మామూలుగా వున్నాయని తేలింది. మరికొద్ది రోజులకి దగ్గు మరింత ఎక్కువై ఎడతెరిపిలేకుండా రక్తం పడటం ప్రారంభించింది. చివరికి ఇండియా తిరుగు ప్రయాణం కట్టిన అతడు మధ్యలో ఇంగ్లండులో దిగి అక్కడి డాక్టరును సంప్రదించవలసిన అత్యవసర పరిస్థితి ఏర్పడింది. చివరికివాళ్లు గుండెకి సంబంధించిన అన్ని పరీక్షలూ చేసి ఏమీ లేదని తేలడంతో ఊపిరితిత్తులకు మళ్లీ బ్రాంఖియోస్కోపీ చేశారు. ఊపిరితిత్తులలో ఏదో వస్తువు చిక్కుకుని వున్నట్టు తేలింది. ఆపరేషన్ చెయ్యగా అందులోంచి రక్తంతో ముద్దకట్టుకుపోయిన ఓ చేతి రుమాలు లాంటిది బయటపడింది. దాన్ని శుభ్రంగా ఉతికి చూస్తే అది కట్లు కట్టడానికి ఉపయోగించేగాజుగుడ్డ. అంత క్రితం ఎప్పుడో అతనికి జరిగిన గుండె ఆపరేషన్ సమయంలో రక్త స్రావాన్ని అరికట్టడానికి ఒక గాజుగుడ్డని వాడటం, అది అందులోనే మరిచి కుట్లు వేయడం, అది క్రమేపీ ఊపిరితిత్తులలోకి చేరడం, దానివల్ల ఈ దగ్గు, జలుబు, రక్తం పడటం వగైరాలొస్తున్నాయని తేల్చారు డాక్టర్లు.




## బంతి చరిత్ర!

క్రికెట్, ఫుట్‌బాల్, టెన్నిస్ మొదలయిన ఎన్నో ఆటల్లో ప్రముఖపాత్ర వహించే 'బంతి' ఎప్పుడు పుట్టిందో చెప్పడం కష్టమే. అసలు వినోదంకోసం ఓ ఆట ఆడాలని, ఆ ఆటకి బంతిలాంటి గుండ్రపు వస్తువు అవసరమని మనిషి మెదడులో పుట్టేసరికి అతడికి ఇంకా నాగరికత అలవడలేదు. అంతకుమునుపు ఆదిమానవుడు చాలా సమయాన్ని ఆహార, నిద్రలలో వ్యయంచేసేవాడు. క్రమంగా వినోదాల వైపు దృష్టి మళ్ళి ప్రప్రథమంగా కపాలాలని బంతులుగా చేసి ఆడటం ప్రారంభించాడు. క్రమక్రమంగా గుండ్రటి రాళ్ళు, ఎండిపోయిన కాయలు మొదలైనవి బంతిస్థానంలోకి రావడం ప్రారంభించాయి.

మొట్టమొదటిగా కృత్రిమమైన బంతుల

తయారీని ఈజిప్షియన్‌లు ప్రారంభించారు. మట్టి, జంతువుల బొచ్చు, ధాన్యపు ఊక మొదలైన పదార్థాలను కలిపి బంతులను తయారు చేసేవారు. వాటికి మంచి రంగులు పూసి ఆకర్షణీయంగా చేసేవారు.

అప్పటి రోమను రాజైన అగస్టస్‌కి గోళీలాటంటే మహా ఇష్టం. ఈ గోళీలను చెక్కతో చేసేవారు. మొదట్లో ధనవంతులకే పరిమితమైన ఈ గోళీలాట పేదలవరకూ వచ్చి మట్టితో గోళీలను తయారుచేసి ఆడుకోవడం ప్రారంభించారు. ధనికులు చెక్కతోనేగాక లోహాలతో తయారుచేసిన గోళీలతో కూడా ఆడేవారు.

నాగరికత పెరిగినకొద్దీ బంతుల తయారీలో కొన్ని నిర్దుష్టమైన పద్ధతులు చోటుచేసుకున్నాయి. నున్నగా అతి గుండ్రంగా అందమైన బంతులు తయారుచేయడంలో గ్రీకులు, రోమనులు అగ్రగాములుగా వుండేవారు. ప్రఖ్యాత గ్రీకు కవి హోమర్ బంతి ఆటమీద అద్భుతమైన కవితలు రాశాడు. గ్రీసులోని పిల్లలు రోజులో చాలాభాగం బంతి ఆటలోనే గడిపేవారు. ముఖ్యంగా బీచిలవద్ద ఎక్కువగా ఆడటంతో వీటని బీచ్‌బాల్స్ అనేవారు.

రోమనులు ఫెల్లిస్ అనే మరో కొత్తరకం బంతిని కనిపెట్టారు. దీన్ని తోలుతో చేసేవారు. ఈ బంతితో ఆటలోభాగంగా ఆటగాళ్ళు ఒకళ్ళనొకళ్ళు కొట్టుకునేవారు. ప్రాచీన రోమనులు బంతి ఆటలో ఎన్నో కొత్తకొత్త పద్ధతులు కనిపెట్టారు. నీటిమీద కూడా బంతిఆటను అద్భుతంగా ఆడేవారు. జిమ్నాస్టిక్స్‌లో కూడా రోమనులు అగ్రగాములుగా వుండేవారు. స్త్రీపురుష బేధం లేకుండా అందరూ బంతి ఆడేవారు. ఈ ఆటకు సంబంధించిన జట్లు జాతి, మత, కుల, వర్ణప్రాతిపదికమీద విభజింపబడేవి.

గ్రీసులో 16వ శతాబ్దాంతంలో ఫుట్‌బాల్ ఆట కొత్తపుంతలు తొక్కడం ప్రారంభించింది. తోలుసంచులలో పక్షి ఈకలను కుక్కి తయారు చేసిన బంతులు ఎక్కువగా ఉపయోగించేవారు. ఒక్కొక్క టీమ్‌లో ఏభైమంది ఆటగాళ్లు వుండేవారు. ఒక్కొక్క ఆట 12 గంటలు తక్కువ కాకుండా ఆడేవారు. ప్రతి గంటకీ 15 నిమిషాలు విరామముండేది. విరామసమయంలో ఆటగాళ్ళు డాన్సులు, పాటలువంటి వినోదకార్యక్రమాలు నిర్వహించేవారు.




ఇండియాలో 18వ శతాబ్దారంభంలో హాకీ ఆట మొదలయింది. మధ్యప్రదేశ్‌లోని బస్తర్ జిల్లాలోని కొండజాతి ప్రజలు కూడా హాకీ ఆటని ఆడటం ప్రారంభించారు. ఎండుకొబ్బరి కాయలను హాకీ బంతులుగాను, చెట్ల కొమ్మలను హాకీ కర్రలుగాను ఉపయోగించేవారు. స్త్రీ పురుషులు కలిసి ఈ ఆట ఆడేవారు.

ఇలా చెప్పుకుంటూపోతే బంతికి సంబంధించిన మరింత చరిత్ర బయటపడుతుంది.




**TIGRA**
**(20'' B & W)**
**VHF/UHF**
**ఎలక్ట్రానిక్ ట్యూనర్!**
మరియు అనేక రకాల మోడల్స్‌లో
అనుదిన కార్యక్రమాలు
మీ కోసమే
రిజర్వు చేయబడినవి

# Solidaire®

దేశమంతటా
విజయభేరి మ్రోగిస్తోంది






వోల్టేజి మారితే
ఇక బాధ ఎందుకు?
అన్నిటినీ తట్టుకొనే SMPS ఉంది!




అందరికోసమే **Solidaire®** B&W TV ఉన్నది

Insight-S4005

# చతుర

సంపుటి: 17
సంచిక: 5
జూన్: 1994

"నా శరీరానికి సుఖం అవసరంలేదు. ఒళ్లంతా గాయాల జ్ఞాపకాలు. రేపు ఎవరి చెయ్యి దీన్ని స్పృశించినా... స్పందించదు. ఈ గాయాల శరీరాన్ని ఎవరి చేతుల్లోనూ పెట్టలేను... అయితే... నాకు ప్రేమ కావాలి... శరీర సుఖానికి అతీతమైన ప్రేమ... కోరికకి అందని దగ్గరతనం కావాలి..." అంటూ ఆక్రోశించే ఓ కళాకారిణి... జీవితంలోని... వెలుగునీడల విశ్లేషణ...

పి.చంద్రశేఖర అజాద్ రచన





# భువికిదిగిన తార

ఈ నెల చతుర సమగ్ర నవల.

గేటు తీసుకొని ఆ ఇంట్లోకి వెళ్లగానే బాలకృష్ణ కాఫీ తాగుతూ కనిపించాడు.

"రాఘవా రావయ్యా... కమలా ఇంకో కప్పు కాఫీ'' అని అరిచాడు బాలకృష్ణ.

"నేనిప్పుడే తాగివస్తున్నా'' అన్నాడు రాఘవ.

"మరేం ఫర్వాలేదు. కాఫీ ఎన్నిసార్లయినా తాగొచ్చు''

"ప్రేమగారు లేరా?"

"లేదు.. ఇంతకుముందే బయటకు వెళ్లింది. ఈ రోజు నీకో విశేషం. డాబా మీద గది కడతానంటే మీరంతా 'ఇప్పుడెందుకులే అన్నారా? ఈ రోజు దానికే వాల్యూ వచ్చింది. రాత్రికి మన ఇంట్లో షూటింగ్ జరగబోతోంది''

"ఎవరినీ''

"సీరియస్‌గా చెబుతున్నా! సినిమా షూటింగ్. ఈ ఊరు మొత్తం తిరిగినా వారికి ఇలాంటి ఇల్లు దొరకలా. మన ఇల్లు, డాబాగదిలో ముగ్గురు నిరుద్యోగులూ ఇదీ సీన్. అంటే మన గదిని వెండితెరమీద తెలుగు ప్రేక్షకులు చూడబోతున్నారన్నమాట"

"ఎన్ని రోజులుంటుంది షూటింగ్'

"రెండు రోజులుంటుంది''

"మీరెందుకంగీకరించారు. ఈ రెండు రోజులూ ఈ ప్రాంతమంతా హడావుడిగా ఉంటుంది. మనం హాయిగా మాట్లాడుకునే అవకాశం ఉండదు'' అన్నాడు రాఘవ.

"అంగీకరించక ఛస్తామా. ఈ సినిమా తీస్తున్న కుర్రాడు ఈ ఊరివాడు. నాకు బాగా తెలిసినవాడు. ఈ రెండు రోజులూ షూటింగ్ ఎలా జరుపుతారో చూద్దాం. అయినా మిస్టర్ రాఘవా! సాహిత్యంతోనే ఆగిపోకు. నువ్వు మెల్లగా స్క్రీన్ మీదకు వెళ్లాలి''

రాఘవ నవ్వాడు.

"రాత్రికి నీకో మంచి మిత్రుణ్ణి పరిచయం చేయబోతున్నాను. అతను ఈ సినిమాకి కూడా పాటలు రాస్తున్నాడు''

"ఎవరతను?"

"చంద్రం"

"ఆయన మీకెలా పరిచయం?"

"అతను ప్రేమకు మిత్రుడు. తద్వారా నాకూ మిత్రుడు. చాలా హాయిగా మాట్లాడతాడు. మంచి జోక్స్ వేస్తాడు. సాహిత్యం మీద మంచి కమాండ్ ఉంది. సో... రాత్రికి నువ్వు రావటం మానకూడదు. అయ్యో ఇంకా కాఫీ రాలేదు. కమలా!" తిరిగి అరిచాడు.

"వస్తున్నా'' అంటూ వచ్చింది కమల. వీళ్లింట్లో పని చేస్తూ చదువుకుంటోందామె ప్రైవేట్‌గా.

"కాఫీ''

"పాలు అయిపోయాయి''

"అప్పుడేనా?"

"అవును... ఎన్ని పాలున్నా మీకే చాలవుగా'' అని లోపలకు వెళ్లిపోయింది.

"ఈ పిల్లతో బాగా గొడవగా ఉందయ్యా! ఇష్టం అయితే కాఫీ చేసుకు వస్తుంది. ఇష్టంలేనివాళ్లు వస్తే ఇదిగో ఇలానే చెబుతుంది. నీ విషయంలో అలా కాదు. పాలు అయిపోయే ఉంటాయి. అది సరే నా లవ్ ఎపిసోడ్ గురించి నీకు తెలియదుగా''

"అప్పుడే మీకూ సినిమా భాష వచ్చేసింది''

"ప్రేమ నా స్టూడెంట్ రాఘవా, ఇద్దరం ప్రేమించుకున్నాం. గుళ్లో పెళ్లి చేసుకున్నాం. ఆ తర్వాత సరాసరి మా ఇంటికే తీసుకెళ్లా. గేటు మూశారు. గేటు వెనకాల మా జనాభా అంతా గుంపుగా కూర్చున్నారు. గేటు బయట మేమిద్దరం నిలబడ్డాం. ఎవరి ముఖంలోనూ కోపంలేదు. మా అమ్మా, నాన్నా మాత్రం చాలా కోపంగా చూస్తున్నారు. మా చెల్లాయి వాళ్లు కుతూహలంగా చూస్తున్నారు''

"బాగుంది చెప్పండి''

"అమ్మా గేటు తెరువ్' అని అరిచా.




"వీల్లేదు... నువ్వింట్లోకి రానవసరంలా'' అన్నాడు మా డాడ్.

"ఎందుకు నాన్నా''

"మా కడుపున చెడబుట్టావ"న్నాడు.

"ఆడు ఆ పిచ్చి కథలు రాస్తున్నప్పుడే మిమ్మల్ని హెచ్చరించాను విన్నారా'' అంది మా అమ్మ.

మాకూ వాళ్లకి నడుమ మా పనిమనిషి ఉంది. "వాణ్ణి వెళ్లమని చెప్పవే! ఇంకెప్పుడూ ఈ ఇంటికి రానవసరంలేదు. అని చెప్పు'' అన్నాడు నాన్న.

"సర్లే అలాగే రాను'' అన్నా.

"మరింకెందుకు ఫో!" అనరిచాడు.

"నావి నాకు ఇవ్వండ"న్నా...

ఆయన విసవిసా లోపలకి నడుచుకుంటూ వెళ్లి ఓ పెద్ద కట్ట తెచ్చి విసిరేశాడు. అది నా పుస్తకాల కట్ట. అందులో నా రచనలున్నాయి. పని మనిషి నాకు అందించింది.

"ఇంకా వున్నాయి'' అన్నా.

"ఇంకేం లేదు పొమ్మ''న్నారు.

కప్పు కాఫీ ఇస్తేగాని కదలనన్నా! మా చెల్లాయి నవ్వింది. దానికేసి కోపంగా చూశాడు నాన్న. పాలు అయిపోయాయి అని ఈ కమలలాగే చెప్పారు. మరుక్షణం అంతా లోపలకి వెళ్లిపోయారు.

ప్రేమ అప్పటివరకూ ఏమీ మాట్లాడలేదు. ఇంక వెళ్దాం అంది.

"ఉండు కాఫీలు వస్తాయి'' అన్నా.

"పాలు అయిపోయాయని చెప్పారుగా''

"అలానే అంటారు.. పాలు ఎప్పుడూ ఉంటాయి. చూస్తుండు కాఫీ వస్తుందిగా'' అన్నా. అయిదు నిముషాల తర్వాత చెల్లి కాఫీ తీసుకొచ్చింది.

"ఇలాంటి పని ఎందుకు చేశావ్?" అంది.

"ప్రేమ కోసం"

"ఈమె కోసమా?" అంది ప్రేమను చూస్తూ.

"ప్రేమ కోసం"

"ప్రేమ కోసం ప్రేమ వలలో పడ్డావన్న మాట"

"నేనే కాదు నువ్వూ ప్రేమ వలలో పడాల్సిందే. నీకు తెలుసుగా మన బామ్మ తాతయ్యను ఎప్పుడూ తిట్టుకునేది. ఎందుకో తెలుసా ప్రేమ వలలో పడనందుకే'

"త్వరగా కాఫీ తాగు''

"ఒక కప్పు మాత్రమే తెచ్చానే అనుకోకండి. చూస్తున్నారుగా అయినా మా అన్నయ్యని నమ్ముకుని పెళ్లి చేసుకున్నారు. మిమ్మల్ని చూస్తే జాలిగా ఉంది'' అంది చెల్లి.

"ఏమిటేవ్ ఈ రకంగా చిచ్చుపెడుతున్నావ్! కొంపతీసి కొత్త రూట్లో వస్తున్నావా?"

"అదేంకాదు, కాఫీ నువ్వొక్కడివే తాగేశావ్, నీ శ్రీమతికి లేకుండా''

"పిచ్చిదానా ప్రేమ కాఫీ తాగదు''

"ఆ కప్పు ఇలా ఇవ్వు. ఈ ఇంట్లో నువ్వు తాగే చివరి కాఫీ ఇది. ఇహ గుడ్‌బై అండ్ గుడ్‌లక్' అంది.

మేమిద్దరం వెనక్కి తిరిగాం.

"కాఫీ మీద మీకంత ప్రేమా'' అంది ప్రేమ.

"ప్రేమా... కాఫీనీ, నిన్నూ ఎదురుగా నిలబెట్టి ఎవరిని కోరుకుంటావో చెప్పు అంటే నేను కాఫీనే కోరుకుంటాను'' అన్నా.

"ఈ జోక్ బాగుంది బాలకృష్ణగారూ, రాత్రి సినిమావాళ్లకి ఈ విషయం చెప్పకండి. వాడేసుకుంటారు. కాఫీ మీద మీకేం హక్కులు లేవు. మరి నేను బయలుదేరతాను'' అన్నాడు రాఘువ.

"అంకుల్ కాఫీ'' అంటూ వచ్చింది కమల.

"అమ్మా, పాలు అయిపోయాయన్నావ్''

"అయిపోయాయి. పక్కింటివాళ్ల దగ్గర తీసుకున్నా. మీకు మాత్రం లేవు. అంకుల్ నీళ్లు కలిపితే ఊరుకోరు. రెండు లీటర్ల పాలు



# అవార్డు అందుకోబోతున్న అందాల వరాహం..




హాంగ్‌కాంగ్‌లోని 'ఓషన్‌పార్క్ యానిమల్ థియేటర్'లో అప్పుడప్పుడు జరిగే జంతువుల ఫ్యాన్సీడ్రెస్ ప్రదర్శనలో ఈ అందాల భామది ఎప్పుడూ ఫస్ట్ ప్రైయిజే. ఇందుకోసం రకరకాల జంతువులనీ మచ్చిక చేసుకుంటూ వుంటుంది సూయిజ్‌వాంగ్ అనే ఈ అమ్మాయి. ఈసారి ప్రదర్శనలో ఆమె అతికష్టపడి ఓ అందాల వరాహాన్ని పట్టుకుని దాన్ని మరింత అందంగా తీర్చిదిద్ది ప్రదర్శనలో నిలబెడుతోంది.

తీసుకుంటే అన్నీ మాస్టారికే'

"ఏం చేస్తాం కమలా... మాస్టారికి మొదటి భార్య కాఫీనే'' అన్నాడు రాఘవ.

★ ★ ★

సాయంకాలానికి అక్కడ జనం విపరీతంగా ఉన్నారు. వారిని తొలగించుకుంటూ ముందుకు నడిచాడు రాఘవ.

రోజూ తాము కూర్చునే కుర్చీల్లో సినిమా నటులు కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. రాఘవ సరాసరి లోపలకు వెళ్లాడు. అక్కడ ప్రేమా, బాలకృష్ణా, మరో కొత్త వ్యక్తీ సీరియస్‌గా మాట్లాడుకుంటున్నారు.

"రాఘవా ఈయన చంద్రం. కవి, సినిమా పాటలు రాస్తాడు. నీకు తెలుసుగా ఆ పాటలు వినే ఉంటావ్'' అన్నాడు బాలకృష్ణ.

"విన్నాను''

"ఈయన రాఘవ, నవలలు రాస్తుంటారు. బహుశా నీకూ తెలిసే ఉంటుంది'' అంది ప్రేమ చంద్రంతో.

"చూశాను'' అన్నాడు నవ్వుతూ.

ఇద్దరూ కరచాలనం చేసుకున్నాక డాబా పైకి వెళ్దాం అనుకున్నారు.

"రెండు రోజులుంటారా'' అన్నాడు రాఘవ.

"లేదండి, రేపు ఉదయం వెళ్లిపోతాను. ఈ సినిమా తీస్తున్న విశ్వంతో ముందునుండీ నాకు బాగా పరిచయం. నేనేమంత ఫేరున్న కవినికాదు. ఇదిగో ఈయన లాంటివారికే రాస్తుంటాను''

"మీరేం చేస్తున్నారు''

"కాలేజీలో లెక్చరర్'

"మీ పాట ఒకటి మాత్రమే నాకు బాగా గుర్తు, అది కూడా విషాదం మిళితమైన పాట"

"అవును నాకూ ఆ పాటే ఇష్టం"

"ఈ సమయంలో కొంచెం కాఫీ తాగితే బాగుండునుకదూ'' అన్నాడు బాలకృష్ణ.

"ప్రేమా ఇప్పటికైనా కళ్లు తెరువ్. బాలకృష్ణకు రోజుకో నాలుగు లీటర్ల పాలు చాలు కాఫీతాగి బతికేయగలడు''

"నిజమే చంద్రం. జీవితం చాలా నిస్సారంగా ఉంది. మాస్టారికా ఇబ్బంది లేదు. సంతోషాన్నీ, దుఃఖాన్నీ కూడా కప్పు కాఫీలో మరిచిపోగలడు''

"కొంపతీసి సినిమాల్లోకి వెళ్తావా?"

"ఏం వెళ్లకూడదా, అదో పవర్‌ఫుల్ మీడియం కదా''

"కానీ అదంతా ఎవరి చేతుల్లో ఉంది'' అన్నాడు చంద్రం.

"డబ్బులున్నవారి చేతుల్లో ఉంది. బాగా దుర్వినియోగం అవుతున్న మీడియమ్ ఇది. దీనిలోకి వెళ్లకూడదనేం కాదుగానీ, వెళ్లాల్సిన సమయం ఇంకా రాలేదు'' అన్నాడు రాఘవ.

ఆసరికి కొంతమంది వచ్చి లైట్స్ అరేంజ్ చేస్తున్నారు.

"ఏమిటి ఈ గదిలోనా షూటింగ్'

"అవును సార్'

"కొంచెంసేపు చూద్దాం" అన్నాడు బాలకృష్ణ.

"నేను ఇంతకుముందు ఓ నిర్మాత పిలిస్తే మద్రాసు వెళ్లి ఓ వారం రోజులు ఉన్నా. అప్పుడే ఓ నిర్ణయం తీసుకున్నా, ఇంకెప్పుడూ మద్రాసు రాకూడదని''

"ఏం అన్నాడు బాలకృష్ణ.

"ఆ హింసను అందరూ భరించలేరు. ఓ మహానుభావుడు ఏమన్నాడంటే 'అదంతా ఓ ప్రపంచం. వాళ్లు మన మందు మనని తాగనివ్వరు. మన సిగరెట్ మనల్ని కాల్చనివ్వరు. చివరకి. మన మాటల్ని మనని రాసుకోనివ్వరు' అని. నిజమే! మనం అక్కడికి వెళ్లాలంటే మన రూపం మార్చుకుని వెళ్లాల్సిందే''

ప్రేమ ఏదో అనబోతుండగా కోలాహలం వినిపించింది.

"ఏమిటా గోల"

"హీరోయిన్‌గారు వస్తున్నారండి''

"ఎవరామె''

"సుధగారు... సుధామాధురిగారు''

"ఆమె సినిమా ఒకటి చూశాను. పురుషాహంకారానికి వ్యతిరేకంగా చాలా బాగా నటించింది'' అన్నాడు రాఘవ.

కొద్ది క్షణాల తర్వాత ఆమె సరాసరి పైకి వచ్చింది.

"రండి'' అంటూ ఆహ్వానించింది ప్రేమ.

అందరూ పిట్టగోడ కానుకుని నిలబడ్డారు.

"ఇప్పుడు మీరూ నటిస్తున్నారా?"

"లేదండి, రేపు ఉదయం నుండి. ఏమీ తోచక వచ్చాను. కొన్ని హాస్య దృశ్యాలు తీస్తున్నారనుకుంటా'' అంది.

అప్పుడే మొత్తం ముగ్గురు హీరోలు పైకి వచ్చారు. వారి వెనుకగా ఓ యువనటి, ఆమె వెనకాల ఓ ముసలావిడ వచ్చారు.

"రాఘవా, నువ్వు ఫ్రీలాన్సర్‌వి కూడా కదా, సుధగారిని ఇంటర్వ్యూ చేయకూడదూ'' అన్నాడు బాలకృష్ణ.

సరిగ్గా అదే సమయానికి యువనటి వీళ్ల దగ్గరకొచ్చి నిలబడింది. సుధ కళ్లతోనే పలకరించింది.

"మేం పత్రికల వాళ్లం కాదుగానీ ఇష్టాగోష్ఠిగా మాట్లాడుకుందాం. మీరీ రంగంలోకి ఎందుకు ప్రవేశించారు'' అన్నాడు రాఘవ.

సుధ కొంచెం ఇబ్బందిగా చూసింది.

"ఈ రంగంలోకి రావటం అనేది ఓ యాక్సిడెంట్. మా కాలేజీ ఫంక్షన్‌లో నన్ను చూసి ఓ తమిళ డైరెక్టర్ సినిమాల్లోకి ఆహ్వానించారు. అప్పుడు అదో థ్రిల్ అంతే. అంతకుమించి ఎందుకొచ్చానంటే నేనేమీ చెప్పలేను'' అంది నవ్వుతూ.

"మీకీ గ్లామర్ నచ్చిందా? ఈ తెరలూ, అభిమానాలూ''

"అంతేనా... ఇక్కడి గాసిప్స్, తెర వెనకాల జరిగే రకరకాల తతంగాలు వాటిని మర్చిపోతున్నారు''

"అదే అవి నచ్చాయా?"

"లేదు. నేను ముఖానికి రంగు పూసుకున్న మరుక్షణమే ఈ రంగంలో భాగం అయిపోయాను. నేను నిన్నటి సుధనుకాదు. నాకిప్పుడు ఇక్కడ ఏం ఇష్టమున్నా లేకపోయినా నేను కొనసాగుతాను. అంతేకాదు మంచి పాత్రలు ధరించి పేరు తెచ్చుకోవాలనే ఆరాటం ఉంది''

ఆ యువనటి తదేకంగా రాఘవనే చూస్తోంది.

"ప్రేమ ఆ విషయం గమనించింది. ఎందుకలా చూస్తుందో అర్థం కాలేదు. నిజానికి ఆ అమ్మాయి చాలా చిత్రమైన దుస్తులు ధరించి ఉంది. ఓ రకంగా ఎబ్బెట్టుగా ఉన్నాయి.

రాఘవ అనుకోకుండా ఆ అమ్మాయిని చూశాడు. ఇద్దరి కళ్లూ కలుసుకున్నాయి.

ఎంత అద్భుతమైన కళ్లు అనుకున్నాడు ఓ క్షణం.

చంద్రం ఏదో అడుగుతున్నాడు. షూటింగ్ ఆరంభం అయింది. ఆ అమ్మాయి వెనక్కి తిరిగి మౌనంగా నడుచుకుంటూ వెళ్లింది.

"ప్రేమగారూ, ఆ అమ్మాయి కొత్తనటా?" అడిగాడు రాఘవ.

"కాదు చాలా సినిమాల్లో నటించింది. పేరు శ్రీదుర్గ. సెక్స్ పాత్రలు వేస్తుంటుంది. నువ్వు ఎక్కువగా సినిమాలు చూడవుకాబట్టి నీకు తెలియకపోవచ్చు''

"కానీ ఆ అమ్మాయి కళ్లు చాలా బాగున్నాయి''

"మరి వాటిని ఉపయోగించుకోవాలికదా, ఎక్కువగా సెక్స్ పాత్రలకే ఆమెను వినియోగించుకుంటున్నారు'' అంది.

తిరిగి మరో విషయం మీదకు చర్చ మలుపు తిరిగింది.

సమయం గడుస్తూనే ఉంది.

"నేను ఉదయమే వస్తాను'' అన్నాడు రాఘవ లేస్తూ.





"రా! మన చంద్రం కూడా వెళ్లిపోతాడు''

"మీతో చాలా మాట్లాడాలనుకున్నాను. అయితే ఇంతవరకూ ఏమీ మాట్లాడలేదు. ఏది ఏమైనా మీరు మిత్రులయ్యారు కాబట్టి ఇక ముందు మాట్లాడుకోవచ్చు. అన్నట్లు సుధగారూ ధన్యవాదాలు. మీలాంటి చదువుకున్న వారు ఎక్కువమంది ఈ రంగానికి రావాలి. ఈ గ్లామర్ తెరలు చిరిగి పోవాలి. సినిమా అంటే అదో మాయాప్రపంచం కాదు. ఇదీ ఓ కళారూపం అని అందరూ గుర్తించాలి. చూద్దాం అలాంటి రోజులొస్తాయేమో''

"అరణ్యరోదన అనే సినిమా తీద్దామా చంద్రం?" అన్నాడు బాలకృష్ణ. అందరూ నవ్వుకున్నారు.

రాఘవ శెలవు తీసుకొని ఇంటికి వెళ్లాడు.

పడుకోబోతూ డైరీ అందుకున్నాడు. రాస్తూ పోయాడు.

జీవితంలో ఎప్పటికయినా ఓ మంచి సినిమాకు కథ రాయటం, వీలయితే దర్శకత్వం చేయాలని నా ఆరాటం. ఆశకూడా. తీరా అక్కడకు వెళ్లాక ఆ పాత్రలూ స్వభావాలూ చూశాక తిరిగి ఆశ చచ్చిపోయింది. అవును ఖచ్చితంగా చెప్పవచ్చు... ఇంక ఈ సినిమాలు బాగుపడవు. అయితే ప్రేమగారు ఈ విషయం అంగీకరించరు.

అన్నింటితోపాటు సినిమాలు కూడా మారి తీరాలంటారు. మేం సుధగారితో కొంచెంసేపు మాట్లాం. ఆ సమయంలోనే నా పక్కకు వచ్చి మరో నటి నిలబడింది. ఆమె నన్ను పరిశీలనగా చూడటం నేను గమనించాను. ఆ అమ్మాయి కళ్లు చాలా బాగున్నాయి. ఇంతకు ముందే ఆ కళ్లను ఎక్కడో చూసినట్లుగా అనిపించింది. ఇది కాకతాళీయమేనా? కొంత మందిని చూసినపుడు వీళ్లను ఎక్కడో చూశాం అనిపిస్తుంటుంది.

ఈ అమ్మాయీ అంతేనేమో!

అయితే ఆ అమ్మాయి నాకేసి ఎందుకంత ఆరాటంగా చూడటం.

వారం రోజులు గడిచాక రాఘవ ఓ ఉత్తరం అందుకుని ఆశ్చర్యపోయాడు. అంతకు ముందు ఎప్పుడూ పరిచయంలేని దస్తూరి. ఫ్రమ్ అడ్రస్ లేదు. ఎక్కడినుండి వచ్చిందా అని పోస్టల్ ముద్రకోసం చూశాడు. అది సరిగ్గాలేదు. కుతూహలంగా చించాడు,

గురువుగారికి,

ఎవరా అని ఆశ్చర్యపోతున్నారు కదూ, నేనండీ... కొన్ని సంవత్సరాల వెనక్కి వెళ్తే మీరు ఆ హొటల్‌లో క్యాష్ బల్లముందు కూర్చున్నప్పుడు ఓ పిల్ల మీ ముందుకు వచ్చేది. అవునా ఇప్పుడు గుర్తుకు వచ్చిందా!

ఆ అమ్మాయినే,

ఇప్పుడు ఆ అమ్మాయిని కూడా కాదు. శ్రీదుర్గని. తెలుగు సినిమాల్లో రకరకాల పాత్రలు నటిస్తూ జీవిస్తున్న దానిని.

ఆ రోజు మిమ్మల్ని చూడగానే ఒక్కసారిగా ఆ పాత రోజులన్నీ నా కళ్ల ముందుకు వచ్చాయి. నా జీవితం రకరకాల మలుపులు తిరిగింది. అయినా ఎప్పుడూ మీరే గుర్తుకు వచ్చేవారు. ఎప్పుడూ ఏమైపోయారు? ఏం చేస్తున్నారు? అనుకుంటూ ఉండేదాన్ని.

చాలా కొద్దికాలం మాత్రం మీరు అక్కడ ఉన్నారు. ఆ తర్వాత అదృశ్యం అయిపోయారు. మీకోసం అడుగుతుండేదాన్ని. అయినా ఎవరూ చెప్పేవారు కాదు. ఎప్పుడయినా మీరు కనిపించగలరేమో అనిపించేది. కానీ మీరు నా ఎదురుగా నిలబడినా సరే మాట్లాడలేని పరిస్థితి ఎదురవుతుందని నాకు తెలియదు.

అంతేకాదు నన్ను చూసి మీరు పలకరించకపోవటం కూడా నాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. కొద్దిగా బాధ అనిపించినా, చాలా సంవత్సరాల క్రితం చూసి ఉంటారు. అది కూడా కొన్ని నెలల సంబంధం. ఈలోగా నేను చాలా మారాను. అందువలన మీకు గుర్తుకు వచ్చి ఉండను అని కూడా అనిపించింది.

అంతేకాదు నేను మిమ్మల్ని గుర్తుపట్టినా,

పూర్తిగా మిమ్మల్ని మీరే అని ధృవపరుచుకోవాల్సి వచ్చింది. అందుకే మీ గురించి వివరాలు సేకరించి, మీ చిరునామా సంపాదించాక ఈ ఉత్తరం రాస్తున్నా.

నాకు చాలా సంతోషం కలిగించిన విషయం ఏమిటంటే మీరు రచయితలని తెలుసుకోవటం,

సుధామాధురిని మీరెందుకు ఈ రంగంలోకి ప్రవేశించారు అని అడిగారు.

నన్ను అడగకపోయినా కూడా నేను మీకు సమాధానం చెప్పాలి. అయితే అదంతా ఈ ఉత్తరంలో సాధ్యపడేదికాదు. అందుకే నేను ఏక్షణమో మీ దగ్గరికి వస్తాను.

జరిగిపోయిన నా కథంతా మీకు చెబుతాను.

జరగాల్సింది మీరు చెప్పాలి.

నాకెందుకో మిమ్మల్ని 'గురువు' గారూ అని పిలవాలనిపించింది. అందుకు మీరు అభ్యంతరం చెప్పరుగా-

చాలా చాలా రాయాలని నాకుంది. సరాసరి వచ్చేసి మీతో మాట్లాడుతూ కూర్చోవాలనిపించింది. అయితే ఇదంతా అంత త్వరగా జరిగేది కాదుగదా. అందుకే ప్రస్తుతం ఈ ఉత్తరంతో సరిపెడుతున్నాను.

కింద నా చిరునామా రాస్తున్నాను. మీ నుండి వెంటనే కాకపోయినా, కొంత ఆలస్యంగా అయినా ఉత్తరం రాగలదని అనుకుంటున్నా. మీ ఉత్తరం చూశాక మీ ఆహ్వానం అందుకున్నాక మాత్రమే నేను మీ దగ్గరకు రావాలనుకుంటున్నాను. మీ శ్రీమతి గారికి నా నమస్కారాలు అందచేయండి.

మీకు పిల్లలు ఎంతమంది?

నేనయితే ఉత్తరం రాస్తున్నాను. మీరు తిరిగి నాకు జవాబు రాస్తారా లేదా అనే అనుమానం' నాకుంది.

తెలుసుకదా. నేనేమంత మర్యాదపూర్వకమైన పాత్రలు పోషిస్తున్న నటిని కాదు.

మీరు అంగీకరించకపోయినా అదంతా నా జీవనమార్గం...

మీకు చాలాచాలా చెప్పుకోవాలి. ప్రస్తుతానికి ఇక్కడితో ఆగిపోతాను.

మరోసారి నమస్కారాలతో

మీ

శ్రీదుర్గ

ఉత్తరం మరోసారి చదివాడు రాఘవ...

అవునా?

ఆ అమ్మాయే శ్రీదుర్గా...?

నిజమేనా?

నిజమే అయిఉంటుంది.

తను ఆ రోజుల్లో ఎప్పుడూ ఆ అమ్మాయిని పేరు అడగలేదు. ఇన్ని సంవత్సరాల్లో ఇంతగా మారిపోయిందా? అప్పుడు కూడా ఆ అమ్మాయి కళ్ళు మాత్రమే తనని విపరీతంగా ఆకర్షించాయి. ఇప్పుడూ అంతే. తనతో ఆ అమ్మాయి అంతగా మాట్లాడేది కాదు. అయినా ఆ కళ్ళను గుండ్రంగా తిప్పుతున్నప్పుడు ఎంత హాయిగా అనిపించేదో!

తను అంతగా చదువుకోలేదు.

అయినా ఇంత చక్కగా ఎలా రాయగలిగింది?

ముందసలు నటించాలని ఎందుకనిపించింది?

ఆ అమ్మాయిలో ఇంత ప్రతిభ దాగుందా?

రకరకాల ప్రశ్నలు...

అతని చేతిలో కాయితం రెపరెపలాడుతోంది... అలా వరి చేలమీదుగా, కాలవగట్ల మీదుగా... మెల్లమెల్లగా కదిలివస్తుందో పాట.

అదే పాట.

దశాబ్దాలుగా తనను మురిపిస్తున్న పాట.

రాఘవ మెల్లగా గతంలోకి జారిపోయేడు.

★ ★ ★

"ఇంటర్ పరీక్షలు పూర్తయ్యాయికదా... ఇప్పుడు కర్తవ్యం ఏమిటి?" అన్నాడు రాఘవ




మిత్రుడు.

"ఆ విషయం తర్వాత. ముందయితే రాత్రికి సినిమాకు వెళ్ళాలి'' అన్నాడు. ఇంటి దగ్గరికి రాగానే అమ్మ చెప్పింది.

"రాఘవా రేపటినుండి నువ్వు మావయ్య వాళ్ళ హెూటల్‌కి వెళ్తున్నావ్''

"ఎందుకమ్మా'' అన్నాడు.

"అక్కడే ఉంటావ్. మంచి ఉద్యోగం వచ్చేదాకా''

"అంటే ఇకనుండి చదువుకోవటం కుదరదా''

"నీకు తెలియందేముంది. ఇంక మన పరిస్థితి ఏరోజుకారోజులా ఉంది. కనీసం ఓ మనిషి తగ్గినా చాలు. నువ్వక్కడ పని చేయటంవలన నీకు తిండి సమస్య తీరటమే కాదు. వాళ్ళు ఏవన్నా ఇస్తే కుటుంబానికి ఉపయోగపడుతుంది''

రాఘవ మౌనంగా తలూపాడు.

ఇలాంటిదేదో జరుగుతుందని తనకు అర్ధమౌతూనే ఉంది. అయినా ఏదో మూల ఆశ లేకపోలేదు. తనను చదివించగలరేమో!

ఎవరు చదివిస్తారు?

మావయ్య చదివించొచ్చు. ఆయనకు రెండు పెద్ద హెూటల్స్ ఉన్నాయి. అందులో ఒకటి మిలట్రీ హెూటల్. తనను చదివిస్తే రేపు పెద్దయి మంచి ఉద్యోగం వస్తే ఆ బాకీ తీర్చలేకపోతాడా తను.

అయినా మావయ్య అయినంతమాత్రాన చదివించాలనేముంది. ముందసలు ఇంట్లో పరిస్థితి సాంతం తారుమారయిందని అమ్మ చెబుతోందిగా. అంటే ఇంక తనకు మంచిరోజులు లేవు. తనకింక కాలేజియోగం లేదు.

"సినిమాకెళ్తానన్నావుగా'' అంది అమ్మ.

"లేదమ్మా నాకు వెళ్ళాలని లేదు. రేపు ఊరుకెళ్ళాలిగా''

ఆమె మాట్లాడకుండా లోపలకు వెళ్ళిపోయింది.

ఉదయమే ప్రయాణం.

తనతోపాటు ఓ నోట్‌పుస్తకం మాత్రం తెచ్చుకుంటున్నాడు.

ఈ సెలవుల్లో దాన్నిండా కథలూ, జోక్స్ లాంటివి రాసేయాలనుకున్నాడు. కవిత్వం రాయాలని కూడా అనిపిస్తోంది. ముఖ్యంగా ప్రేమ కవిత్వం!

ఇప్పుడిప్పుడే ఆడపిల్లలంటే ప్రత్యేకమైన ఆసక్తి కలుగుతోంది.

వారిని ఎదురునుండి చూడకపోయినా, పక్కనుండయినా గమనించాలనే ఆరాటం ఉంది. అలా చూస్తాడు కూడా. కొంతమంది ఆడపిల్లలు చాలా అందంగా కనిపిస్తారు. వారిని అలానే చూస్తూ ఉండాలనిపిస్తుంది. కానీ జీవితం తాలూకు ప్రకంపనలు వెంటనే చుట్టుముడతాయి. అందుకే మంచి పుస్తకాల్లో ఏదో వెతుక్కోవాలనే ఆరాటం.

అంతకుమించి రాయటంలో ఏదో తృప్తి ఉంటుందనిపించింది. తను చాలా రాయాలి. చా...లా...

అందులో తన కలలుంటాయి. కోరికలుంటాయి. తను ఊహించుకునే అద్భుత ప్రపంచం ఉంటుంది.

నోట్ పుస్తకంకేసి చూసుకొన్నాడు.

ఆ క్షణంలో రాఘవకు ఒకటే అనిపించింది.

'అయిపోయింది. ఇంక చదువుద్వారా తనకేదో భవిష్యత్ ఉండటం అనేది ఊహించటం కూడా అనవసరం. ఇంక తన భవిష్యత్ అంతా ఇదిగో ఈ తెల్లకాగితాల పుస్తకంలో ఉంది. తన్తోపాటు తెచ్చుకుంటున్న కలంలో ఉంది. ఇకనుండి ఈ కలంలో పోయాల్సింది ఇంకు కాదు. తన భవిష్యత్. తన కలలు..

తన హృదయంనుండి దూసుకువచ్చేవన్నీ ఈ తెల్లని కాయితాలమీద మెరిసే అక్షరాలవుతాయి. వాటిని తను చదువుతాడు. తర్వాత ఈ ప్రపంచం చదువుతుంది.

"ఇంక నా నేస్తాలు... ఈ చిన్నిపుస్తకం... ఈ కలం... అనుకున్నాడు.

రైలు కుదుపులకు ఎప్పుడు నిద్రలోకి జారి పోయాడో తెలియదు.

మావయ్య ఇంటిలోకి అడుగుపెట్టగానే అక్క బలవంతంమీద ముఖంలో నవ్వు తెచ్చుకుంది. గదిలో మావయ్య నిద్రపోతున్నట్లున్నాడు.

అమ్మ కూడా ఏమీ మాట్లాడలేదు అక్కతో.

"స్నానం చేస్తావా?" అంది రాఘవతో.

తలూపాడు.

"అదిగో బాత్‌రూం" అని చూపించింది.

రాఘవ వెళ్లాడు. అక్కడ రకరకాల సబ్బులున్నాయి. అయినా వాటిని తాకాలంటే భయం కలిగింది. టాప్ తిప్పి బకెట్‌నిండా నీళ్ళు పట్టుకొని స్నానం చేశాడు. ఎందుకో కొంచెం 'టీ' తాగితే బాగుండును అనిపించింది. అయితే అక్క మాట్లాడుకుండా పని చేసుకుంటూఉంది.

మరో అరగంట తర్వాత 'మావయ్య' లేచాడు.

అయిదు నిముషాలు అలానే కూర్చున్నాక లేచి బాత్‌రూంలోకి వెళ్ళాడు. మరో పది నిముషాలకు కప్పుతో అక్క అతని గదిలోకి వెళ్ళింది.

"మావయ్యపిలుస్తున్నార్రా'' అని చెప్పింది వచ్చి.

భయం భయంగా లోపలకు వెళ్ళాడు.

"పరీక్షలు బాగా రాశావా?" కంఠం ఉరిమినట్లుంది.

తల ఊపాడు రాఘవ.

"నోరు లేదా?"

"రాశాను'' గొణిగినట్లుగా అన్నాడు.

"సర్లే పో'' అన్నాడు.

బతుకుజీవుడా అనుకుంటూ బయటకు వచ్చాడు.

మరి కొద్దిసేపటికి మావయ్య వెళ్ళిపోయాడు.

"నిన్ను మిల్ట్రీ హెూటల్‌కి రమ్మన్నార్రా'' అంది అక్క.

"ఎక్కడుందో నాకేం తెలుసు'' అన్నాడు.

"ఇక్కడికి పనిమనుషులు వస్తారుగా. వాళ్ళు చూపిస్తారులే' అంది.

అప్పుడు అందించింది టీ.

అంత వేడిగా లేదు. అయినా అలాగే తాగాడు. ఇంటిదగ్గర అసలు తాగడు.

కేవలం అమ్మ మాత్రమే తాగుతుంది. ఎప్పుడో ఓసారి మాత్రం ఇస్తుంది.

ఇక్కడ పరిస్థితి రాఘవకి అర్థమైంది. మావయ్యంటే అక్కకు భయం. ఆయన ఇంట్లో ఉన్నంతసేపూ మంచినీళ్ళు అందించాలన్నా భయపడుతుంది.

అంతకంటే మావయ్య చాలా భయంకరుడు. అందులోనూ సినిమా విలన్లా 'భుజంగరావ్' అనే పేరు. ఇదివరకు తను కూడా ఏ ఉద్యోగం లేక చాలా ఇబ్బందులు పడ్డాడు. అప్పుడు అందరితోనూ బాగానే మాట్లాడేవాడు.

ముందు ముఖంలో నవ్వు కనిపించేది.

ఇప్పుడా మనిషి నవ్వటం మానేశాడు.

మరికొద్దిసేపట్లో పని కుర్రాడు 'నెయ్యి' కావాలంటూ వచ్చాడు.

అతన్తో పంపించింది అక్క.

మిల్ట్రీ హెూటల్ ముందుకు అడుగుపెట్టే సరికి అదోరకం వాసన గుప్పుమంది. రాఘవకు తెలియకుండానే నోట్లో లాలాజలం ఊరింది. దారిలో ఆ అబ్బాయి తనకేసి ఆబగా చూశాడు. అయినా ఇద్దరూ ఏమీ మాట్లాడుకోలా.

హెూటల్లో భుజంగరావ్ సిగరెట్ తాగుతూ కూర్చున్నాడు.

ఆయన పక్కనే ఉన్న ఓ నల్లవ్యక్తి "ఇరవై




వేటా... అయిదు చేపా తెప్పించా'' అంటున్నాడు.

అప్పుడు ప్రవేశించిన రాఘవని చూసి "ఈ కుర్రాడేనా'' అనడిగేడు.

భుజంగరావు తలూపేడు నిశ్శబ్దంగా-

"బొత్తిగా పుల్లలాగా ఉన్నాడు. కాష్ ముందు కూర్చోబెడితే ఆనతాడా?"

భుజంగరావు మాట్లాడలేదు.

"నీ పేరేంటయ్యా''

"రాఘవ"

డబ్బులు తీసుకొని చిల్లర ఇవ్వటం వచ్చా?"

"ఇంటర్ చదివాడు. ఆమాత్రం చేయలేడా?" అన్నాడు భుజంగరావు.

అతను వచ్చి క్యాష్ముందు కూర్చోబెట్టాడు. గల్లా పెట్టెముందు నాలుగు గిన్నెలున్నాయి. ఒక్కోదానిలో ఒక్కోరకం చిల్లర ఉంది. లోపల కాయితాలు పెట్టుకోవటానికి సెపరేట్గా క్లిప్స్ ఉన్నాయి.

"జాగ్రత్త... కొంతమంది బిల్లులివ్వకుండా వెళ్తుంటారు. వాళ్ళని ఓ కంటితో గమనించాలి''

రాఘవ తలూపాడు.

అప్పుడు సమయం మధ్యాహ్నం అయింది. దాదాపు రెండుగంటలు క్యాష్ తీసుకున్నాడు. మిలట్రీ హోటల్ కాబట్టి పెద్ద రష్ ఉండదు. అందుకని అదేమంత కష్టంగా అనిపించలేదు.

మధ్యలో ఓసారి మాత్రం "అతను'' వచ్చి 'భోజనం చేసిరా' అన్నాడు.

సిగ్గుపడుతూ ఓ టేబుల్ ముందు కూర్చున్నాడు. సప్లయిర్స్ కొత్తగా చూస్తూ-

"పెద్ద షాపుకారు బావమరిదివి''కదూ అన్నారు.

"అవును'' అంటూ తలూపాడు.

"ఏం తెమ్మంటావ్... కోడి జాయింట్ తెమ్మంటావా?" అన్నాడో సప్లయిర్

తల అడ్డంగా ఊపాడు భయంగా.

"మరింకేం తింటావ్?"

"మామూలు భోజనం"

"మాంసం తినవా?"

"తింటానుగానీ ఇప్పుడొద్దు''

"సరే... నీ ఇష్టం"

ఇంతవరకూ ఎప్పుడూ హోటల్లో భోజనం చేయలేదు. మొదటిసారిగా చేస్తున్నాడు. అందరూ తనకేసే చూస్తున్నట్లుగా అనిపించింది. ఏం తింటున్నాడో తెలియదు. ఎలా పూర్తిచేశాడో తెలియదు. అయిదునిముషాల్లో పూర్తయింది.

"అప్పుడే అయిపోయిందా?"

తలూపాడు.

"కూర్చో''

అలా ఆరంభమైంది కొత్త జీవితం.

రెండురోజులు పోయాకగాని రాఘవకి అర్థం కాలా, ఉదయం ఆరు గంటలకి వస్తే సాయంకాలం నాలుగు గంటలవుతుంది. తిరిగి స్నానం చేసి వస్తే రాత్రి పన్నెండు గంటలదాకా ఎవరో ఒకరు వస్తుంటారు.

అంటే కేవలం అయిదు గంటలు మాత్రం నిద్ర... అప్పటివరకూ రాఘవలో ఉన్న కొన్ని అభిప్రాయాలు క్రమక్రమంగా మారటం ఆరంభం అయింది.

ఎప్పుడూ నిద్రపోయేవారంటే ఓ రకంగా చిన్న చూపు ఉండేది. ఇప్పుడలా ఏ మాత్రం తీరిక దొరికినా నిద్రపోవాలనిపిస్తోంది. మొదటి రెండు రోజులూ ఫర్వాలేదుగానీ మూడోరోజున డబ్బుల్లో పది రూపాయలు తగ్గాయి.

కారణం తెలియదు.

రాఘవ మనసునంతా కేంద్రీకరించాడు. ఎందుకు తగ్గాయి? తను జాగ్రత్తగానే తీసుకున్నాడు. దాదాపు అందరూ బిల్లులు ఇచ్చారు. మరెందుకని డబ్బులు తగ్గాయి? ఎవరికైనా ఎక్కువ ఇవ్వటం జరిగిందా? లేక-



మర్నాడు ఉదయమే అమ్మ వెళ్ళిపో తుంది.

ఆరోజు రాత్రి అమ్మ హృదయంమీద వాలి పోయేడు రాఘవ.

కన్నీళ్ళు ధారాపాతంగా కారుతున్నాయి.

నోటినుండి జలపాతంలా మాటలు దూసు కువచ్చేలా ఉన్నాయి.

"అమ్మా... అమ్మా... నేనిక్కడ ఉండలే ను. ఇక్కడ ఉంటే నేను మనిషిని కాలేను. ఈ ప్రపంచానికి తెల్లవారకముందే లేవాలి. పరు గులమీద వెళ్ళాలి. అదిగో ఆ మూల ఆ వధ్యశిలమీద కోళ్ళూ, చేపలూ, గొర్రెల్నీ ము క్కలు ముక్కలుగా నరుకుతుంటారు. వాట న్నింటినీ దగ్గరుండి చూడాలి. సరిగ్గా తూకం వేస్తున్నారో లేదో చూసి రాసుకోవాలి. అక్కడ ఉదయం మన ఇంటిదగ్గరలా మంచి గాలి ఉండదు. అంతా నీచు వాసన. పచ్చిమాంసం ముక్కలు పసుపు నీళ్ళతో కడుగుతారక్కడ. దాంతో రక్తం కూడా కలిసిపోతుంది. కాలవల నిండా రక్తం. నాకిదంతా చూడాలని లేదు. అయినా నేను అక్కడే ఉండాలి. కొద్దిగంటలు గడుస్తే మరో రకం వాసన నోరూరు తుంటుంది. అప్పుడిక అంతకుముందున్న జాలి ఉండదు. వాటిని తినాలనే కోరిక కలుగు తుంది. మనషులంతా ఆబగా వస్తుంటారు. వారందరూ మెరుస్తున్న కళ్ళతో భోజనం చేస్తారు. అలా గంటలు గంటలు గడుస్తాయి. నిద్ర ముంచుకువస్తుంటుంది.

పినిశెట్టి

అమ్మా... ఇదంతా కేవలం నా పొట్ట నింపుకోవటం కోసమేనా? ఇన్ని గంటలపాటు నేను పైన తిరిగే సీలింగ్ ఫ్యాన్‌లా స్విచ్ వేస్తే తిరగటం, లేదా ఆగిపోవటం ఇంతేనా?

అటుచూస్తే ఎందరెందరో పిల్లలు నవ్వుతూ, తుళ్ళుతూ, రంగురంగుల దుస్తుల్లో బజారుకే కాంతులు తెస్తున్నారు. మరి నేను... ఈ రెండు జతల బట్టల్లో అలా తిరుగుతున్న ఆ పిల్లల్ని చూసి మురిసిపోతూ, కుమిలిపోతూ... ఏమిటిదంతా? ఎవరు చేశారిది?

నేనింకా చదువుకుంటా. నన్ను ఇక్కడి నుండి లాక్కెళ్ళు. నేనిక్కడ ఉండలేను. అమ్మా రేపు ఉదయం నేనూ నీతోనే వస్తా..." అనాలనుకున్నాడు కాని మాటలు పెగల్లేదు.

గొంతులో దుఃఖం పొంగి పొర్లుతోంది.

"ఏంటి నాన్నా ఏమైంది?" అమ్మ అడుగుతోంది.

"నేనూ వచ్చేస్తా''

ఆమె చాలా సేపు మాట్లాడలేదు.

తల నిమురుతూ ఉండిపోయింది. ఆ తర్వాత వెళ్ళిపోయింది.

భుజంగరావు కాఫీ హోటల్‌కు నిర్వహణ అంతా చూస్తాడు.

మిల్ట్రీ హోటల్‌ని ఆ నల్లటి మనిషి చూస్తాడు.

ఆయన పేరు వెంకట్రావ్. విశాలమైన నుదురు, చర్మం మందం తెల్లటి గ్లాస్కో పంచె, లుంగీలా కడతాడు. చాలా పెద్ద పొట్ట.

రాఘవకి ఆయన్ని పరిశీలిస్తే చాలా విషయాలు తెలిశాయి. గతంలో ఆయన అందరి ముందూ చేతులు కట్టుకొని నిలబడేవాడు. నవ్వుతూ కబుర్లు చెప్పేవాడు. తాగటానికి బుడ్లు మోసేవాడు.

అలాంటివాడల్లా అమాంతం నవ్వటం మానేసేడు.

కుర్చీమీద ఓ కాలు ఎత్తిపెట్టి... తాపీగా కూర్చుని చాలా గంభీరమైన భంగిమలో భోజనం చేసేవాడు.

ఆయన చుట్టూ నాలుగురకాల వంటకాలుండేవి. నెమ్మదిగానే భోంచేసేవాడు.

అంతా అయిపోయేక మీగడ పెరుగు లాగించి తాపీగా వచ్చి ఆరుబయట కూర్చునేవాడు.

అతనికి రాఘవ అంటే ఎందుకో కోపం...

ఎందుకా అని ఎంత ఆలోచించినా అర్థం కాలా, రాఘవకి.

ఓరోజు అందరూ కూర్చుని ఉండగా రాఘవని పిలిచారు.

"రేపట్నుండి నువ్వు క్యాష్‌లో కూర్చోకు'' భుజంగరావు చెప్పాడు.

తలూపాడు రాఘవ.

"రోజూ డబ్బులు తగ్గుతుంటే ఎవరు కడతార్రా? నీ బాబా''

రాఘవకి పాదాలనుండి మొదలయిందో స్పందన.

ఎప్పుడో పోయిన నాన్న గుర్తొచ్చాడు. ఆయనే ఉంటే ఇక్కడకి వచ్చి పనిచేసుకోవాల్సిన అవసరం ఏముంది? అయినా మరణించిన వ్యక్తి గురించి మాట్లాడటం ఎందుకు? తను అక్కడినుండి వచ్చేక కూడా వారి మాటలు వినిపిస్తున్నాయి.

"జమీందారుగారి కుటుంబంలో పుట్టాల్సినోడు. ఎప్పుడూ మన ప్రపంచంలో ఉండడు. ఏదో ఆలోచిస్తూ ఉంటాడు. అసలు అదేమిటో ఇంకా పిల్లచేష్టలు పోలా. పనివారందరితో కబుర్లు వేసుకొంటాడు. వాళ్ళతో ఎంతవరకుండాలో అంతవరకుండడు'' వెంకట్రావ్ చెబుతున్నాడు.

భుజంగరావ్ నిశ్శబ్దంగా వింటున్నాడు.

మనుషులెందుకింతగా పతనం అవుతారో రాఘవకి అర్థంకాలా. అయినా తనమీద అంత కక్ష పెంచుకోవలసిన అవసరం ఏమొచ్చింది? ఇంకా రకరకాల అనుభవాలు ఎదురయ్యాయి.




అంతకుముందు తమ ఊర్లో పెద్దమనుషులుగా ఉన్నవారందరూ తన కళ్ళముందే తాగుతున్నారు. విచిత్రంగా ప్రవర్తిస్తున్నారు.

క్యాష్‌లో కూర్చోవద్దని అన్నారేగాని తిరిగి అక్కడే కూర్చున్నాడు.

ఈసారి మాట పడకూడదు అనుకున్నాడు...

సాయంకాలం ఏడు గంటలవుతోంది.

సరిగ్గా అప్పుడు నాసికల్ని తాకిందో అద్భుత పరిమళం.

ఎక్కడిది? ఎక్కడనుండి వచ్చింది?

పక్కకు తిరిగితే.

ఓ అమ్మాయి.

ఎనిమిది సంవత్సరాలుంటాయేమో!

కళ్ళు గుండ్రంగా ఉన్నాయి.

తలలో పెట్టుకున్నది చాలా తక్కువ పూలు.

అయితేనేం అవన్నీ నిండైన మల్లెమొగ్గలు.

రాఘవ ఆ అమ్మాయినే చూస్తూ కూర్చున్నాడు.

"కొత్తగా వచ్చావా?" అంది.

తలూపాడు రాఘవ.

"కోడికూర కావాలి''

తలూపాడు.

డబ్బులందించింది. బెల్ నొక్కాడు. సప్లయిర్ వచ్చాడు.

"ఏం పిల్లా... కనిపించటంలేదే. వేరే హెూటల్‌కి వెళ్తున్నావా?" అన్నాడు.

"లేదు ఊరికెళ్ళాను''

"కోడి కూరంట" అన్నాడు రాఘవ.

"అలాగే'' అతను వెళ్ళిపోయాడు.

రాఘవకు ఆ అమ్మాయివేపే చూడాలనిపించింది. కానీ.. ఎవరైనా చూస్తే.

పైన ఫ్యాన్ తిరుగుతూంది.

ఆ ప్రాంతమంతా మల్లెలవాసన పరుచుకుంటోంది. ఆ వాసన ముక్కుకి తగిలితే చాలు ఓ దశాబ్దం కిందకు జారిపోతాడు రాఘవ.

అవును... అప్పుడు వెన్నెల. తమ ఇంటి ముందు మైదానమంతా వెన్నెల. పిల్లలందరూ కలసి ఆడుకునేవారు. అందులోనూ, ఆడపిల్లలూ, మగపిల్లలూ కలిసి. వారిలో కొందరు తలనిండా పూలతో వచ్చేవారు. ఆ వాసన పీలుస్తుంటే తన్మయత్వం కలిగేది.

ఆ పూలకాశక్తి ఎలా వచ్చిందో తెలియదు. దోసిటనిండా పూలు తీసుకొని ఆఘ్రాణించాలనిపించేది.

"ఇంక పడుకోరా'' అంటూ పిలుస్తుండేవారు.

పిల్లలు మైదానం విడిచి కదిలేవారు కాదు.

వారినలా వదిలేస్తే రాత్రంతా ఆడుకుంటూనే ఉంటారేమో!

"ఆడుకోనివ్వండి. వేసవికాలం చల్లటి గాలి, వెన్నెలా- ఇప్పుడు కూడా ఆడుకోపోతే ఎలా?" అనేవారు కొందరు.

ఓ అత్తయ్య మాత్రం స్నానంచేసి, కొత్తచీర కట్టుకుని, తలనిండా మల్లెపూలు పెట్టుకునేది. మావయ్యని 'బావా' అని పిలిచేది. ఆయన ఎర్రగా ఉండేవాడు. కళ్ళు నీలం రంగులో మెరిసేవి. ఆవిడ నల్లగా ఉన్నా అందంగా ఉండేది.

ఆమె బయటనిలబడి ఎదురుచూస్తూ ఉండేది.

"రాకూడదూ'' అని పిలిచేవారు.

"ఉండండి. ఆయనొచ్చే వేళయింది'' అనేది.

ఆమె అలా నిలబడి చూస్తుంటే ఆ మల్లెమొగ్గలమీద వెన్నెల వెలుగులు.

అదో మరపురాని దృశ్యం.

అందుకే మల్లెలవాసన తాకితే చాలు ఒక్కసారిగా ఆనాటి మైదానం... ఆ వెన్నెల్లో ఆడుకున్న అందమైన ఆడపిల్లలు - ఆ వెన్నెల్లో నిలబడి మావయ్యకోసం ఎదురుచూసే

అత్తయ్య... గుర్తుకొస్తారు.

కోడికూర వచ్చింది. ఆ అమ్మాయి వెనక్కి తిరిగింది. 'వెళ్ళిపోతున్నావా నేస్తం' అనుకున్నాడు.

ఆరోజు రాత్రి ఇంటికి వెళ్ళాక తన నోట్‌బుక్ తీసుకొని రాసుకున్నాడు.

ఓ అమ్మాయి బొడ్డుమల్లితో కోడికూరకోసం వచ్చింది. అంత మంచి కళ్ళున్న ఆ అమ్మాయి చేతుల్లో కలువపూలుంటే అందంగాని... కోడికూర ఉంటే ఏం అందం. ఇక్కడ పనిలో చేరాక నాలో భావుకత్వం చచ్చిపోయింది. ఒక్కో మహానుభావుణ్ణి నవ్వుతూ పలకరిస్తేచాలు 'మూలిగ తెప్పించండి సార్' అంటాడు. దాంట్లో ఏం సుఖం ఉందో గాని దవడలన్నీ బిగబట్టి పీల్చుతాడు.

ఓ మనిషి ఎలాంటివాడో కనుక్కోవాలంటే మిలట్రీ హోటల్లో ఎలా ఉంటాడు అనేదాన్ని బట్టి చెప్పొచ్చునంటారు. అలాంటిచోట ఈ పాప కొంచెం రిలీఫ్. ఇంతకూ ఎవరికోసం ఆ కోడికూర?

వాళ్ళ నాన్నకా?

అంతే అయుంటుంది. లేకపోతే ఓ పొట్లాం ఎంతమంది తింటారు కనుక?"

'ఈరోజు రెండు పొట్లాల పలావు తీసుకు వెళ్ళిందా బొడ్డుమల్లి. దండతో మాత్రం వచ్చింది. రోజూ ఈ అమ్మాయికి పూలు ఎలా దొరుకుతున్నాయి. వారి పెరట్లో మొక్క ఉందా? లేక ఈ వాసన నాకు ఇష్టం అని ఈ అమ్మాయికి తెలిసిపోయిందా?'

'ఏమిటో అనుకున్నాను. ఈరోజు ఆ అమ్మాయి చేతిలో బాటిల్ ఉంది. నాకు కొంచెం భయం కలిగింది. ఇంత చిన్నపిల్ల ఇన్ని పనులు చేస్తుందా? మందు అందించటం, మాంసాలు అందించటం ఇవన్నీ ఈ ఆడపిల్ల చేయాలా? అంటే నాలా ఈ అమ్మాయి కూడా కేవలం పొట్టనింపుకోవడంకోసమే ఇవన్నీ చేస్తోందా?

'ఈరోజు ఆ అమ్మాయి రాలేదు. నాకెందుకో దిగులుగా ఉంది. జ్వరం పడిందేమో! అలా అయి ఉండదు? మరెందుకని రాలేదు. అసలు ఆ అమ్మాయి గురించి వివరాలు సేకరించాలి. ఇదంతా ఏమిటి అని ఆ అమ్మాయినే అడిగితే బాగుంటుందేమో! సమాధానం చెబుతుందా?

'నాకా అమ్మాయితో ఇలా చెప్పాలనిపించింది. 'పాపా రోజురా... నాకోసం రా. నీకు ఏమీ అవసరం లేకపోయినా సరే. ఒక్కసారి వచ్చి నన్ను చూసి వెళ్ళు. నువ్వు బొడ్డుమల్లి దండతోనే రావాలనేంలేదు. ఓ చిన్న గులాబి పువ్వుతో వచ్చినరోజుమాత్రమేం... ఎంత అద్భుతంగా ఉన్నావు! అవునూ నీకీ పూలన్నీ ఎలా దొరుకుతున్నాయి? ఎవరిస్తున్నారు? ఎందుకిస్తున్నారు?

నువ్వలా మాటలురాని దేవతలా నిలబడతావెందుకు? రెండు ముక్కలుమాత్రం అడుగుతావు. చిన్న టిఫిన్ బాక్స్ తెస్తావ్. అందులో పెరుగు పచ్చడి కావాలి. గ్రేవీ కావాలి. అంతే అవి ఇస్తే నీ పని అయిపోతుంది. నాకేసి చూడవు

ఓరోజు రాఘవకు ఎందుకో అనుమానం వచ్చింది. 'ఈ పుస్తకం అక్క చూస్తే ఎలా ఉంటుందో? అయినా చూసినా పర్వాలేదు. మావయ్య చూస్తే ఏమనుకుంటాడు?'

అవును.

భుజంగరావు ఆ పుస్తకాన్ని చూశాడు.

చూపించింది ఎవరోకాదు. అక్క. తను ఆ గదిలోకి వచ్చినప్పుడు కనిపించిందా పుస్తకం. తెరిచి చూస్తే అందులో ఏదో రాసివుంది. తీరిగ్గా కూర్చుని చదివింది. తను వారపత్రికలు చదువుతుంది. ఇది కూడా ఓ కథలా అనిపించింది. తనకయితే చాలా సంతోషం కలిగింది.

తన తమ్ముడు కూడా కథలు రాస్తున్నాడు.

ఈ విషయం ఆయనకి తెలిస్తే సంతోషిస్తాడేమో అనుకుంది. ఆమెకు ఆయన సంతోషా




న్ని మించిన ప్రపంచం లేదు. ఆయన సంతోషంకోసం ఏమ్మైనా చేస్తుంది. ఆయనకు కోపం వస్తుందనుకుంటే ఏ పనీ చేయదు. ఆమెకది ఎంత ఇష్టమైనాసరే ఆ కోరికను చంపుకుంటుంది.

కొన్ని సంవత్సరాల వైవాహిక జీవితంలో ఆమె అనుభవించిందంతా భయం. ఎందుకంత కోపం తెచ్చుకుంటాడో తెలియదు. గట్టిగా అరవటమే కాదు. చాలాసార్లు కొట్టాడు. ఇతరులముందు అవమానించాడు.

నువ్వసలు నాకు తగిన భార్యవి కాదన్నాడు.

నిజమే కాబోలు అనుకుంది. అయితే ఇప్పుడు ఏం చేయాలో అర్థంకాలేదు. ఇద్దరు పిల్లలు పుట్టారు. ఈ సమయంలో తను ఆయన్ని విడిచి వెళ్ళలేదు.

"వెళ్ళు.. వెళ్ళిపో' అంటాడు.

"నీకెంత డబ్బులు కావాలంటే అంత ఇస్తా. నువ్వు నన్ను వదిలిపెట్టు'' అంటాడు.

ఆ మాటలు తను అంటున్నప్పుడు నిశ్శబ్దంగా ఉంటుంది. ఎదురు మాట్లాడదు. ఓసారి మాత్రం చెప్పింది ధృఢంగా... చాలా ధృఢంగా "నేను మిమ్మల్ని విడిచి ఎక్కడికీ వెళ్ళను'' అని.

అప్పుడామెను చూసి భుజంగరావు భయపడ్డాడు.

అలాంటి భుజంగరావుకు ఆ పుస్తకాన్ని అందించింది. అతని భృకుటి ముడిపడింది. తాపీగా పుస్తకం అంతా చదివాడు.

అతనికి ఏం అనిపించిందో తెలియదు. ఎంతో ఆబగా ఎదురుచూసిన ఆమెకు అనుమానం వచ్చింది పుస్తకం చూపించి పొరపాటు చేయలేదుకదా అని. భుజంగరావుకు సాహిత్యంతో అవసరంలేదు. మంచి వినోదం అవసరంలేదు. అతనికి కావాల్సింది వ్యాపారం. మిగిలిన సమయంలో హొటల్ డాబా మీద కూర్చుంటాడు. అక్కడ వారికోసం ప్రత్యేకమైన గది ఉంది. అక్కడే కొంతమంది చేరతారు. అలా ఎంతసేపుంటారో తెలియదు. తాగుతారు, తింటారు. అయితే అల్లరి ఉండదు. వ్యాపారం మరవటం ఉండదు. దేనిదారి దానిదే.

అది కాకపోతే ఇంకో ఆనందం ఉంది. అది వ్యభిచారం. అలాంటి మనిషికి ఈ ప్రపంచంలో మనుషులు కొన్ని సంఘటనలకు స్పందిస్తారని అర్థంకాదు. ఒక్కో వ్యక్తి.. ఒక్కో సువాసన... ఒక్కో పాట జీవితాల్ని మండిస్తుందని తెలియదు. మనిషి జ్ఞాపకాల్లో పునీతమౌతాడని తెలియదు. మనిషి నిరంతరం నూతన అనుభవాలకోసం తపించిపోతాడని తెలియదు.

భుజంగరావు ఆ నోటుపుస్తకాన్ని మౌనంగానే ఇచ్చేశాడు. ఆమెకెందుకో తిరిగి ఆశ కలిగింది. ఏమీ అనలేదుగా! అయితే నచ్చివుంటుందా? అనుకుంది.



పరీక్షల ఫలితాలు తెలిశాయి. రాఘవ సెకండ్‌క్లాస్‌లో పాసయ్యాడు.

తిరిగి ఎందుకో ఆశ చిగురించింది, తననీ ఎవరైనా చదివించగలరేమో అని. అది చాలా చిన్న ఆశ.

వెంకట్రావ్ అన్నాడు "నువ్వు కథలు రాస్తావంటగా'' అని.

రాఘవ మాట్లాడలేదు.

"ఏందయ్యా మాట్లాడవు. నీలా మెత్తగా

ఉండేవాళ్ళని చూస్తే నాకు మహా మొత్తబుద్ధి అవుతుందయ్యా'' అంటూ తన మనసులో మాటను బయటపెట్టాడు.

మెత్తగా ఉండేవాళ్ళతో వంచిన నడుం ఎత్తకుండా పనిచేయించేవాడు వెంకట్రావు. అలాగే ఎవరినయినా కొట్టాలంటే అతనికి మహా ఉత్సాహంగా ఉండేది. రెండు రకాలవారిని కొట్టేవాడు. వర్కర్స్‌నీ, డబ్బుల్లేకుండా భోంచేసినవాళ్ళనీ.

అంతకుమించి దారుణంగా తిట్టేవాడు. ఆ సామ్రాజ్యానికి తనో రాజు. ఒక్కోసారి అతను మాట్లాడుతుంటే వెగటుపుట్టేది. అతను సాహిత్యం గురించి మాట్లాడేవాడు. 'సినిమా' గురించి మాట్లాడేవాడు. రాజకీయాల గురించి మాట్లాడేవాడు. ఏకాంతంగా ఉన్నప్పుడు ఆ మాటలు తలచుకుంటే నవ్వు... తెరలు తెరలుగా నవ్వే.

ఆరోజు సాయంకాలం నాలుగు గంటలకి నీరసంగా నడిచి వెళ్తున్నాడు.

"రాఘవా'' అంటూ పిలిచారు.

ఎవరా అని చూశాడు.

రవి! తమతోపాటు అదే కాలేజీలో చదివినవాడు. తను రాఘవ గ్రూప్ కాదు. అయినా కూడా ఒకరిపట్ల ఒకరికి గౌరవం ఉంది. రవి కాలేజ్ ఫస్ట్. రాఘవకు చదువుకంటే ఆటలూ, ఇతర కార్యక్రమాలెక్కువ. ఏదైనా సమస్య మీద మాట్లాడాలంటే చివరకు రవీ, రాఘవలే మిగిలేవారు. ఆయా పోటీల్లో ఇద్దరికీ బహుమతులు వచ్చేవి.

"రవీ..." అన్నాడు సంతోషంగా.

"నువ్వు హొటల్‌లో పనిచేస్తున్నావని విన్నాను. నిన్ను కలుసుకోవాలని నేను అనుకోలేదు. అన్నట్లు నేను మెడిసిన్ చదువుదామనుకుంటున్నాను''

"సంతోషం రవీ'' అన్నాడు రాఘవ.

రవి రాఘవకేసి చూస్తూ చెప్పాడు "జీవితం అందరికీ అన్ని అవకాశాలు ఇవ్వదు. కొంతమందికి ఎన్ని అవకాశాలున్నా ఉపయోగించుకోవటం రాదు. అందుకే నువ్వు కాలేజీలో చదువుకోలేకపోతున్నానని దిగులుపడొద్దు. కాలేజి వెలుపల కూడా జీవితం ఉంది. అయినా నువ్వు తప్పు చేయటంలేదు. ఇప్పటినుండే శ్రమపడుతూ జీవిస్తున్నావ్. గుర్తుంచుకో. అవకాశాలు మనదగ్గరకు రావు. మనమే వాటిని వెతుక్కుంటూ పోవాలి''

రాఘవ తలూపాడు.

"నీకు శారద తెలుసా?"

"ఎవరామె?"

"ఆమెకాదు. అతను. మన తెలుగువాడు కూడా కాదు. తమిళనాడుకి చెందినవాడు''

"తెలియదు''

"అతను తెలుగులో కథలూ, నవల్లూ రాశాడు. నీకు తెలియదా?"

"నిజంగానే తెలియదు''

"నిజమే! శారద అందుకే తెలియడు. ఆయన చచ్చిపోయి చాలాకాలం అయింది. నాకెందుకో నిన్ను చూస్తే ఆయనే గుర్తొచ్చాడు. తను కూడా బతకటంకోసం వాళ్ళ బావదగ్గర హొటల్‌లోనే పనిచేశాడు. పని చేస్తూనే చాలా గొప్ప రచనలు చేశాడు''

"నిజమా?"

"నేను కూడా అతనివి ఒకటి రెండు కథలు చదివాను తప్పించి ఇతర రచనలు చదవలా. నేను ఎందుకు చెబుతున్నానో తెలుసా... హొటల్ అంటే చిన్నచూపు చూడకు''

"నేను అలా చూడటంలేదు. చదువుకోలేకపోయాననే దిగులుమాత్రమే నాలో ఉంది''

"సారీ రాఘవా నేను సరిగ్గా చెప్పలేకపోయాననుకుంటా. మనిషి నిరంతరం చేసే పోరాటం ఎందుకో తెలుసా? కడుపుకింత ముద్దకోసం. డాక్టరయినా, సైంటిస్ట్ అయినా ముందు భోజనం చేశాకే మిగతావన్నీ. మరి నువ్వు పదిమంది అన్నం తింటున్నచోట పనిచేస్తున్నావ్. అంటే ఈ ప్రపంచపు తొలి అవసరం




ఏదైతే ఉందో అక్కడ"

రాఘవ నవ్వాడు.

"ఇక్కడకు రకరకాల జనం వస్తారు.వారం దరినీ నువ్వు పరిశీలించవచ్చు. అంతేకాదు, హోటల్‌లో పనిచేసేవారిలో మూడువంతుల మంది ఇంటిదగ్గరనుండి పారిపోయి వచ్చిన వారే. అలాంటి వారి జీవితాల వెనుక ఎన్నెన్నో కథలుంటాయి. మరి అవన్నీ నువ్వు తెలుసుకో గలిగితే అంతకంటే ఏం కావాలి. నువ్వు ఇంకా చదువుకోలేకపోవచ్చు. కానీ రచయిత గా ఇంతకుమించిన అనుభవం ఏముంటుంది? గుర్తుంచుకో... నువ్వేదో అద్భుతం సృష్టిస్తావనే నమ్మకం నాకుంది. నీకిప్పుడుంది నీ కలం... నీ జీవితానుభవం"

రవి అలా రాఘవకు అంతులేని ఆత్మవి శ్వాసం అందించి వెళ్ళాడు.

అతనికప్పుడు చదువుకోలేకపోతు న్నందుకు విచారం కలగలేదు. తన మార్గం ఏదో ఇప్పుడు తేలిపోయింది. ఎవరేమను కుంటారో అని ఇప్పుడు సిగ్గుపడడు. భయపడ డు కూడా.

రాఘవ ఆప్యాయంగా తన నోట్‌బుక్ అందుకున్నాడు.

★ ★ ★

ఆరాత్రి... ప్రపంచమంతా నిద్రలోకి జారు కొంది. రోడ్లన్నీ అలసిపోయి విశ్రమిస్తున్నాయా అన్నట్లుగా ఉంది. లెక్కలు పూర్తి అయ్యేటప్ప టికి ఒకటిన్నర దాటింది. కట్టేయాలను కుంటుండగా పదిమంది వచ్చిపడ్డారు. అంద రూ తాగివున్నారు. అందులోనూ పేరున్న ప్రముఖులు.

వెంకట్రావ్ భోజనం పెట్టమన్నాడు. వా రందరూ తిని లేచి వెళ్ళేసరికి అందరికీ నీరసం వచ్చేసింది. ఇంకెంత... మరో మూడు గంటలకల్లా లేవాలి. ఇప్పుడు పడుకున్నా నిద్ర పడుతుందనేంలేదు.

అందుకే ఓసారి ఊరంతా తిరిగితే ఏమౌ తుంది?

రాత్రి ఎందుకు రాలేదని అక్క అడుగు తుందేమో!

మావయ్యకు తెలిస్తే... తెలవనీ... అయినా మనిషిని ఇన్ని గంటలపాటు పీల్చేయకుండా ఉండాలని ఆయనకుమాత్రం తెలీదా...

అదీగాక ఈరోజు వందరూపాయలు తగ్గింది. వెంకట్రావ్ విచిత్రంగా చూశాడు. ఆ చూపులో నువ్వెందుకూ పనికిరావనే చిన్న చూపు ఉంది. ఇంకొంచెం జాగ్రత్తగా ఆలోచిస్తే తను భోజనానికి వెళ్ళాడు. అప్పుడు క్యాష్‌లో కూర్చునేది వెంకట్రావ్. అతను తీయకూడద నేం ఉంది.

అందులోనూ ఆ మనిషికి విలువలపట్ల ఏ గౌరవమూ లేదు. రెండు కారణాలతో అతను తీయటానికి అవకాశం ఉంది. మొదటిది తనంటే బొత్తిగా ఇష్టంలేదు. రెండవది ఆ డబ్బులు వాడుకోవటంకోసం తీయవచ్చు. అప్పుడూ రెండు ప్రయోజనాలున్నాయి. మొద టిది డబ్బు వస్తుంది. రెండవది తనని పెద్దా యనతో చివాట్లు పెట్టించవచ్చు.

ఏదిఏమైనా తగ్గింది అయిదూ పదీ కాదు. అంటే రేపు ఆయనతో తిరిగి పెద్ద యుద్ధం జరగబోతూంది. కానీయ్... ఏం జరిగితే అది... తను నిమిత్తమాత్రుడు.

ఆ నిశిరాత్రి రాఘవ నడుస్తున్నాడు. నిర్మా నుష్యం... షాపులన్నీ మూసివున్నాయి. వీధికు క్కలు అప్పుడప్పుడూ మొరుగుతున్నాయి. తనను ఇలా చూస్తే ఏమనుకుంటారు? దొంగ తనంకోసం తిరుగుతున్నాడనుకుంటారా? పోలీసులు పట్టుకొని జైలులో వెయ్యరుకదా? వేస్తే ఏమౌతుంది?

మంచిదో, చెడుదో వాళ్ళూ అన్నం పెడతా రు. రవి భాషలో చెప్పాలంటే మనిషికి ఏది ప్రాథమిక అవసరమో అది జైలులోనూ ఉంది. జైలు అంటే చిన్నచూపు ఉండకూడదు. అక్క డకు దొంగలొస్తారు. మనుషుల్ని నిర్దా క్షిణ్యంగా నరికినవాళ్ళూ వస్తారు. ఆడవారొ స్తారు. పిల్లలూ, పెద్దలూ వస్తారు.

# రచయితలకు మనవి



- ★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**
- ★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**
- ★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- ★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- ★ **ప్రతి నవలకు అందజేసే రు: 2,000/- పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

ఎడిటర్:

# చతుర

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.

మనిషి ఎందుకు నేరస్థుడుగా మారుతున్నాడు? ఇదేం చిన్నవిషయమా? అన్వేషిస్తూ పోతే ఇదంతా జీవితమేగా... నడుస్తున్నవాడల్లా ఆగిపోయాడు.

రోడ్డుమీద సీసాపెంకులు మెరుస్తున్నాయి. మరికొన్ని గంటల్లో తెలవారబోతోంది. ఆవురావురుమంటూ జనం పరుగులు తీస్తారు. అప్పుడు ఎవరి కాళ్ళలోనో దిగబడి రక్తం వరదలవుతుంది.

ఈ రోడ్లమీద రక్తం కురిసినా, సీసాలు బద్దలైనా, హత్యలు జరిగినా ఏమీ మాట్లాడవు కదా... వంగి వాటిని ఏరాడు... ఓ పక్కగా పోశాడు.

ఎందుకొచ్చాడిప్పుడు తను. ఈ సమయంలో ఏదైనా అనుభవం వస్తే, అనుభవం అంటే ఏమిటి? ఏరకమైన అనుభవం కావాలి? మలుపు తిరిగాడు. మల్లెల వాసన గుప్పుమంది.

గాజుల గలగలల శబ్దం... గాలి రెంటినీ మోసుకొస్తోంది.

ఇక్కడేదో జరుగుతోంది. ఏమిటది? మల్లెల వాసన తనని జ్ఞాపకాల్లోకి విసిరే మాట వాస్తవమే. కానీ ఇప్పుడా భావం కలగటంలేదు. శరీరం ఒక్కసారిగా షాక్ తిన్నట్లయింది. చాలామంది గుసగుసలు చెప్పుకునే ప్రాంతం ఇదేనా?

మనిషి అనుభవాలకోసం పడి చచ్చేది ఇక్కడేనా? మల్లెపూలు నలిగి వాడిపోయేదిక్కడేనా? ఆ గదుల గోడలమధ్య ఆడపిల్లల కళ్ళనుండి నీళ్ళు రాలేదిక్కడేనా?

మనిషికి ఎందుకింత ఆకలి. ఎందుకింత భయానక దరిద్రం...

ముందుకు కదిలాడు. గుడ్డి వెలుతురు... చీకటి... పందుల విహారం... అక్కడక్కడా మనుషుల కదలిక... కాళ్ళు నొప్పి పుడుతున్నాయి. అయినా నడుస్తున్నాడు. ఇలా ఓపికున్నంతవరకూ నడిచి, నడిచి ఎక్కడో కూలిపోతే ఏమౌతుంది? ఏమీకాదు...

ఇలా నడుచుకుంటూ ఏ దూరతీరాలకో వెళ్ళిపోతే ఏమౌతుంది? ఏమీకాదు!

ఈ ప్రపంచంలో పిచ్చివాళ్ళున్నారు. మేధావులున్నారు. భుజంగరావులున్నారు. తత్వవేత్తలున్నారు. వెంకట్రావ్‌లున్నారు.

ఏమీ ఏమీ కాదీ ప్రపంచం.

మరికొద్ది గంటల్లో తెల్లవారుతుందంతే!

నడిచి నడిచి తిరిగి హోటల్ దగ్గరికొచ్చాడు. ఎదురుగా కాఫీ సెక్షన్ ఉంది. అప్పటికే పదార్థాలు తయారుచేయటం ఆరంభం అయింది. నిద్రపట్టనివారూ, పేపర్‌వాళ్ళూ నడిచివస్తున్నారు.

అటే చూస్తున్న రాఘవ ఉలిక్కిపడ్డాడు. చల్లటి గాలి మేనుని తాకిపోయింది. ఆ అమ్మాయి నడిచి వెళ్తోంది. రాత్రి తలలో పెట్టుకున్న మల్లెపూదండ నలిగిపోయింది.

"ఇదిగో ఇలారా" పిలిచాడు.

తను నడుచుకుంటూ వచ్చింది.

"అప్పుడే లేచావా?"

తల ఊపింది.

"రోజూ ఇలానే లేస్తావా?"

"అవును"

"ఎక్కడికి వెళ్తున్నావ్"

"టీ పోయించుకురావటానికి"

"ఎవరికి?"

"మావాళ్ళకే"

ఆ అమ్మాయి నడిచి వెళ్ళింది.

ఇంకేమీ అడగాలనిపించలేదు.

కొద్దిసేపటి తర్వాత ఆ అమ్మాయి తిరిగి వస్తోంది.

రాఘవ లేచాడు. ఆ అమ్మాయి వెనగ్గా నడిచి వెళ్ళాడు.

మౌనంగా నడుస్తుందా అమ్మాయి. ఇంత లేతవయసులో తనకంటే ముందుగా లేచింది. రాత్రిపూట పడుకునేటప్పటికి ఎంతవుతుందో

మరి... ఆ అమ్మాయిని తలుచుకుంటే జాలి కలిగింది. ఆ తర్వాత సిగ్గుగా అనిపించింది.

ఎప్పుడు వచ్చినా ఆ ముఖంలో చిరునవ్వే. అలసిపోయిన లక్షణాలుండవు. బాధ పడటం కనిపించదు. ఆ మనసులో ఏముంటుందో తెలియదు. రాగానే డబ్బులిస్తుంది. ఏం కావాలో చెబుతుంది. మౌనంగా నిలబడుతుంది. పార్శిల్ వచ్చేంతవరకూ అంతే.

ఆ అమ్మాయి వేళ్ళు తగిలినప్పుడు శరీరం జలదరిస్తుంది. ఎందుకని? ఏమో!

అయినా తన వయసెంత? ఆ అమ్మాయి వయసెంత? ఎందుకో తెలియదు. ఆ అమ్మాయి చేతిని తాకాలనుంటుంది. లేచి వెళ్ళి ఆ బొడ్డుమల్లి వాసనను గుండెనిండుగా పీల్చాలనుంటుంది. అంతకుమించిన కోర్కెలేం కలగవు.

ఆ అమ్మాయి క్యాష్ బల్లదగ్గర నిలబడినంతసేపూ మరో ప్రపంచంలో ఉంటాడు.

అదే ఆశ్చర్యం. కాలేజీలో చదివే రోజుల్లో అనేకమంది అమ్మాయిలు రంగురంగుల దుస్తుల్లో వెలిగిపోతుండేవారు. వారికేసి చూడాలంటే భయంకలిగేది. తన మిత్రులంతా వారి వెంట పడుతుండేవారు. ఏదో ఒకటి అంటూ ఆనందించేవాళ్ళు.

ఫలానా సుందరి నాది! అనేవారు.

అంతా ఒన్‌సైడ్ లవ్వే...

'ఆ అమ్మాయి బాగుంది' అనిపించిన సందర్భాలున్నాయి. అయితే 'ఆ అమ్మాయి నాది' అని మనసులో కూడా అనుకోలేకపోయాడు.

మరిప్పుడేమిటి? ఈ అమ్మాయిని చూస్తే ఇంత సంచలనం?

ఆ అమ్మాయి ఆగి వెనక్కి తిరిగి చూసింది.

హాయిగా నవ్వింది. 'ఇదే మా ఇల్లు' అన్నట్లుంది ఆ నవ్వు.




రాఘవా నవ్వాడు.

అదంతా తడికలతో కట్టారు. ఏమంత శుభ్రంగా లేదక్కడ. ఆ అమ్మాయి అక్కడే ఉంటుందా? ఏం చేస్తారక్కడ? ఏమో! అర్థంకావటంలేదు. ఈ సాయంకాలం ఆ అమ్మాయి రాగానే కనుక్కుంటే సరి అనుకున్నాడు.

తెలతెలవారుతోతంది. కళ్ళు మండుతున్నాయి.

★ ★ ★

"అయ్యా తమరు ఈరోజునుండి ఇక్కడ కూర్చోనవసరంలేదు. రోజుకి ఇలా వందరూపాయల చొప్పున తమరు పారేస్తుంటే తమబదులు గెజిటెడ్ ఆఫీసర్‌గారిని పెట్టుకోవచ్చు. ఒకర్నికాదు ముగ్గుర్ని"

రాఘవ మాట్లాడకుండా తల వంచుకున్నాడు.

"వెనక స్టాల్లో నించో... అక్కడ కూడా తల వంచుకు నిలబడ్డావంటే గాల్లోకి ముక్కలు లేస్తాయి. నాలుగయిదు ముక్కలు లేస్తే చాలు ప్లేటు అవుతుంది"

రాఘవ వెనక్కి వెళుతుంటే పిలిచి చెప్పాడు "ప్లేటులో ఎంతెంత పెడుతున్నారో చూడాలి. నువ్వు ఇక్కడ కూడా పనికిరాలేదనుకో జీవితంలో ఇంకేరకంగానూ పనికిరావ్"

రాఘవకి చాలా కోపం వచ్చింది.

అదే మరో సందర్భంలో అయితే ఇంకోరకంగా ఉండేది పరిస్థితి. అయినా కళ్ళెత్తి చూడటంద్వారా తన నిరసనని తెలియజేశాడు.

"ఏంటి అట్టా చూస్తున్నావ్" రెట్టించాడు వెంకట్రావ్.

"ఏం లేదు"

"సరే! లోపలకు వెళ్ళు" ఆజ్ఞాపించాడు.

బొజ్జ పెంచుకోవటాన్ని మించి ఇంకో అభిరుచి లేని ఓ వెధవాయి తనని ఎందుకూ పనికిరాడన్నాడు.

'అవున్నా నేనెందుకూ పనికిరాను. నీ అంత బొజ్జ పెంచలేను. నీలా రాక్షసుడిలా మాంసం

పీక్కుతినలేను. నిన్ను భోజనానికి పంపించి గల్లాలో చేతులు పెట్టలేను. అవున్రా... ఒరేయ్ నీకుమల్లే మందుసీసాలు మోయలేను. అందు కేగా పనికిరానన్నావ్? ఇంక ఈ హొటల్ లేకపోతే నాకు తిండిలేదు. నిద్రలేదు వేరే బతుకే లేదు అంతేగా నువ్వనేది...

నిజమే ఎంత దౌర్భాగ్యం కాకపోతే నీలాంటి ఆడారి వెధవదగ్గర పిడికెడు మెతుకు లకోసం తల వంచాల్సివచ్చింది'

రాఘవ తనలో తాను గింజుకుంటున్నాడు.

మరిప్పుడు తనేం చేయాలి?

రాయాలి?

ఎలా రాస్తాడు?

రోజుకి పద్దెనిమిది గంటలపాటు నిద్రకు దూరమై, మనసునంతా ఆ డబ్బుచుట్టూ కేంద్రీకరింపచేయడానికి విఫలయత్నం చేస్తూ శారీరకంగా, మానసికంగా అలసిపోయిన తను ఏం రాయగలడు?

లేదు... ఇక్కడ ఉంటే తనకింకేమాత్రం భవిష్యత్ లేదు. అమ్మకు ఆ విషయం తెలియ కపోవచ్చు. కానీ తనకుమాత్రం చాలా స్ప ష్టంగా తెలుస్తోంది. ఇలానే ఉంటే సృజనాత్మ కత ఛస్తుంది. ఎదిరించటం అలా ఉంచి ఎవరేమన్నా తల అలా భూమిలోనికి కుంగిపో తుంటుంది.

ఇంతకూ ఇక్కడినుండి బయటపడడానికి మార్గం ఏమిటి?

అప్పుడు గుర్తొచ్చిందా అమ్మాయి!'

అంటే ఇకనుండి ఆ అమ్మాయి తనకు కనపడదు.

తను వస్తుంది. తనతోపాటు తెచ్చే మల్లెల సౌరభం ఉండదు. ఇంక ఈ హాల్లో ఇలా గిన్నెల నడుమ కూర్చుని కుమిలిపోవాలి.

ఇంతకూ ఆ అమ్మాయి ఏమనుకుంటుంది?

తనకోసం అడుగుతుందా?

తప్పకుండా అడుగుతుంది.

ఓసారి వెంకట్రావ్‌ని గమనించాను. కొంత మంది చిన్నచిన్న ఆడపిల్లలే కారేజ్‌లు తీసుకు పోతుంటారు. అలాంటివారందరూ లా డ్జింగ్స్‌లో పనిచేస్తుంటారట. సొంతం పది హేను సంవత్సరాలు కూడా లెనివారితో చాలా వికారంగా మాట్లాడతాడు.

ఆ పిల్లలు కూడా నవ్వుతూనే మాట్లాడతా రు. వారికి అదంతా అలవాటయిపోయి ఉంటుంది.

ఇప్పుడూ అంతేనేమో!

ఆ అమ్మాయి వాడి దగ్గరకి వెళ్తుంది.

"ఏం పిల్లా'' అంటాడు.

"ఆ అబ్బాయి లేడా'' అంటుంది.

"వాడితో నీకెందుకు'' అంటాడు లేదా ఇంకేమైనా బూతుమాట అంటాడు.

అప్పుడా అమ్మాయి ముఖం ముడుచుకు పోతుంది.

ముడుచుకుపోతుందా?

తప్పకుండా. తను లేనని రావటం మానే స్తుందేమో! ఇంకో హొటల్‌కి వెళ్తుందేమో!

ఇంక ఎలా ఆ అమ్మాయిని చూడటం?

తను ఆ అమ్మాయి ఇల్లు చూసిన వైనం గుర్తొచ్చింది. అదే మార్గం...

ఆ అమ్మాయిని చూడాలంటే తనే వెళ్ళాలి.

అవునూ... ఇంతకూ అక్కడ ఏం చేస్తారు?

"ఏం బాబూ... బాధపడుతున్నావా?'' అన్నాడో సప్లయర్.

రాఘవ కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయి.

"ఆ మనిషి తీరే అంత. ఇన్ని సంవత్సరా లుగా పనిచేస్తున్నాను...

కాబట్టి నాకు తెలుసు. ఎవర్ని ఏ మాట అనాలో తెలియదు. మనం ఓ మాట అంటే బాధపడతారని తెలియదు. తెలిసినా అహంకారం. నువ్వేం పట్టించుకోవద్దు''

అతను వెళ్లిపోయాడు.

రాఘవకి కొంత వెసులుబాటు లభించాక అడిగాడు...



"రోజూ పలావ్ తీసుకెళ్లటానికి వస్తుందే ఆ అమ్మాయి ఈ రోజు వచ్చిందా?"

"ఏ అమ్మాయి బాబూ''

"అదే తలలో మల్లెపూలు పెట్టుకురాదూ''

"అదా?"

"అదా అనకు ఆ పాప వచ్చిందా?"

"ఏంటి బాబో! కొంపతీసి ఆ అమ్మాయిని గాని ప్రేమించేత్తన్నావేంటి?"

"ఛ..ఛ... అవేం మాటలు''

"ఆ అమ్మాయి వచ్చింది. చిన్నాయన్ని అడిగింది కూడా నీ గురించి''

రాఘవ కెందుకో గాల్లో ఎగరాలన్నంత ఆనందం కలిగింది. అంటే తన ఊహలన్నీ వాస్తవాలే. ఆ అమ్మాయికి జవాబు కూడా అసహ్యంగానే చెప్పి ఉంటాడు.

"అదిసరే ఇంతకూ ఆ అమ్మాయికి రోజూ ఇలా పార్శిల్స్ తీసుకు వెళ్లాల్సినంత అవసరం ఏముంది?"

ఆ సప్లయిరే ఆ అనుమానం తీర్చాడు.

"మన హెూటల్ వెనకాల ప్రభుత్వంవారి సారాయి దుకాణం ఉంది. ఈ అమ్మాయి అక్కడ పని చేస్తుంటుంది. అక్కడ తాగటానికి వచ్చేవారికి ఏం కావాలంటే అది తెచ్చిస్తుంది''



"అది సారాయిషాపా?"

రాఘవ కెందుకో శరీరం జలదరించింది.

ఆ తాగుబోతులు ఆ అమ్మాయిని అనే మాటలు ఊహించుకున్నకొద్దీ ఇంకా విచారం కలిగింది.

వెంకట్రావ్‌కి మాత్రం రాఘవ చూపే గుర్తుకు వచ్చింది. గుర్తుకు వస్తూనే ఉంది. అతని ఆలోచనలు వేరేగా ఉన్నాయి.

'అంటే ఏమనుకుంటున్నాడు? ఈ హెూటేలంతా ఆడి బాబుగాడిదనుకుంటున్నాడా? ఇందులో మనకీ వాటా ఉంది. ఆ సంగతి తెలవదా. ఉండరా నీ పని చెప్తా' అనుకున్నాడు.

ఆ రోజు భుజంగం లేడు

మరుసటి రోజు వచ్చేసరికి వెంకట్రావ్ ఓ గొప్ప దృశ్యం క్రియేట్ చేసేడు. దాని ప్రకారం రాఘవని వెనకాలకు పంపించినందుకు వెంకట్రావ్ మీద కక్షపెంచుకున్నాడు. అందుకే మామూలుగా ఇచ్చే మాంసం ఎక్కువ పెట్టించాడు. సాంతం పది గంటలు కొట్టకముందే మాంసం అయిపోయింది. ఇలా హెూటల్ చరిత్రలో అంత మాంసం, అంత తక్కువ బేరానికి అయిపోవటం అంటూ జరగలా!

భుజంగరావు వెంకట్రావ్ మాటలు వింటున్నకొద్దీ ఆవేశపడిపోయాడు. అసలే సీరియస్‌గా ఉండే ఆ ముఖంలో మరింత క్రోధం చోటుచేసుకుంది.

ఏసీ గదిలో సమావేశం అయ్యారందరూ.

రాఘవ దోషిగా నిలబడ్డాడు.

"డబ్బులెందుకని తగ్గాయిరా''

రాఘవ మాట్లాడలేదు.

"నువ్వు తీశావా?"

తల అడ్డంగా ఊగింది.

"నీకు సరిగ్గా డబ్బులు తీసుకోవటం రాదు. ఇంకోళ్లు ఆ సీట్లో కూర్చుంటే నువ్వు భరించలేవు. అదిసరే నిన్న మాంసం ఎందుకంత త్వరగా అయిపోయింది''

ఆశ్చర్యంగా తలెత్తాడు రాఘవ.

"ఆ చూపు చూడండి. నిన్న నాకేసి అట్లానే చూశాడు. కుర్రాడికి పని చేతకాకపోయినా రోషం బాగానే ఉంది'' అన్నాడు వెంకట్రావ్.

భుజంగరావుకి అలాంటి మాటలు వింటుంటే ఇంకా బాగా ఆవేశం వస్తుంది.

"ఏంటిరా తలవంచుకు నిలబడ్డావ్. మాట్లాడవే''

"ఇంకేం మాట్లాడతాడు. అయినా కోపం ఉంటే నా మీద చూపించాలి. వ్యాపారం చెడగొట్టుకుంటారా ఎవరైనా''

రాఘవకి ఇదంతా అర్థం కావటంలేదు. ఆయనేం మాట్లాడుతున్నాడో తను చేసిన నేరం ఏమిటో జీర్ణించుకునే ప్రయత్నంలో ఉన్నాడు.

తను అలా నిశ్శబ్దంగా ఉండటాన్ని చూసి ఇంకేమాత్రం భరించలేక ఫట్ మంటూ కొట్టాడు. సరిగ్గా ఎముక మీద తగిలిందాదెబ్బ. దాంతో చేయి అదిరింది.

రాఘవకు కోపం వస్తోంది, దుఃఖం వస్తోంది, ఏమిటి తను? ఎందుకిలా ప్రవర్తిస్తున్నాడు?

తనేమిటి? ఇవన్నీ భరిస్తూ నిలబడ్డాడు?

ఎవరికోసం ఇదంతా? తనకోసమేనా?

వెంకట్రావ్ కళ్లలో పైశాచిక ఆనందం...

'ఊరుకోండి సార్' అని సీనియర్ సప్లయిర్ అయినా అనగలిగాడుగానీ అతను మాత్రం అనలేదు. అదే ఇంకోరయితే ముందు తనే ఆ కార్యక్రమం తీసుకునేవాడు.

చొక్కా చిరిగిపోయింది. దవడలు వాచిపోయాయి... రొప్పుతూ కుర్చీలో కూలబడ్డాడు భుజంగరావ్

"మంచినీళ్లు పట్రా'' అరిచాడు, చల్లటి మంచినీళ్లు అందించారు.

గడగడ తాగేసి మరోగ్లాసు తెప్పించుకున్నాడు.




ఓ మూలన రాఘవ తన పరిస్థితికి కుమిలి పోతున్నాడు. ఎంత ఆపుకుందామన్నా దుఃఖం వెల్లువలా విరుచుకుపడుతూనే ఉంది. శారీరకమైన బాధకాదు.

మనసుకు తగిలిన గాయం.

తన నాన్న ఎలా ఉంటాడోగుర్తులేదు. బహుశా ఆయన తన జీవితంలో ఎప్పుడైనా చేయి చేసుకుని ఉంటాడా అంటే సందేహమే. మరిప్పుడు ఇంతమంది ముందు తనేం నేరం చేశాడో తెలియకుండానే పశువును బాదినట్లు బాదాడు.

"తీర్చుకుంటాను. నాకంటూ జీవితం ఉంటే ఇంతకు ఇంతా కక్ష తీర్చుకుంటాను. ఒరేయ్ వెంకట్రావ్, తిరిగి నువ్వు బజారు మీదపడి ముష్టెత్తుకునే రోజులు చూస్తానీ కళ్ల తోనే''

రాఘవ హృదయం రగులుతోంది.

కనీసం మంచినీళ్లయినా అందించకుండానే

"నీకు దిక్కులేక వచ్చావ్. మీ బాబు ఛస్తే... ఇంతమందికి కడుపుకింత కూడు వేయలేక పంపించింది నీ అమ్మ. అసలు నీ బతుకెంత? నీ ముఖానికి కోపం కూడానా. గంట బేరం చేస్తే మాంసం అంతా పెట్టిస్తావా? ఎంత ధైర్యంరా. క్యాష్‌లో కూర్చోబెడితే అక్కడ పనికిరావు. వెనకాల ఉంచితే ఈ పని. పైగా నీ ముఖానికి కథలు. ఏం రాశావా పుస్తకంలో. ఏం రాశావురా... నువ్వెందుకి క్కడ కొచ్చింది. ఖబడ్దార్... ఈ రోజునుండి నువ్వు పార్శిల్ చెయ్యి. అవసరమైతే సప్లయ్ చెయ్యి. ఇంకా గట్టిగా చెప్పాలంటే బల్లలు తుడిపిస్తా. ఎంగిలాకులు ఎత్తిస్తా. పోరా... ఆ దౌర్భాగ్యపు ముఖంతో ఇక్కడెందుకు వెళ్లు'' రాఘవ తలవంచుకుని ముందుకు కదిలాడు.

తనని ప్రేమించే ఆ సప్లయిర్ వెనగ్గా వచ్చి అడిగాడు

"ఎక్కడికి వెళ్తావ్ బాబూ''

రాఘవ పెదవులు వణికాయి.

ఏం చెప్పటానికైనా మాటలు పెగిలి రాలేదు. కదిలిస్తే పెనుదుఃఖం విరుచుకుపడేటట్లు గా ఉంది.

అతను అర్థం చేసుకున్నాడు.

ఇంకే మాటలూ అడగదలుచుకోలేదు.

"ఇంటికి వెళ్లి స్నానం చేసిరా బాబూ'' అన్నాడు

రాఘవ ముందుకు కదిలాడు.

ఇప్పుడు కోపం లేదా లేత మనసులో...

చాలాకొద్దిక్షణాలే అయినా ఓ దరహాసం పెదవుల మీదకు పాకింది.

అంతలోనే విషాదం..

అక్క దగ్గరకు వెళ్తే..

తను మాత్రం ఏం చేస్తుంది. గట్టిగా ఏడవటం కూడా చేతకాదే... తన దుఃఖాన్ని సైతం తన గుండెల్లో దాచుకుంటుంది. మరెక్కడికి వెళ్లాలి.

ఇక్కడ అమ్మలేదు..

అవును అమ్మ... అమ్మ మాట కోసమే ఇదంతా భరించింది. ఇంత శిక్షను అనుభవించింది.

ఇంత జరిగాక కూడా అమ్మ తనను ఇలానే ఉండమంటుందా? అనదు...

మరి ఇప్పుడు సరాసరి అమ్మ దగ్గరికి వెళ్లిపోతేనో... అలా చేయటం బాగుంటుందా?

రాఘవ కాళ్లు అప్రయత్నంగా హోటల్ వెనక్కి మళ్లాయి.

ఈ క్షణంలో ఆ అమ్మాయిని చూడగలిగితే ఎంత బాగుంటుంది అనిపించింది... బాగుండదేమో,

తనని ఇలా చూస్తే ఏమనుకుంటుందా పాప?

బాధపడుతుందా? నవ్వుకుంటుందా? ఈ గాయాలకు మందు పూస్తుందా? క్షణాల్లో అంతా మాయమై వెన్నెలలే మిగులుతాయా?

అడుగులు మెల్లగా పడుతున్నాయి. ఇప్పుడు జరిగిందేమీ గుర్తుకు రావటంలేదు. తను

తన నేస్తాన్ని చూడటంకోసం వెళ్తున్నాడు. మరికొద్ది అడుగులు ముందుకు పడ్డాయి. అప్పుడు తాకిందా గాలి తెమ్మెర... గాయాలను రాసుకుంటూ వెళ్లింది.

కొద్దిసేపు కళ్లు మూసుకున్నాడు... బాధా తన్మయత్వమా... మాటలకందని భావమా... ఎందుకని అడుగులు పడకుండా ఆగిపోయాయి. ఇంకెంత... మరికొద్ది అడుగులు వేస్తే చాలు... తిరిగి గాలి... దాంతోపాటు అదోరకమైన వాసన... మందంటే అదే కాబోలు... స్పిరిటూ, టించర్ కలిపితే వచ్చేవాసన.

కడుపులో తెమిలినట్లయింది. భళ్లున వాంతి చేసుకున్నాడు. ప్రాణాలన్నీ ఎవరో తోడేస్తున్న భావన. తన చెవుల్ని తనే మూసుకున్నాడు. చుట్టూ చూశాడు.

"ఏరీ.. మనుషులంతా ఏరీ.. ఏమైపోయారు. తననిలా ఈ వీధిలో వంటరివాణ్ణి చేసి ఎక్కడికి వెళ్లారు. ఈ చెవులు మూయకపోతే భయానకమైన హెూరు. సప్త సముద్రాల ఘోష... ఇంక ఇలానే ఉంటే ప్రాణాలు సైతం ఈ గాలితో కలిసి ఎక్కడికో పయనమైపోతాయేమో.

ఒక్కగ్లాసుడు నీళ్లు అమ్మా... ఒక్కగ్లాసుడు నీళ్లు చాలు. పుక్కిలించి ఊస్తా. కళ్లు తిరుగుతున్నాయి. ఒక్కసారి చల్లని నీళ్లతో ముఖం కడుక్కుంటా...

ఉహూఁ లాభంలేదు.

మరో రెండు అడుగులు వేస్తే ఆ అమ్మాయి కనిపిస్తుంది... తనని చూడగానే పరుగుపరుగున వచ్చి హృదయానికి గాఢంగా హత్తుకొని 'బాబుగారూ ఇదేమిటి' అని.

బాబుగారా...

"బా...బు...గా..రా"

వెంకట్రావ్ వికటాట్టహాసం. రాఘవ ఇంక నడవలేక కూలబడిపోతాననుకుంటుండగా...

ఎక్కడో చెట్లు కదిలాయి... తిరిగి గాలి ఊపిరిపోసుకొంది. అప్పుడు వినిపించిందా కంఠస్వరం. కూలిపోతున్న మనిషిలో ఒక్కసారిగా చలనం వచ్చింది. చెవులు రిక్కించాడు... అవును పాటే... ఎవరు పాడుతున్నారా పాటని.

ఎవరిదా గొంతు... సుదీరతీరాలవరకూ వ్యాపించి, అడ్డం వచ్చిన ప్రతిదాన్నీ లోబరుచుకుంటూంది. నిజం... ఆ గొంతు మగవాడిది కాదు. మగవాడి గొంతులో ఆ లాలిత్యం ఉండదు. ఎవరు రాశారు? ఎప్పుడూ విని ఉండలేదు. అయితేనేం దశాబ్దాలుగా పరిచయం ఉన్న నేస్తంలాంటి పాట. ఆమె ఎందుకలా పాడుతోంది. తనిప్పుడు నిలువెల్లా సంతోషంతో ఉప్పొంగుతుందా? భరించలేని బాధల పాటకు పల్లవా అది. ఎందుకలా పాడుతూంది! ఏమో... ఒకే స్వరం ఆ కంఠంలో వణుకుతూ సొగసులు పోతూ ఎన్నెన్ని రాగాలో. ఏ వాయిద్యాలూ లేవు. ఆ పాటలో కవిత్వం లేదు. ఆ పాటలో సంగీతం లేదు. అయినా అది పాటే... పాటే కాదు ఊపిరి...

ఈ గాయాలన్నింటిని స్పృశించి, పునీతం చేసింది. పాటకు ఇంత శక్తి ఉంటుందా? ఉంటుంది... తన ఇప్పటి అనుభవం... తనిప్పుడు నడవగలడు,

పాటను వెతుక్కుంటూవెళ్లగలడు.

రాఘవ నడుస్తున్నాడు.

పాట అతన్ని నడిపిస్తోంది. మరికొంతదూరం నడిచాక ఆగిపోయాడు. ఈ ప్రపంచంలో లేదా అమ్మాయి. ఎందుకలా గొంతు విప్పిందో తనకే తెలియదు.

అది జ్ఞాపకమా... అది బాల్యమా... అది ఇంకేమైనానా...

ఈ ప్రపంచం ఆ పాట విని ఏమనుకుంటుందో ఆ అమ్మాయికిక అవసరం లేదనుకుంటా..

ఇప్పుడా అమ్మాయి అమ్మాయా? కాదు...

ఇప్పుడా పాట పాటేనా? కాదు...

ఏది ఎవరు ఏమో?

సంతోషమూ, జ్ఞాపకమూ, వేదనా మిళితం





అయ్యాయి.

అన్ని సంగీత సాధనాలు ఒక్కసారి మూగ పోయి ఆ ఒక్క కంఠ స్వరమే వినిపిస్తున్నట్లు గా ఉంది.

చాలు నేస్తం... ఈ జన్మకిది చాలు.

నువ్వు ప్రసాదించిన ఈ పాట చాలు. సంవత్సరాలకు సరిపడిన ఊపిరిలూదావు. శక్తినిచ్చావు. ఎవరు నేర్పారీ పాటని... ఎంత బాగా నేర్చుకున్నావు.

నీ తలలోని మల్లెలు మాత్రమే సౌరభాలు అందించగలవనుకున్నాను.

కానీ నీ గొంతులో ఇన్ని శబ్దసౌరభాలున్నట్టు ఊహించలేదు. ఆ మధురానుభూతికి ఎవరు ఖరీదు కడతారు?

ఎవరమ్మా నీ ముఖాన రాసిందీ నశీబు... అయ్యో ఏదీ కలం ఏదీ... తను ప్రేమించిన తన బతుకంతా నడిచివచ్చే తన కలం... లేదు... జారిపోయింది.

తను దెబ్బలు తింటున్నప్పుడు ఎక్కడో జారిపోయింది.

ఎంత దారుణం. తన మీద, మనసు మీద, కలలమీద నిర్దాక్షిణ్యపు దాడి ఇది. అయితేనేం పాపా... ఓ పాపా, నువ్వు పాడుతుండు... నేను అగాధాలనుండి పైపైకి లేస్తాను. నువ్వు పాడుతూనే ఉండు. నేను కదం తొక్కుతాను.

రాఘవ ఇంకా భావావేశంలో ఉండగానే ఆ అమ్మాయి విందుకో వెనక్కి తిరిగింది. అంతే ఒక్కసారిగా పాడటం ఆగిపోయింది.

"ఏమైంది'' అనుకుంటూ చూశాడు.

ఎదురుగా తన నేస్తం. దూరంనుండే నిలబడి చూసింది.

ఆ ముఖంలో ఏ భావం పలుకుతోందో కనిపించటం లేదు. కానీ తనకు అర్థం అయి ఉంటుంది. ఇందుకు భాష అవసరంలేదు. 'నువ్వూ నాలాంటివాడివే' అంటోందా?

'అవును, నువ్వూ నాలాంటిదానివే'

అలా మరికొద్ది క్షణాలు చూసుకున్నాక రాఘవ వెనక్కి తిరిగాడు.

తృప్తిగా ఉంది.

రాఘవ స్నానం చేసి సరాసరి పార్కుకు వెళ్లాడు. అది ఊరికి దూరంగా ఉంటుంది. ఎక్కువమంది అక్కడికి రారు. మొత్తం మీద మాకూ ఓ పార్క్ ఉంది అనిపించటానికి ఎవరైనా దాన్ని నిర్మించారేమో అన్నట్లుగా ఉంటుంది. ఆకులన్నీ రాలి కాళ్ల కింద నలుగుతుంటాయి. క్రోటన్స్ ఓ క్రమ పద్ధతిలేకుండా ఎదుగుతూ ఉంటాయి.

ఇంతవరకూ రావటానికి తీరిక దొరకలేదు.

ఈ రోజు తీరిక చేసుకున్నాడు. ముందు తన జీవితానికి చెందిన ఓ నిర్ణయం తీసుకోవాలి. ఇన్ని అవమానాలు భరించి ఇంకా ఇక్కడ ఉండటమా, నో... తనకేం సాధ్యం అయేట్లు కనిపించటం లేదు. ముఖ్యంగా ఆ వెంకట్రావు గాడిమీద రోజురోజుకూ అసహ్యం పెరిగిపోతూంది. అయితే తను ఇలా చేస్తే మావయ్యతో సంబంధాలుంటాయా?

ఉండవు. పూర్తిగా తెగిపోతాయి.

ఇప్పుడు మాత్రం ఎలాంటి సంబంధాలున్నాయి. ఆయన యజమాని. తను బానిస. తనేమిటి అక్కా అంతే.

మగవాళ్లంతా ఇలా ఉంటారా లేక భుజంగరావే ఇంతా! అనేది రాఘవ తేల్చుకోలేక పోయాడు. భార్యకి అన్నం పెట్టడం కూడా ఓ మహత్తర విషయం అనుకుంటాడు.

ముందసలు ఆవిణ్ణి తన భార్యగా కూడా అంగీకరిస్తున్నట్లు కనిపించడు. అలాంటి మనిషితో సంబంధాలు తెగిపోతే చాలా సంతోషించాలిగాని ఇంతగా ఆలోచించనవసరంలేదు. మరి అంతగా వెళ్తే తర్వాతి కార్యక్రమం ఏమిటి?

ఈ విషయం కూడా ఆలోచించనవసరంలేదు. ఇన్ని గంటలసేపు ఎక్కడ కష్టపడినా ఇంతకంటే గౌరవంగా బతకవచ్చు. ముందు అక్కడ తనూ ఓ వర్కర్. స్వంత మనిషి అనే లేబుల్ ఉండదు. దాని ద్వారా వచ్చే నష్టాలూ ఉండవు.

అయినా ఏ ఉద్యోగం లేకపోతే మాత్రం తను బతకలేడా?

ఎందుకు బతకలేడు. తను రాసుకుని బతుకుతాడు. అదంత తేలికా? ఇంతవరకు తను రాసిందేమీలేదు. తనెవరో పాఠకులకు తెలియదు. ప్రచురణకర్తలకు అంతకన్నా తెలియదు. కేవలం తనకు రాయాలనే ఆరాటం ఉంది. రాయగలననే నమ్మకం ఉంది. అవి మాత్రమే ఉంటేచాలా?

చాలదు. ముందు ఈ పని మాత్రం తనకు కష్టం అనిపించలేదా? ఇప్పుడు దారిలో పడటం జరిగింది. రేపు రచన కూడా అంతే. ఇంతకీ రాస్తే చదివేది ఎవరు? వాటిని నలుగురి ముందుకూ తెచ్చేది ఎవరు?

చూద్దాం... ముందు ఒకటి రెండు నవలలు ఊరికే రాసి ఇస్తేసరి. పేరు రావటం అంటూ జరిగితే వాళ్లేవేస్తారు.

కాబట్టి ఈ ఊర్లో ఇంకా ఎక్కువ రోజులు ఉండటం అనవసరం. కానీ... కానీ ఏముంది... ఇక్కడనుండి వెళ్తే ఆ అమ్మాయి కనిపించదు. కనిపించకపోతే ఏమౌతుంది? ఏమీకాదు. ఒకప్పుడు అమ్మలేకపోతే తను ఉండలేను అనుకునేవాడు. ఇప్పుడు ఉంటున్నాడు. అంటే అమ్మ దూరంగా ఉన్నా అలవాటు అయింది.

రేపూ అంతే... ఆ అమ్మాయి ఉండదు. కొద్ది రోజులు బాధనిపిస్తుంది. అయినా ఆ అమ్మాయి ఎవరు? తనెవరు? తనకూ ఆ అమ్మాయికి నడుమ ఉన్న సంబంధం ఏమిటి? ఏమో...

అది మాటలతో చెప్పదగింది కాదు. ఆ అమ్మాయి తనకంటే చాలా చిన్నది కూడా.

అలాంటి అమ్మాయికోసం తను ఇక్కడే ఉండగలడా? ఇంకా ఇంకా పతనం కాగలడా? లేదు అదీ కష్టమే. అయినా కూడా బాధగా ఉంది.

రాఘవకు తనని తాను పరిశీలించుకుంటే మరింత ఆశ్చర్యం కలిగింది.

ఇంతకీ తన వయసెంతని? అన్నీ అనుకూలిస్తే తను రోజూ కాలేజీకి వెళ్తుండేవాడు. అప్పుడు ఆడపిల్లల గురించి ఆలోచనలు ఉండవని కాదు. కానీ ఈ రకంగా ఉండవు.

ఇక్కడకు వచ్చేముందు కూడా కుతూహలాన్ని మించి భయమే తనని కంట్రోల్ చేసేది. అలాంటిది తనలో మార్పు వచ్చింది. శారీరకంగానే కాదు. మానసికంగా కూడా. ఖచ్చితంగా చెప్పాలంటే ఆ అమ్మాయిపట్ల తనకు ప్రేమ ఉంది.

అయితే అది జీవితాల్ని మండించేంత శక్తి కలదికాదు.

ఆ అమ్మాయి గొంతులో ఓ శక్తి ఉంది.

తను ఆ మాధుర్యానికి కరిగిపోయాడు. అయినా సరే వీటన్నింటికంటే కూడా జీవితమే శక్తివంతమైంది. ఈ విషయాన్ని తను విస్మరించడు. అందుకే వెంటనే ఇక్కడ నుండి బయటపడటం శ్రేయస్కరం. కానీ వీళ్లకు చెప్పి వెళ్లాలా? వద్దా?

సరాసరి ఇంటికి వచ్చాడు. "హోటల్‌కి వెళ్లలేదా?" అంది కంగారుగా అక్క.

"లేదు. ఇక వెళ్లనవసరం లేదు''

"ఏమైందిరా'' అంది.

"చాలా అయింది. ఇన్ని రోజులుగా మీ ఆయనా... ఆ చేపలు పట్టుకునేవాడూ ఏమన్నా నేను భరించా. చివరికి నా మీద చెయ్యేని నేరం అంటగట్టారు. మీ ఆయన నన్ను కొట్టాడు. కొడితే కొట్టాడు. అందువలన నాకు వచ్చిన నష్టం ఏమీ లేదు. నేను దిక్కులేకపోవటం వలన వచ్చానంట. నేను ఎందుకూ పనికి రానంట. అవునూ నా పుస్తకం మీ ఆయన చూశాడా''

"నేనే చూపించారా'' అంది.

"నేను రాయటం గురించి కూడా హేళన చేశాడు. ఇప్పుడు చెబుతున్నా. ఇంతకు ముందు నేను రాయలా. ఇకనుంచి రాస్తా. నేను రాస్తే పాఠకులు ఎందుకని చదవరో




చూస్తా. మీ ఆయన నాలుగు రాళ్లు వెనకేశాడు కాబట్టి ఈ ప్రపంచమంతా జయించాననుకుంటున్నాడు. ఆయన నాలుగు దెబ్బలు వేస్తుంటే నేనొకటి అయినా వేయగలను. కానీ చెయ్యేత్తలేదు. ఎందుకో తెలుసా? ఆయన్ని చూస్తే నాకు సిగ్గు ముంచుకొచ్చింది''

కళ్లనిండా నీళ్లతో నిలబడింది అక్క.

"ఎందుకక్కా.. కన్నీళ్లు వలన ఉపయోగంలేదు. నువ్వు గుండెలు పగిలేలా ఏడువ్. భుజంగరావు కదలడు. గుర్తుపెట్టుకో భుజంగరావు కాదు ఆడి బాబు కూడా దిగివస్తాడు. ఎప్పుడో తెలుసా. మనం కూడా తలెత్తిన రోజున. అందుకే ఇకనుండి కొంచెం తలపైకెత్తటం నేర్చుకో' ఆమె పైట కొంగుతో కన్నీళ్లు తుడుచుకుంది.

"మరి నేను బయలుదేరుతా''

"ఇప్పుడా?" అంది.

"అవును... ఇప్పుడే మంచిగానీ, చెడుగానీ నిర్ణయం తీసుకున్నాను. ఈ వేడిలోనే అన్నీ జరిగిపోనీ''

ఆమె లోపలకు వెళ్లింది.

తిరిగివచ్చి చేతిలో ఇరవై రూపాయల కాయితం ఉంచింది.

"ఏమిటిది?"

"తీసుకోరా... నా దగ్గర ఉన్నవవే'

"నాకు తెలుసక్కా. ఇవి నాకు అవసరం లేదు''

"రాఘవా వాటిని కాదనకు''

"అదికాదు''

"అంటే నా మీద కూడా కోపం ఉందా?"

రాఘవ మాట్లాడలేదు.

ఇంట్లోనుండి తన నోట్ పుస్తకమూ... బట్టలూ తెచ్చుకున్నాడు.

"ఇక్కడకు వచ్చేముందు రెండు జతల బట్టలతో వచ్చా... ఇప్పుడు అందులో ఒకటి చిరిగిపోయింది. మరి నేను వస్తాను''

ఆమె దీనవదనంతో తలూపింది.

'ఉండరా' అనాలనుకుంది. నోరు పెగల్లేదు.

'వెళ్లు' అనటానికీ సంశయమే. ఇంటికి వచ్చాక అతను ఏమంటాడో...

రాఘవ సరాసరి హొటల్‌కు వెళ్లాడు.

అక్కడ సప్లయిర్స్‌కీ, వంటవాళ్లకీ, ఇతర పనివాళ్లకీ చెప్పాడు.

"నేను వెళ్లిపోతున్నా''

"ఎక్కడికి బాబూ'' అన్నారంతా.

"మా ఊరు''

"అంటే ఇంక రారా?"

'రాను''

"ఓయ్ ఇలారా'' వెంకట్రావ్ పిలిచాడు.

రాఘవ అటు చూడలేదు.

"నిన్నే''

రాఘవ దగ్గరగా వెళ్లి అన్నాడు, "వ్యాపారమే కాదు. సంస్కారం కూడా నేర్చుకో... ఓయ్ ఏమిటి? నా పేరు రాఘవ. మైండిట్'

కంగుతిన్నాడు.

"అయితే ఏంటంట?"

"ఏంటో నువ్వు చెప్పు... నేను కాదు చెప్పేది''

"మీ మావ చెప్పాడుగా''

"అవును... చెప్పాడు తన కాళ్లు పిసికేవాడి మాటలే వింటానని''

"పిచ్చిగా ఉందా?"

"అవును చాలా పిచ్చిగా ఉంది. ఏం చేస్తావ్''

"మాట్లాడకుండా లోపలకు వెళ్లి పని చూసుకో'

"షటప్.. అసలు నువ్వూ ఇక్కడి ఓ పనివాడివే. అది గుర్తుపెట్టుకో. నీ దగ్గర పని చేసేకంటే భిక్షమెత్తుకోవటం బాగుంటుంది''

"ఆ పనే చెయ్యి''

"తొందరపడకు. నీ పాత రోజులు మళ్లావ

స్తాయి''

"ఏయ్'' అంటూ లేచాడు.

"కూర్చో... నన్ను మంచివాడిగానే చూశావ్. సరదాగా ఉంటే ఇపుడు ఇంకోరకంగా కూడా చూస్తావ్' అతను నిర్ఘాంతపోయి చూస్తుండగా సీరియస్‌గా నడుచుకుంటూ వచ్చాడు.

హెూటల్ వెనక్కి వెళ్లాడు. ఆ ఇంటి ముందు అలా కొంచెంసేపు నిలబడ్డాడు... ఆ అమ్మాయి కనిపిస్తుందేమోనని!

లేదు!

ఎక్కడికి వెళ్లి ఉంటుంది?

ఇప్పుడే వెళ్లాలా?

అందులోనూ ఈ ఊరినుండి శాశ్వతంగా తను వెళ్తుండగా!

అంతే కొన్ని విషయాలు ఇలానే జరుగుతుంటాయి. ఏది ఏమైనా ఇంకా ఎక్కువసేపు ఇక్కడ తను గడపలేదు. ఆమె కళ్లు తనకు జ్ఞాపకం ఉన్నాయి. ఆమె పాట కూడా తన హృయదంలో గాఢంగా ముద్రించుకుపోయింది.

చాలు జీవితంలో ఎప్పుడయినా కలుసుకుంటామో లేదో తెలియదు.

రేపు తను ఏ ఎత్తులకు ఎదుగుతాడో ఏ అగాథాల్లోకి జారిపోతాడో తెలియదు. అయినా తన టీనేజ్‌లో ఇదో అపురూపమైన అనుభవం.

"వస్తాను నేస్తం" అనుకుంటూ ముందుకు కదిలాడు.

★ ★ ★

ఎన్ని సంవత్సరాలక్రితం నాటి మాట ఇది!

కేవలం ఆ కొద్ది రోజుల బంధాన్ని తను చాలాకాలం మరిచిపోలేకపోయాడు. ఒంటరిగా కూర్చున్నప్పుడు ఆ కళ్లు వెంటాడేవి. ఆ పాట వెంటాడేది. నిజంగా జీవితమే శక్తివంతమైంది. ఒకనాడు రోజూ బాధించే జ్ఞాపకాల చోటులో తనకంటూ జీవితం ఏర్పరుచుకోవలసి రావటం, అందులోని విజయాలూ, వైఫల్యాలూ, రాజీలూ అన్నీ అనుభవిస్తూ చివరకు ఆ అమ్మాయిని మరిచిపోయాడు.

చివరకు తన ఎదురుగా ఉన్నా గుర్తుపట్టలేకపోయాడు. ఏదిఏమైనా ఆడవాళ్లు మారినంతగా పురుషులు మారరేమో శారీరకంగా.

ఇన్ని సంవత్సరాల వరకూ ఎలా గుర్తుపెట్టుకుంది తనని?

తనలో ఏమిటంత ప్రత్యేకత?

ఏమీ లేదని తనకు తెలుసు. ఇన్ని సంవత్సరాలు జీవితం కోసమే కాదు రచయితగా నిలదొక్కుకోవటానికి పెద్ద పోరాటం చేయాల్సి వచ్చింది. ఒకానొక దశలో మద్రాసు వెళ్లాడు తను... రాయటం కోసం.

వంద ఇచ్చినా, ఏభై రూపాయలిచ్చినా రాయటానికే నిర్ణయించుకున్నాడు. రెండు నవలలు రాసుకొని మరీ వెళ్లాడు. అది తన దురదృష్టమో, అదృష్టమో తెలియదు. ఆ పబ్లిషింగ్ హౌస్ ఓనర్ ఆ రోజు లేడు. ఊరు వెళ్లాడు. మరో వారం రోజుల వరకూ వచ్చే అవకాశాలు లేవని చెప్పారు. అంతకాలం అక్కడ ఉండటం కుదరదని చెప్పి వెనక్కి వచ్చేయటం జరిగింది. అప్పుడది తనకు దురదృష్టం అనిపించింది.

కానీ తలుచుకుంటే అదే అదృష్టం అయింది.

ఆరోజు ఆయనే ఉంటే జీవితం ఇంకో మలుపు తిరిగి ఉండేది. ముందు రచనలు చూశాక అందులో స్పార్క్ గమనించేవాడు. వెంటనే రెండుమూడు సంవత్సరాలకు కాంట్రాక్ట్ రాయించుకునేవాడు. ఆ తర్వాత కేవలం తనో యంత్రంగా మారిపోయేవాడు. ఇప్పుడు అలాంటి ఇబ్బంది లేదు.

ప్రస్తుతం తనో మర్యాదపూర్వకమైన రచయితగా చెలామణి అవుతున్నాడు. ఆరోగ్యకరమైన రచనలు చేస్తున్నాడనే గుర్తింపు ఉంది. దీనికంతటికి కారణం ఆనాటి సంఘటనే. ఇన్ని సంవత్సరాల తర్వాత వాటన్నింటినీ తవ్వుకోవలసి వచ్చింది.





ఇంతకూ ఆ అమ్మాయి మద్రాసు ఎలా వెళ్ళగలిగింది?

సినిమా నటిగా ఎలా మారింది?

తనను కలుసుకోవాలని ఆమె ఎందుకను కుంటోందో అర్థంకాలేదు రాఘవకి.

ఏదిఏమైనా అదంతా తన యవ్వనపు తొలిదినాలనాటి అనుభూతి. ఆ తర్వాత సరోజని చేసుకున్నాడు. పిల్లలు పుట్టారు. అందరూ కష్టాలు అనుభవించారు. ఈరోజున కనీస జీవితం అంటూ ఏర్పడింది.

తిరిగి గతంలోకి వెళ్ళాల్సి వచ్చింది...

ఆమె ఎందుకు రావాలనుకుంటోందో... ఏం చెప్పాలనుకుంటోందో తనకు తెలియదు. ఆమె ఎవరైనా కావచ్చు. ఒకనాటి తన నేస్తం. తను ఆ ఊరినుండి వస్తూ కూడా ఆ అమ్మాయిని చివరిసారి చూడటానికి తపించి మరీ వచ్చాడు.

అందుకే వెంటనే ఆహ్వానం పంపాలి అనుకున్నాడు. లెటర్ రాయటం ఆరంభించాడు.

శ్రీదుర్గకు!

నువ్వు రాసిన ఉత్తరం అందింది. నిన్ను 'నువ్వు' అంటున్నాను. నాకంటే చిన్నదానివనే కాదు నన్ను 'గురువుగారూ' అని సంబోధించినందుకు కూడా! నువ్వింకా నా జ్ఞాపకాల్లో ఉన్నావు. ఆనాటి నా జీవితంలో నాకు సంతోషమో', తన్మయత్వం కలిగించిన విషయాలు చాలా స్వల్పం. అప్పట్లో నేను నా గురించి ఎక్కువగా ఆలోచించేవాడిని. ఆ తర్వాత నీ గురించి. మనందరం ఒకే తరగతికి చెందినవాళ్ళం అనిపించేది. ఆరోజుల్లో ఎంత మౌనంగా ఉండేదానివో. నీ ఉత్తరం చదివాక నాకు చాలా సంతోషం కలిగింది. బాగా చదువుకోవడం అనేదొకటేకాదు, అందులోని నిజాయితీ చూసి మరింత బాగా సంతోషించాను.

నిజమే... ఆరోజుల్లో నేను అక్కడ ఫెయిల్ అయ్యాను. అందుకు అనేక కారణాలున్నాయి. వారితో తగాదాపడి వచ్చాక నాగురించి ఎవరు వివరాలు అందిస్తారు? నువ్వే కాదు నేను కూడా జీవితంలో నా ఇష్టం వచ్చినరీతిలో బతకలేకపోయాను. జీవితంలో అనివార్యం అయినప్పుడు నేనూ అనేక విషయాల్లో రాజీపడ్డాను. అవేవీ కప్పిపుచ్చాలనుకోవడంలేదు. నా ముఖానికి రంగులు పూసుకోవాలని కూడా లేదు.

ఇదంతా ఎందుకంటే నువ్వు 'మర్యాద పూర్వకమైన' పాత్రలు పోషించిన నటిని కాదు అని రాశావ్. ఆమాటకొస్తే 'మర్యాదకరమైన' పాత్రల్ని మాత్రమే పోషిస్తున్నవారు ఈ ప్రపంచంలో ఒకరయినా ఉంటారా అనేది నాకు సందేహమే! ఎవరి లోపాలూ, బలహీనతలు వారికుంటాయి.

తిరిగి ఇలా అంటున్నానంటే ఏది చేసినా సరయిందే అని కాదు. నువ్వు రాసినట్లుగా మనది కొద్దినెలల పరిచయం. అందులోనూ నువ్వు ఎవరికోసమో అక్కడనుండి తీసుకువెళ్ళేదానివి. నేను కూడా ఇంకొకరికోసమే అక్కడ ఉండేవాణ్ణి. కానీ ఇద్దరినీ ఏకంచేసిన అంశం ఏమిటంటే మనం జీవించటంకోసం చేశాం ఆ పనులు. నువ్వు గురువుగారూ అని పిలవాలనుందన్నావ్. నీకెందుకు అలా అనిపించిందో నాకు తెలియదు. నీ కోరికను నేను తిరస్కరించటంలేదు. నిజమే! కొన్ని విషయాలు ఉత్తరాలద్వారా పూర్తిగా తెలుసుకోవటం సాధ్యంకాకపోవచ్చు. అందుకే నువ్వు స్వయంగా రాగలవు. మా ఆహ్వానం నీకు ఎప్పుడూ ఉంటుంది. వీలుచూసుకొని బయలుదేరి రాగలవు.

ఉండనా మరి!

రాఘవ

రాత్రి పదిగంటలవుతుండగా కారు హారన్ మోగిన శబ్దం.

సరోజ బయటకు వచ్చింది. తమ ఇంటి ముందే ఆగింది. తలుపు తెరుచుకొని నడిచివస్తోందా అమ్మాయి. ముఖానికి ఎలాంటి మేకప్ లేదు. అయినా కూడా గుర్తుపట్టింది

సరోజ. ఆమె ముఖంలో చిరునవ్వు చోటుచేసుకుంది.

"రండి" అంటూ ఆహ్వానించింది.

"రాఘవగారు..."

"అవును... ఇదే ఇల్లు"

"ఉన్నారా?"

"లోపల రాసుకుంటున్నారు"

సరాసరి లోపలికి వెళ్ళింది. రాఘవ ఆశ్చర్యంగా చూస్తూ "ఊహించకుండానే వచ్చావ్" అన్నాడు.

"ముందు చెప్పటానికి టైంలేదు. ముందసలు తీరికలేదు. సడెన్‌గా షూటింగ్ కాన్సిలయింది. అంతే బయలుదేరి వచ్చాను"

"సరోజ... నా భార్య"

"నమస్కారం" అంది శ్రీదుర్గ నవ్వుతూ.

"కూర్చోండి నిలబడే ఉన్నారు"

"ఫర్వాలేదు" అంటూ మంచంమీద కూర్చుంది.

"భోజనం అయిందా?"

"లేదు నాకు చేయాలనిపించలా. డ్రైవర్ తిన్నాడు. నేను ఉంటే తింటాను" అంది శ్రీదుర్గ.

"ఎంతసేపు... కబుర్లు చెప్పుకుంటుంటే అయిపోతుంది"

"అలాకాదు. అసలు కొంచెం అన్నం కూడా లేదా?"

"అన్నం ఉంది. కూరలు లేవు" అంది మొహమాటంగా.

"పచ్చళ్ళున్నాయా?"

"ఉన్నాయి"

"కొంచెం అన్నం పెట్టి పచ్చడి వేసి ఇవ్వండి"

"కాదు..." అంటూ ఏదో చెప్పబోయింది.

"ఏమిటో చెప్పండి"

"నెయ్యి లేదు"

"భలేవారే! అలాంటివన్నీ తింటూకూర్చుంటే లావయిపోతాం. తెలుసుగా అప్పుడు అమ్మల పాత్రలు వేయాల్సిందే"

సరోజ అన్నం వడ్డించి పచ్చడి వేసింది. హాయిగా కలుపుకొని నాలుగుముద్దలు చేసి మింగేశాక... "మజ్జిగ ఉందా?" అంది.

"నీళ్ళు..." అంటూ ఏదో చెప్పబోగా "సరోజగారూ! ఒకప్పుడు నీళ్ళలో ఉప్పు వేసుకొని తిన్నరోజులున్నాయి. అందుకే నాకేం ఇబ్బంది లేదు. పొయ్యండి" అని మజ్జిగతో భోంచేశాక చేతులు కడుక్కొంది.

"ఇప్పుడు చెప్పు" అన్నాడు రాఘవ.

"ముందు మీకో విషయం చెప్పాలి. నాకు రేపు ఉదయం పదకొండు గంటలకల్లా షూటింగ్ ఉంది. నేను ఎటువంటి పరిస్థితులలోనూ హాజరుకావాలి"

"అయితే ఏం చేద్దామంటావ్"

"మీరు ఓ నాలుగురోజులు స్పేర్ చేయగలరా?"

రాఘవ ఆలోచించాడు.

"ఏంలేదు... మనం వెంటనే బయలుదేరుదాం. ఈ నాలుగురోజుల్లోనూ మీతో మాట్లాడతాను. ముందే చెప్పానుకదా! మీతో మాట్లాడాల్సిన విషయాలు చాలా ఉన్నాయి"

"అదే ఆలోచిస్తున్నా"

'అంత ఇబ్బందా?"

"ఏంలేదు. మేనేజర్ మనకి తెలిసినవాడేగా... చెప్పొచ్చులే'

"సారీ సరోజగారూ, మీ కుటుంబాన్ని మొత్తం తీసుకెళ్ళాలనుకున్నాను. కొంచెం ఖాళీగా వస్తే బాగుంటుందనుకుంటున్నా"

"అవునులెండి... పిల్లలకు బడి పోతుందికదా!"

"సెలవుల్లో మీరు తప్పకుండా రావాలి" అంది.

సరోజ నవ్వి ఊరుకుంది.

"సరోజా! రెండు జతల బట్టలుంటే చాలుకదూ!"




"అవును..." అంటూ వాటిని సూట్‌కేస్‌లో సర్దింది.

"హడావిడిగా వచ్చి వెంటనే వెళ్ళిపోతున్నాను. మీరేం అనుకోరుగా. మా సినిమావాళ్ళ జీవితాలన్నీ ఇలానే ఉంటాయి'' అంది.

"సరోజా! పొద్దున్నే కబురుచెయ్యి. అర్జెంట్ పనిమీద మద్రాసు వెళ్ళానని చెప్పు. నాలుగురోజులు ఉండకపోవచ్చు. ఎప్పుడు పని అయిపోతే అప్పుడు బయలుదేరి వస్తా... సరేనా?"

సరోజ తలూపింది.

రాఘవ అంతకుముందే అన్ని విషయాలూ చెప్పి ఉంచాడు.

"మాస్టారూ... మిమ్మల్ని ఇబ్బంది పెట్టానా?"

"నో... నో... అలాంటిదేంలేదు''

"సడెన్‌గా వచ్చి రమ్మన్నాను''

"కొన్ని విషయాలు తప్పవు. సరోజ ఇలాంటివాటన్నింటికీ బాగా అలవాటుపడింది. మనం తరచుగా దేశాలవెంట తిరుగుతుంటాంకదా'' అన్నాడు రాఘవ.

సూట్‌కేస్ తనే తీసుకుంది.

"అదేమిటి?"

"మీరు రండి మాస్టారూ?"

సరోజ నవ్వుతూ అనుసరించింది.

అప్పటికే పక్క ఇంటివాళ్ళు చిత్రంగా చూడటం మొదలుపెట్టారు. ఆమె మేకప్‌మీద లేకపోవడం, ఇంటిముందున్న చెట్లవల్ల చీకటిలో సరిగ్గా శ్రీదుర్గ ముఖం కనిపించకపోవడంతో ఎవరో కార్లో వచ్చారనుకున్నారుగానీ సినిమా తార వచ్చిందనుకోలేదు. సరోజ ఆమె తమ ఇంటికి రాబోతుందని ఎవరికీ చెప్పలేదు కూడా.

కారు కదిలింది.

"మళ్ళా వస్తాను సరోజగారూ'' అంది చేతులూపుతూ. సరోజ తలూపింది.

కారు మెయిన్‌రోడ్డుమీదకు వచ్చేదాకా ఎవరూ మాట్లాడుకోలేదు. ఆ తర్వాత తనే మాట్లాడింది.

"ఏంలేదు మాస్టారూ! నాకు ఎప్పుడు తీరిక దొరికితే అప్పుడు మీతో మాట్లాడాలి. అందుకోసం మీకో హెూటల్‌రూం బుక్‌చేశాను''

"ఎందుకు... మీ ఇల్లు లేదా?"

"ఉందనుకోండి. కానీ మీరు అంగీకరిస్తారో లేదో అని''

"ఎందుకలాంటి ఆలోచనలొస్తాయి. మొన్న ఉత్తరంలో రాశానుగా''

శ్రీదుర్గ మాట్లాడలేదు.

"మీ ఇంట్లో ఎవరుంటున్నారు?"

"ప్రస్తుతం మా అమ్మమ్మ''

"మీకు అన్నయ్యలుగానీ, చెల్లాయిలుగానీ లేరా?"

"నాకో అన్నయ్య ఉన్నాడు. తను నా దగ్గరికి రావాలనుకుంటున్నాడు''

"అతనికి పెళ్ళయిందా?"

"అయింది''

"ఏం చేస్తుంటాడు?"

"ఏమీ చెయ్యడు. బాగా తాగుతాడు. డబ్బులు కనిపిస్తేచాలు అదేపనిమీద ఉంటాడు''

"మీ వదిన"

"ఆమె మంచిదే. కానీ ఏంచేస్తుంది''

"మరి మీ అన్నయ్యని నీతోనే ఉండమంటావా?"

"లేదండీ... వాడిగురించి నేను ఆలోచించాను. కొంత డబ్బు ఇచ్చి ఏదైనా చేసుకోమనటమా, ఏం చేయటమా అని ఆలోచన ఉంది''

"అలాగా?"

"మాస్టారూ మీరేం అనుకోనంటే ఇంకో విషయం చెబుతా''

"చెప్పు''

"నాకు బాగా నిద్ర వస్తోంది''



రాఘవ నవ్వి "అయితే పడుకో' అన్నాడు.

"థాంక్స్ మాస్టారూ'' అంటూ వెనక్కి వాలిపోయింది.

మరికొద్దిసేపట్లోనే రాఘవమీద వాలిపోవటం ఆరంభించింది. రాఘవ ఓసారి సరిచేశాడు.

తిరిగి వాలిపోవటంతో ఇంక ఆమెకు నిద్రా భంగం కలిగించదలుచుకోలేదు.

కారు వేగంగా వెళ్తోంది.

ఒకనాటి తన కోరిక... ఈరోజు ఇలా తీరింది. ఇదంతా నిజం అని నమ్మాలనిపించటంలేదు రాఘవకి.



కడిగిన ముత్యంలా ఉంది దుర్గ.

"ఇప్పుడు చెప్పండి మాస్టారు'' అంది.

"అదేమిటి నువ్వు ఏదో చెబుతానంటూ నన్ను పిలుచుకొని వచ్చి నన్ను చెప్పమంటావేమిటి?''

"నేను చెప్పబోయేముందు మీ గురించి తెలుసుకోవాలి. ముందు నేను శక్తి పుంజుకోవాలి. నా కథ అంత బాగుండదు''

"నీది కథ కాదు. జీవితం" అన్నాడు రాఘవ.

"అవును... జీవితమే. కొంతమంది జీవితాల్నే మీ రచయితలు కథలుగా రాస్తారు. అలా రాసినవన్నీ ఆనందాన్ని కలిగించవు. కొన్ని జుగుప్సాకరంగా ఉంటాయి. మరికొన్ని చాలా బాగుంటాయి. మీరు ఎలాంటి కథలు రాస్తుంటారు మాస్టారు'' అంది దుర్గ.

రాఘవ ఆ అమ్మాయికేసి ఆశ్చర్యంగా చూశాడు.

తను ఇలా ఎదురవటం ఓ ఆశ్చర్యం. తను ఇలా మాట్లాడగలగటం ఓ ఆశ్చర్యం. ఇలా మాట్లాడగలుతున్న ఈ అమ్మాయిని, ఇంత చక్కని రూపంగల ఈ అమ్మాయిలో సెక్స్ తప్పితే ఏమీ చూడలేకపోయారా వీళ్ళంతా. అంతకుమించి ఓ కళాకారిణిని దర్శించలేకపోయారా?

"ఏమిటి మాస్టారు అలా చూస్తున్నారు?"

"నువ్వలా మాట్లాడుతుంటే వినాలనుంది. ఎంత బాగా మారావ్?"

"అవును... మారాను. మీరనుకుంటున్నంత బాగామాత్రం కాదు. జీవితానుభవం మనుషుల్ని అలా మారుస్తుందనుకుంటా''

రాఘవ తలూపాడు.

"నేను ఎలాంటి కథలు రాస్తానని కదూ అన్నావ్. ఇలాంటివే రాయాలనేం నియమం పెట్టుకోలేదు. నాకు అర్థమైన విషయాలమీద రాస్తాను. నాకు అర్థంకాని విషయాలమీద కూడా రాస్తాను. ఎందుకంటే తెలుసుకోవటంకోసం అదో మార్గం.

"నేను మీ రచనలేవీ చదవలేదు''

"చదువుదువుగాని''

"మీవనేకాదు. పుస్తకాలు చదివి చాలాకాలమైంది. రచయితలు రాసిచ్చే డైలాగులుమాత్రం చదువుకుంటాను. అయినా తెరమీద నా పాత్రలకి ఎక్కువ సంభాషణలుండవు. ఉన్నా కూడా అవి పలికేది నేనుకాదు''

"నిజమా... మరెవరు మాట్లాడతారు''

"డబ్బింగ్ ఆర్టిస్ట్ ఉంది. ఆమె చెబుతారు''

"అంటే నీ వాయిస్ పనికిరాదనేగా''

దుర్గ నవ్వింది.

"ఎవడా వెధవ ఆ మాటలంది''

"ఇదో వింతప్రపంచం. ఇక్కడకు వ్యా





పారం చేసేవాళ్ళు వస్తారు. వాళ్ళకి సాహిత్యం గురించి తెలియదు. సంగీతం గురించి తెలియదు. మరే విషయమూ తెలియదు. వారికి తెలిసిందల్లా రూపాయి బయటకు తియ్యటం... దానికి ఎంత వస్తుందా అనే ఆరాటం. వీళ్ళకి చాలా చిత్రమైన నమ్మకాలుంటాయి. ఫలానా నటి కంఠం బాగుండదు అనంటే అంతే. ఇంక బాగుంటుందని ఎవరూ అనరు. ఎవరో ఒకరు ధైర్యంచేసి అది విజయవంతం అయ్యేదాకా ఆ ఆలోచనల్లోనే ఉంటారు. సాయంకాలానికల్లా రకరకాల వార్తలు ప్రచారంలోకి వస్తాయి. కొంతమందికి బతుకు తెరువు ఇది. ఈ రంగంలో చాలా తమాషాలు జరుగుతుంటాయి. కొంతమందికి భయపడి కొందరు పెద్ద దర్శకులూ, తారలే నెలకింతని ఇస్తుంటారు. కారణం ఏమీలేదు. వాళ్ళు తమ ప్రచారంద్వారా ఫీల్డ్‌మీద వత్తిడి తీసుకురాగలరు. అందుకే ఇక్కడ ఒకేసూత్రం... ఎప్పుడూ ప్రచారరంగంలో ముందుండాలి''

"నిజమే... నాకయితే ఎప్పుడూ మద్రాసు రావాలనిపించలా. నీకోసం వచ్చా. నేనూ ఓసారి సినిమాకు పనిచేయాలనే వచ్చాను. కానీ ఈ మనుషులూ, ఈ వాతావరణం చూసి నాకు మతిపోయింది. మామూలుగా అయితే నలుగురితో చర్చించటంవలన ఓ రచనకు మంచి మార్కులు రావటానికి అవకాశం ఉంది. కానీ ఇక్కడ అలాకాదు. ఓ మంచి రచనను వికృతం చేయటానికి నలుగురు కలుస్తుంటారు. అంతమాత్రమే అయితే మనం సంతోషించొచ్చు. వీళ్ళు ఏనాడూ వినివుండని, జీవితంలో కనీసం అలాంటి దృశ్యాలు రెండయినా తీయలేని వీళ్ళు దర్శకుల గురించి కామెంటు చేస్తారు.అవన్నీ విన్నాక నాకు రోత కలిగింది. ఇలాంటి మనుషుల దగ్గరా పనిచేయటం అనిపించింది. అందుకే నేను వెనక్కి వెళ్ళిపోయాను''

"మీరెందుకు రాస్తున్నారు?"

"రాయటం నాకు అవసరం. డబ్బులకోసం రాస్తున్నాను''

"అంతేనా?"

"ఒకప్పుడు అంతే. ఇప్పుడు పూర్తిగా డబ్బులకోసమే అని చెప్పలేను''

"ఏమాత్రం సంపాదించి ఉంటారు?"

రాఘవ నవ్వాడు.

"చెబితే ఆశ్చర్యపోతావ్''

"అంత పెద్దమొత్తమా?"

"అవును.. తెలుగులో ఓ పెద్ద రచయిత తన నవలకు తీసుకునే రెమ్యునరేషన్‌కంటే తక్కువ నా రచనలన్నింటికీ కలిపి వచ్చింది''

"నిజమా?"

"అవును. డబ్బులు వచ్చే రచనలు కాదు నావి. అలాగని ఏమీ తీసుకోని రచనలు కూడా కాదు''

"అప్పుడు మీరెందుకని అలా వెళ్ళిపోయారు''

"అదంతా పెద్ద కథ. ఆ హొటల్ మా మావయ్యది. నేను అక్కడ పనిచేయటంకోసం వచ్చాను. నాకు కుదరలేదు. వచ్చేశాను''

"మీరేమీ అనుకోరుగా''

"దేనికి?"

"వచ్చేముందు మిమ్మల్ని దారుణంగా కొట్టారంటగా''

"ఎవరు చెప్పారు?"

"అక్కడ ఉండే సప్లయర్ చెప్పాడు''

"ఎప్పుడు చెప్పాడు''

"అతనప్పుడు నేనుండే షాపు దగ్గరికి వచ్చేవాడు. రోజుకోసారయినా వచ్చేవాడు''

"ఏం చెప్పేవాడు?"

"ఆ బాబుది ఏం తప్పులేదు. అంతా ఆ వెంకట్రావు కావాలని చేశాడు అని చెప్పాడు. మీరు చాలా మంచివారని చెప్పాడు. ఎప్పుడన్నా మీ గురించి అడుగుతుండేదాన్ని. ఓసారి ఏమన్నాడో తెలుసా?"

రాఘవ కుతూహలంగా చూశాడు.

"'ఎందుకిలా అడుగుతున్నావ్. ఆ అబ్బాయిని ప్రేమించావా?' అన్నాడు''

రాఘవకి తనతో అతను ఇవే మాటలు అనటం గుర్తొచ్చింది.

"నువ్వేమన్నావ్?''

"ఏమన్నానో నాకు గుర్తులేదు. మనుషులు ప్రేమించుకుంటేనేనా ఒకరిగురించి ఒకరు తెలుసుకునేది''

"ఏమోగానీ ప్రేమలేనిదే ఇంకొకరి గురించి తెలుసుకోవాలనే ఆరాటం ఎందుకు కలుగుతుంది''

"ప్రేమంటే ఏమిటి మాస్టారూ?" అంది దుర్గ.

ఈసారి వెంటనే జవాబు చెప్పలేకపోయాడు.

"తెలుసుకోవటమే ప్రేమ కాదుగా''

"కాదేమో!"

"ప్రేమంటే కోరికా?"

"కాదు''

"ఓవేళ ప్రేమలో కోరిక ఉందనుకున్నా ఆ వయసులో మనలో ఏ కోర్కెలుంటాయి చెప్పండి'' అంది.

రాఘవ మౌనంగా తలూపాడు.

"ఏమో అదంతా అలా ఉంచుదాం. నేనయితే మీ గురించి ఆలోచించేదాన్ని. మీ కళ్ళనిండా నాకు దిగులు కనిపించేది. మీరు అలా కూర్చుని దేనికోసమో వెతుక్కుంటున్నట్లనిపిస్తుండేది. అదే రూపం... నాకు బొమ్మలు వేయటం రాదుగానీ వచ్చిఉంటే ఎంత బాగా వేసేదాన్నో''

"ఎవరికయినా చెప్పి గీయించవచ్చుగా''

"నేను మాత్రమే గీయాల్సిన బొమ్మ అది. ఇంకో విషయం తెలుసా? నేను మీకోసమే అక్కడకు వచ్చేదాన్ని. ఆ బల్లపక్కన నిలబడితే మీ పక్కనే నిలబడినట్లుండేది. కానీ ఆ నల్లటి మనిషిని చూస్తే అసహ్యం కలిగేది. ఓసారి ఆయన్నే అడిగితే వెటకారంగా సమాధానం చెప్పాడు. అలాంటివాడితో నాకేమిటి అనుకున్నా''

"అవునూ మీ అమ్మగారూ, నాన్నగారూ లేరా?"

"లేరు''

"అంటే..."

"అదంతా పెద్ద కథ. మా అమ్మ చచ్చిపోయింది. మా నాన్నగురించి మాకు తెలియదు. మేం పుట్టాక ఆయన ఎటో వెళ్ళిపోయాడు''

"ఏమైనా గొడవలు జరిగాయా?"

"ఆ విషయాలు నాకు తెలియవు. కానీ అమ్మ ఆయన్ని ప్రేమించి పెళ్ళిచేసుకుందని మాత్రం తెలుసు. కానీ ఆయనెవరో తెలియదు. ముక్కూమొహం తెలియని అతన్ని పెళ్ళిచేసుకోవటానికి ఇంట్లో ఎవరూ అంగీకరించలేదు. కానీ అమ్మ అప్పుడు మోహావేశంలో ఉంది''

"మోహమా?"

"అవును... దాన్నే ప్రేమ అనుకుంది''

రాఘవ కూతుహలంగా ముందుకు వంగాడు.

"అమ్మమీద మా తాతగారి ప్రభావం చాలా ఉంది''

"ఎవరాయన?"

"ఆయన కూడా మీలాంటి ఓ రచయిత"

"పేరు లేదా?"

"ఉంది కానీ చెప్పను''

"నీ ఇష్టం"

"తెలుగుదేశాన్ని ఓ ఊపు ఊపిన రచయిత. ఆయన కలంనుండి ఓ రచన వస్తుందంటే అల్లాడిపోయేవారు కొందరు. మరికొందరయితే స్వయంగా ఉత్తరాలు రాసి ఆయన తన తరవాతి నవలను ఎప్పుడు విడుదలచేయబోతున్నారోతెలుప్మని కోరేవారు.

రాఘవ ఆశ్చర్యంగా చూస్తుండటం మించి మాట్లాడలేకపోతున్నాడు.




తన ఎదురుగా కూర్చుంది మామూలు వాంప్ పాత్రలు పోషించే నటి కాదు. సారాయి కొట్లో మాంసాలూ, టీలూ అందించిన పాప కాదు. పాఠకలోకాన్ని కదిలించిన ఓ రచయిత మనవరాలు.

"ఆయన పుస్తకాలు నువ్వు చదివావా దుర్గా?"

"చదివాను. అన్నీ చదివాను. అమ్మను అర్థంచేసుకోవటంకోసం చదివాను"

"అర్థం అయిందా?"

"కాలేదు... కాదేమో! అమ్మేకాదు, మా తాతగారూ ఇంతవరకూ సొంతం ఎవరికీ అర్థంకాలా"

"ఇంతకీ మీ అమ్మగారు ఏమనేవారు"

"ఏమీ అనేవారు కాదు. అందరూ మమ్మల్ని బహిష్కరించారు. అయినా అమ్మ లెక్కచేయలేదు. అతనితోపాటు వచ్చింది. ఇద్దరు పిల్లల్ని కంది. కొన్ని సంవత్సరాల తర్వాత అతను వెళ్ళిపోయాడు. ఆ విషయం మాకు ముందే తెలుసు అన్నారు వాళ్ళు. అమ్మ నిశ్శబ్దంగా నవ్వింది. అయినా ఓసారి మమ్మల్ని తిరస్కరించాక ఇంక మా సంగతి వాళ్ళకెందుకు?"

అమ్మ ఏరోజూ వాళ్ళ దగ్గరికి వెళ్ళలేదు. వారెవరినీ ఒక్క మాట అనలేదు. అయినాసరే ఆమె మీద పడి ఏడ్చేవారు"

"నిజమే... అది సహజమే. ఎందుకంటే ఆమె కొట్టిన దెబ్బ కూడా సామాన్యమైంది కాదు. అది గుర్తుకు వచ్చినప్పుడల్లా అల్లాడిపోయుంటారు"

"అమ్మా, అతనూ ఆనందంగానే బతికారు. తర్వాత అతను ఎందుకని వెళ్ళిపోయాడో తెలియదు. కొన్ని కథల్లో చదివినట్లు... ఏ గాలికో కొట్టుకువచ్చినట్లు తను వచ్చాడు. కొంతకాలం బాగానే ఉన్నాడు. తిరిగి గాలి వీచింది. అతను వెళ్ళిపోయాడు. దాని ఫలితం మేమిద్దరం"

"మనుషులు కేవలం ఆ భద్రతకోసమే కలిసి ఉంటారు. దాని చుట్టూ రకరకాల గూళ్ళు కట్టుకుంటారు. మీ అమ్మ తను చేసిందానికి ఏరోజయినా బాధపడిందా?"

"మాకు తెలియదు. అలాంటి భావాన్ని కనిపించనిచ్చేది కాదు. అయినా ఆమె మరణించి చాలాకాలమైంది.

"అంటే నువ్వు అక్కడ పనిచేస్తున్ననాటికే మీ అమ్మగారు లేరా?"

"అప్పటికే చచ్చిపోయింది"

"అలాగా" అన్నాడు రాఘవ.

"ఇన్ని సంవత్సరాల తర్వాత అమ్మ ఏం చేసింది అని నెమరువేసుకుంటే నాకు ఒకటే అనిపించింది. ఇదంతా ఇలా జరుగుతుందని అమ్మకి ముందే తెలుసుననుకుంటా. అయినా అతనెవరోగాని అమ్మను అంతగా ఆకర్షించాడు. వారిద్దరూ ఎంతకాలమైనా గడపనీ, వారిద్దరూ ఒకరికోసం ఒకరు అనేంత గాఢంగా బతికారు. ఆమె జీవితంలో తను చేసిందానికి విచారం చెంది ఉండదు. ఒక్క విషయంలో తప్పించి"

"ఏమిటది?"

"మాకు జన్మనివ్వటం"

"అది సహజమైన విషయమేగా"

"కానీ భద్రతకు దూరంగా ఆమె తనకోసం బతికింది. ఆ తరుణంలో తన మోహం తన పిల్లలమీద ప్రభావం చూపిస్తుందని ఆమె అనుకోలేదు. ఆమెకా స్పృహ వచ్చేసరికి ఆవిడతోపాటు ఈ ప్రపంచంలో ఇంకా ఇద్దరం ఉన్నాం. ఈ ప్రపంచం ఇంకా ఎదగలేదని ఆమెకు తెలుసు. మనుషుల్ని ఆర్థిక బంధాలు మాత్రమే నిలుపుతూ ఉంచుతున్నాయని ఆమె గుర్తించింది. వీటన్నింటికంటే కూడా ఆమెను పరవశం చేసింది ఆమె మోహం"

"అంతేనా?"

"అంతేననుకుంటున్నా. కుటుంబ జీవితంలోని ప్రేమలేని మోహాన్ని ఆమె బాగా గమనించింది. అందుకే సంప్రదాయమా, స్వే

ఛ్ఛా ఏది కావాలో నిర్ణయించుకోవాలనుకున్నప్పుడు ఆమె స్వేచ్ఛని ఎన్నుకుంది. అంతవరకు ఆమెని చూస్తే నాకు తన్మయత్వం కలుగుతుంది. మావాళ్ళు చుట్టుపక్కలవారు ఆమెను చూసి అసూయపడ్డారు. అందరి మనసుల్లో ఆమెలా స్వేచ్ఛగా బతకాలని ఉండేది కాని, అందుకోసం వారు పట్టుచీరలు కోల్పోవాల్సి ఉంటుంది. సుకుమారంగా బతకటం కోల్పోవాల్సి ఉంటుంది. అలాగే అందమైన ఇళ్ళూ, పూజలూ గట్రా కోల్పోవాలి. ఏమీ లేనిడొల్ల జీవితంనుండి పైకి వినిపించే రంగు రంగుల అబద్ధాలను విడిచేయాలి. అవన్నీ విడిచేసినప్పుడు స్వేచ్ఛ లభిస్తుంది. ప్రేమ లభిస్తుంది. మోహం లభిస్తుంది. అవేవీ వారికి అవసరంలేదు. వారికి కావలసిందొకటే!

"వస్తువుల ప్రపంచం

"బంగారపు నగల తళతళలు

"అవన్నీ ఉంటే వారు కోర్కెలకి అతీతంగా బతుకుతారు. ఆ బతుకుల్లో బానిసత్వం ఉన్నా, యాంత్రికత్వం ఉన్నా చప్పదనం ఉన్నా ఆ వస్తువులచాటున అవి మరిచిపోతారు. అమ్మకు ఇవేమీ అవసరంలేదు. అతను కావాలి. ఆ ప్రేమ కావాలి. ఆ రగిలిపోయే కాంక్ష కావాలి. జీవితాన్ని వెలిగించేదేదో కావాలి. ఆ బంధం తాత్కాలికమైనది కాదా అంటారేమో! మనిషికి ఎన్ని సంవత్సరాలు జీవిస్తే తృప్తి కలుగుతుంది? వంద సంవత్సరాలా... వెయ్యి సంవత్సరాలా? అసలు తృప్తి అంటూ ఎరగనివారికి ఎన్ని సంవత్సరాలైనా ఒకటే. అదే సమయంలో తృప్తిని అనుభవించే వారికి ఎన్ని క్షణాలైనా చాలు. అందుకే ఆ స్మృతుల్తో బతికింది. అతను పిరికివాడో, దుర్మార్గుడో, చంచలత్వం కలిగినవాడో నాకు తెలియదు. అవేవీ తనకు అవసరం లేదనుకుందామె.

"అతనితో బయటకు వచ్చినప్పుడు ఎంత ఆత్మవిశ్వాసం కలిగి ఉందో. అతను వెళ్ళిపోయినా అదే ఆత్మవిశ్వాసం కలిగి ఉంది. అందుకే అమ్మను తలుచుకుంటే నా కళ్ళు చెమ్మగిల్లుతాయి'' అంది దుర్గ.

ఆమె కంఠంలో అపశ్రుతి వినిపించింది.

రాఘవ అర్థంచేసుకున్నాడు.

కొద్దిసేపు మౌనంగా గడిపాక అడిగాడు "ఇంతకూ ఆమె ఎలా మరణించారు?"

"జీవితం చాలా చిత్రమైంది మాస్టారూ! ఆమెకు భయంకరమైన జబ్బు ఉంది. బహుశా అది తెలిశాక అతను వెళ్ళి ఉంటాడేమో! లేదా అతనికి మోహం తగ్గి ఉండవచ్చునేమో! ఏమైతేనేం అతను వెళ్ళిపోయాడు. ఇంక మేం మిగిలాం. మాకోసం ఏమైనా చేయాలని ఓ తల్లిగా తను ఆరాటపడింది. జీవితం అలాంటి అవకాశాన్నివ్వలేదు. తను చేసిందాని ప్రభావం తన పిల్లలమీద కూడా చూపేవారిని చూసి ఆమె తల్లడిల్లిపోయింది. ఏకాంతంగా కూర్చున్నప్పుడు ఆమె ఏడ్చేదట"

రాఘవకెందుకో మనసంతా శూన్యంగా అనిపించింది.

"అవునూ... ఆరోజు నువ్వో పాట పాడావ్ నీకది ఇంకా గుర్తుందా?"

"ఉంది''

"ఎవరు రాశారా పాటని''

"నాకు తెలియదు''

"ఎవరు నేర్పారు దాన్ని''

"అమ్మ... అమ్మ పాడుకునేది. అమ్మ నుండి నేను నేర్చుకున్నాను. ఎందుకలా అడిగారు''

"అది పాటకాదు... ప్రాణం"

"అంత బాగుంటుందా?"

"నేను ఆ పాట గురించి వివరించేంత భాష ఉన్నవాడిని కాదు. అదో అద్భుతం అంతే''

దుర్గ రాఘవకేసి తన్మయత్వంతో చూసింది.

మా అమ్మకు చాలా కోరికలు ఉండేవి. మమ్మల్ని బాగా చదివించాలనుకుంది. బాగా అంటే గొప్ప గొప్ప చదువులు చదివించి




ఉద్యోగాలు చేయించాలని కాదు. ఈ బతుకులో ఏం ఉందో శోధించే చదువు చదివించాలని ఆమెకుండేది. సంగీతం నేర్పించాలని, నాట్యం నేర్పించాలని ఉండేది. మా అమ్మ చాలా సాధారణంగా ఉండేదట. ఆమెను గమనించిన వారెవరూ ప్రేమకోసం అంత సాహసం చేయగలదనే విషయం నమ్మరు. మీరు నా పాట వినే అంతగా స్పందించేవారు. ఆ రోజుల్లో అమ్మను గురించి కథలు చెప్పుకునేవారు''

"నాకు చెప్పు దుర్గా... వినాలనుంది''

"చెబుతాను మాస్టారు. దీర్ఘంగానే చెబుతా. ఇంతకాలం నేను నోరువిప్పి చెప్పుకునే మనిషే దొరకలేదు. మీకు తెలుసుగా ఇక్కడ ఎవరికీ హృదయంతో అవసరంలేదు. అవయవాలు కావాలి. విజయాలు కావాలి. ఇన్నేళ్లుగా ఇక్కడే పనిచేస్తున్నా అయ్యో మనం ఎందుకొచ్చాం. ఏం చేస్తున్నాం. ఈ చివరి సంవత్సరాల్లోనైనా ఏమైనా మంచి చేద్దాం అనే ఆలోచన లేని మనుషుల నడుమ నేను ఏం మాట్లాడను'' అని ఆగింది.

"మనం దీర్ఘంగా మాట్లాడుకుంటున్నాం. కనీసం కాఫీ అయినా తాగకుండా'' రాఘవకెందుకో బాలకృష్ణ గుర్తొచ్చాడు.

బజర్ నొక్కి 'రెండు కాఫీ' అంది వెయిటర్ రాగానే.

ఈలోగా ఓసారి బాత్‌రూంకి వెళ్లి ముఖం కడుక్కొని వచ్చింది. కాఫీలు తాగాక అడిగింది.

"సిగరెట్ కాలుస్తారా మాస్టారు''

"అలవాటు లేదు''

"ఈ రోజుల్లో అరుదుగా ఉంటారు మీలాంటివారు''

"మరీ అంతగా పొగడకు దుర్గా. ఎప్పుడైనా నేనూ సిగరెట్ కాలుస్తాను. అది కూడా ఓ రకమైన క్యూరియాసిటీ అంతే. నాకు అందులో ఏమీ ఆనందం కనిపించలా. ఇంక రెండవదంటావా... మందు అంటే నాకు అసహ్యం. మా మావయ్య తన తర్వాతి కాలంలో పూర్తిగా మందుకు బానిస అయిపోయాడు. ఉదయం లేచిన దగ్గర్నుండి కాఫీతో కాదు ఆరంభం- బ్రాందీతోనే''

"నిజమే. ఇక్కడా అంతే. ఆడవాళ్లూ, మగవాళ్లని లేదు. అందులో ఏ సుఖం ఉందో తెలియదు. జీవితాలను కోల్పోయినవారంతా అలా బానిసలయిపోయినవారే. తమ గొప్ప నటనతో జీవితాల్ని వెలిగించినవారూ... అద్భుత ప్రతిభతో గొప్ప కళాఖండాలు సృష్టించినవారూ అందరూ ఈ ద్రవపదార్థంలో కరిగిపోయినవారే. మాస్టారూ- మీ అసహ్యాన్ని ఈ జీవితాంతం ఉండేట్లు చూసుకోండి. అది నా కోరిక''

"తప్పకుండా దుర్గా. అంతేకాదు నేను తాగనని అమ్మకు చెప్పాను. ఇకముందు తాగననే అనుకుంటున్నా''

"ఇంతకీ అమ్మ గురించి కదూ మాట్లాడుకుందాం అనుకున్నాం''

"అవునుకదూ- ఎటునుండి ఎటు జారిపోయాం" అంది దుర్గ అందంగా నవ్వుతూ.

"తప్పదులే. ఆమాత్రం తప్పదు. ఇప్పుడు చెప్పు''

"అమ్మా, నాన్నా కలిసి ఓ ఇల్లు తీసుకున్నారు. అది కూడా మర్యాదస్థులు ఉండేచోటులో కాదు. దూరంగా ఓచోట చిన్న పర్ణశాల లాంటిది నిర్మించుకున్నారు. అప్పుడప్పుడూ ఎవరైనా వచ్చేవారు. అప్పుడు వారికి చిత్రమైన సన్నివేశాలు ఎదురయ్యేవి. అమ్మ ఓ మూల పాడుతూ పనిచేసుకుంటుండేది. బయట నాన్న కూడా పాడుతూనే జవాబు చెప్పేవాడు. మన సినిమాల్లో హాస్యపాత్రల్లా కాదు... చాలా అద్భుతమైన కంఠస్వరాలు వారిద్దరివీ. ఎంత అభిరుచి లేనివారైనాసరే ఆ పాట వింటే ఆగిపోవాల్సిందే. అంతా వినేవారు. తన్మయత్వం చెందేవారు-

ఇంకో తమాషా ఏమిటంటే అమ్మ పాదాల




చెంత నాన్న కూర్చునేవాడు. ఆమె పాదాలు వత్తుతుండేవాడు. అప్పుడూ వారిద్దరూ పాడుకునేవారు. ఇంతలో ఎవరైనా వచ్చినా అమాంతం లేచిపోయేవారు కాదు. ఆ పాట ఆగిపోయేది కాదు. అది అలా కొనసాగేది. వచ్చినవారు ఆశ్చర్యపోయేవారు. తర్వాత తాము కూడా ఆ పాటలో మైమరచేవారు.

పాట ఆగిపోయేది.

అందరూ ఈ ప్రపంచంలోకి వచ్చేవారు.

అప్పటివరకూ మరిచిపోయినవన్నీ గుర్తుకువచ్చేవి. అమ్మ వాళ్లను చూడటం కోసమే అలా పనికల్పించుకునేవారు. ఆ తర్వాత జరిగే ప్రచారం గురించి చెప్పాలా.

"ఆడో ఆడారి వెధవరా. ఆడదాని కాళ్ల దగ్గర కూర్చున్నాడు"

"ఆయన సరే. దానికైనా సిగ్గుండాలిగా. అంత బరితెగించకపోతే మనుషులముందు తన ప్రేమనంతా ప్రదర్శించాలా?"

"అవును మరి దానిక్కావలసింది ప్రేమే"

"ఇంకా నయం. ఊరవతల కాబట్టి సరిపోయింది. నలుగురూ ఉండేచోట ఉంటే పిల్లలందరినీ నాశనం చేసి ఉండేవాళ్లు"

అలాంటి మాటలే అన్నీ.

అంతే... ఆయన మాయం అయిపోయాడు. అమ్మ ఇలాంటివి చాలా చేసింది. తనను గురించి పట్టించుకోనంతకాలం అమ్మ ఎవరినీ ఏమీ అనేదికాదు.

"నా జీవితం నాది. దీనికి చెందిన మంచి చెడ్డలు నావి. వీళ్ళెందుకు కల్పించుకోవాలి" అనేది ఆమె ఆరాటం.

తను అడగకుండానే సలహాలు ఇవ్వటానికి ముందుకు వచ్చేవాళ్ళంటే మాత్రం ఏమాత్రం సహనం చూపించేదికాదు. అలాగని సీరియస్‌గా తగాదా వేసుకునేది కాదు. మెత్తగానే జవాబు చెప్పేది. ఆమెముందు ఎవరూ జవాబు చెప్పలేకపోయేవారు. బయటకు వచ్చాకే ఆమె గురించి రకరకాలుగా చెప్పుకునేవారు.

కొంతమందయితే నాన్న వెళ్లిపోవటానికి కారణం అమ్మేనంటూ ప్రచారంచేసి తమ కక్ష సాధించుకున్నారు. అయినా అదంతా కేవలం వారి ఆనందం. అలాంటివారి ఆనందాన్ని ఏనాడూ తిరస్కరించలేదామె. ఇంతకూ అమ్మ కంఠస్వరం గురించి అందరూ ఒకేవిధంగా మెచ్చుకున్నారు.

నచ్చనివాళ్లు కూడా ఏమంటారో తెలుసా మాస్టారు?

"పాటలు బాగానే పాడేదిలే. దానికి చేతనయింది అదేగా" అని.

ఇప్పుడు అమ్మలేదు.

"ఆమె గొంతు కూడా లేదు" అంది దుర్గ.

రాఘవ దుర్గ చేతిని స్పృశిస్తూ అన్నాడు.

"దుర్గా మీ అమ్మ లేకపోయినా ఆమె జ్ఞాపకంగా నువ్వున్నావు. నీకు ఆమె నేర్పించిన పాట ఉంది"

"కానీ నా చిన్నతనంలో నేర్చుకున్న పాట అది. అమ్మే కనుక ఉండి ఉంటే నేను ఆమెనుండి ఇంకేం వారసత్వాన్ని పొందేదాన్నో తెలియదు. అన్నట్లు చాలా టైం అయినట్లుంది. నేను బయలురేరతాను. మీకు ఇక్కడ అసౌకర్యంగా లేదుకదా"

"అసౌకర్యమా... అయినా ఇంత డబ్బుపోసి ఈ గదుల్లో గడపాల్సిరావటం నాకు చాలా ఇబ్బందిగా ఉంది"

"అలా అయితే మేం ఉండేచోటుకి మారదామా" అంది.

"తప్పకుండా"

"మద్రాసులో తెలుగు పుస్తకాలు దొరికే షాప్ ఒకటి ఉంది. మిమ్మల్ని అక్కడికి తీసుకువెళ్తాను. మీకు కావలసిన పుస్తకాలు అక్కడ తీసుకోండి. ఇక్కడ మీకు ఏమీ తోయకపోవచ్చు. కనీసం ఆ పుస్తకాలుంటే మీకు కాలక్షేపం అవుతుందిగా" అంది.

"అలానే" అన్నాడు రాఘవ.

గదికి బిల్ పేచేశాక కారులో బయలుదేరారు.

"నాతోపాటు ఉండే ముసలమ్మ ఇదివర కటి ముసలమ్మ కాదు. ఇప్పుడు మద్రాసు వచ్చాక ఆమెకు చాలా తెలివితేటలు వచ్చాయి. అంతేకాదు ఆమెని వెతుక్కుంటూ ఇప్పుడు చాలామంది వస్తున్నారు'' అంది దుర్గ.

"ఏమంటుంది వాళ్ళని?"

"చెప్పానుగా. వెనకటి మనిషి కాదని. నిర్దాక్షిణ్యంగా తిరస్కరిస్తుంది. వాళ్లు కూడా ఈ నడుమ రావటం మానేశారు.

"అది సరే. మీ అన్నయ్య విషయం"

"చెప్పానుగా. అమ్మ ప్రభావం మామీద పడింది. అతను అదోలా తయారయ్యాడు. ఏపనీ చేయడు. ఎప్పుడూ కబుర్లు. తాగుతాడు. ఎవరన్నా సంపాదిస్తుంటే ఖర్చు పెట్టాలని ఉంటుంది. కోరికలకు తక్కువేలేదు. నాకు వాడి విషయమే దిగులుగా ఉంటుంది. అందుకే గట్టిగా చెప్పాను. నీ పద్ధతి మార్చుకోకపోతే కష్టం అని''

"అతను ఇక్కడ ఉండటం లేదా?"

"లేదు. కోపం వచ్చి వెళ్ళిపోయాడు. అంతకంటే మా వదినకి ఇదంతా ఇష్టంలేదు. ఈ రంగం అంటేనే ఆమెకు అసహ్యం" అంది దుర్గ.

"మరి..."

"ఏముంది. ఆమె చాలా సహనం కలది కూడా. అన్నయ్యని ఇంకా భరిస్తోంది.

ఏదో ఒకరోజు వాడన్నా మారాలి. లేదా తనయినా మారాలి''

"పిల్లలున్నారా?"

"ఓ ఆడపిల్ల''

"బాగానే ఉంది'' అన్నాడు.

"అందుకే తనకి చివరిసారిగా చెప్పాలనుకుంటున్నా. కొంత డబ్బు ఇచ్చి చిన్న వ్యాపారం ఏమైనా చేసుకో అని చెబుతాను. చేసుకుంటేసరి. లేకపోతే ఎవరు మాత్రం చేయగలిగిందేముంది''

"మీ వదిన మీపట్ల ఎలా ఉంటుంది''

"ఆమెకు నేనంటే ఇష్టం లేదని నేను చెప్పను. కానీ నా పాత్రలు ఆమెకు ఇష్టంలేదు. ఫలానా నటి మీ మరదలటగా అంటే ఆమెకు గర్వంగా అనిపిస్తే వేరే విషయం. కానీ ఆమెకు నామీద ఉన్న ప్రేమకంటే నేను ధరిస్తున్న పాత్రలే అయిష్టాన్ని కలిగిస్తున్నాయి''

రాఘవ తలూపాడు సాలోచనగా.

"డబ్బు కావాలనుకుంటే మనం కొన్నింటిని కోల్పోవాల్సిఉంటుంది మాస్టారు''

రాఘవ ఏదో అనబోయేంతలోగా కారు స్లో అయింది.

ఓ షాపుముందు ఆగింది.

ఇద్దరూ దిగి లోపలకి వెళ్లారు. అక్కడ రకరకాల పుస్తకాలున్నాయి. ఒక్క తెలుగు భాషలోనే కాదు. అన్నిరకాల భాషల్లో ఉన్నాయి. ఎక్కువగా ఇంగ్లీష్ పుస్తకాలు ఒక్కో ఇంగ్లీష్ పుస్తకం ధర తెలుసుకుంటే మతిపోయేటట్లుంది. వందనుంచి వెయ్యి రూపాయల వరకూ ఉన్నాయి ధరలు. అంతకంటే ఎక్కువ కూడా ఉన్నాయి.

"బెస్ట్ సెల్లర్స్'' అని రాసున్నచోట ఆగాడు.

అన్నీ ఇంగ్లీష్ పుస్తకాలు.

కొన్ని ఫిక్షన్, మరికొన్ని జనరల్ పుస్తకాలు.

చాలా అద్భుతమైన గెటప్‌తో ఉన్నాయి. ఓ మూల చార్లీచాప్లిన్ నిలువెత్తు చిత్రం ఉంది. దాని దగ్గరకు వెళ్లి నిలబడ్డాడు.

"బాగుందికదూ'' అంది దుర్గ.

"అవును. బతికి మన ఎదురుగా నిలబడినట్లు ఉంది''

"ఆయన జీవితానికి చెందిన బుక్స్ ఉన్నాయి. చూస్తారా?"

"తెలుగులోనా?"

"కాదు ఇంగ్లీష్‌లో. దాదాపు ప్రతి సంవత్సరం ఓ ఎడిషన్ వస్తుంటుంది''

"ఆయన జీవితం ఓ మహాసము





ద్రంలాంటిదికదూ''

"అవును'' అన్నాడు రాఘవ.

"ఆయన సినిమాలు చూశారా?"

"అన్నీ చూడలేదు''

"మనం ఇక్కడనుండి వెళ్లేటప్పుడు క్యాసెట్స్ తీసుకువెళ్దాం. అన్నట్లు నా దగ్గర కొన్ని క్యాసెట్లున్నాయి''

"దుర్గా నీకు ఇంగ్లీష్ సినిమాలు అర్థం అవుతాయా?"

"పూర్తిగా కావు. కానీ ప్రపంచస్థాయి క్లాసిక్స్‌కి భాష కావాలంటారా?"

"అవసరంలేదు. ఆ హావభావాలూ... ఆ పాత్రలూ మనకు అర్థం అవుతాయి. కాని భాష కూడా వస్తే ఇంకా బాగా ఎంజాయ్ చేయవచ్చుననుకుంటా''

"నిజమే. నాకు కొంతవరకు అర్థం అవుతాయి''

"ఇంగ్లీష్ నవలలు కూడా చదువుతావా?"

"చదవటానికి ప్రయత్నం చేస్తున్నాను. ఎందుకంటే... మేం ఇక్కడ నిలబడాలంటే ముందు కావలసింది భాషలే. తమిళం వచ్చింది. హిందీ, ఇంగ్లీష్ నేర్చుకుంటున్నాను. మీకు ఇంగ్లీష్ రాదా మాస్టారు''

"రాదా అంటే వచ్చు. చాలా స్వల్పంగా వచ్చు''

"అయితే చార్లీచాప్లిన్ ఆటోబయోగ్రఫి వద్దా?"

"చూద్దాం. అంతగా అయితే పక్కన డిక్షనరీ పెట్టుకుని చదువుకోవచ్చుగా'' అన్నాడు.

ఆ పుస్తకం చూడగానే సంతోషంతో ఉప్పొంగింది మనసు.

"నేను మీకిది కానుకగా ఇస్తున్నా''

"ఇంత పెద్ద కానుకలు స్వీకరించటం నాకు ఇష్టం ఉండదు'' అన్నాడు.

"అలా అయితే ఓ పనిచేయండి. ఈ పుస్తకం నేను తీసుకుంటాను. మీరు వెళ్తూ దీన్ని తీసుకువెళ్లండి. ముందు దీన్ని చదవండి. హడావుడిగా చదవనవసరంలేదు. తీరిగ్గా, మీకు తృప్తి కలిగినంతవరకూ చదవండి. మీరు సొంతం చదివాను అనుకున్నాక నాకు ఇచ్చేయండి. నేను నా లైబ్రరీలో దాచుకుంటా''

"నీకు లైబ్రరీ కూడా ఉందా?"

"ఇప్పటివరకూ లేదు. ఇప్పటినుండే స్వంత లైబ్రరీ కోసం కృషి మొదలుపెడుతున్నా'' అంది.

"ఇంకా బుక్స్ చూద్దాం. ఇంత పెద్ద షోరూమా?" అన్నాడు ఆశ్చర్యంగా.

"మన తెలుగులోనే బుక్స్ చదివే అలవాటు తక్కువ. మీకు తెలుసుగా మనమీద ఓ సామెత ఉంది. తెలుగువాడు కొని చదవడని. పేపర్ ఎవరన్నా కొంటే చివరిదాకా చదవగలిగేది ఒక్క తెలుగువాడేనంట. విదేశాల్లో అయితే వారి ఆదాయాలు వేరుగా ఉంటాయి. కొన్ని కొన్ని బుక్స్ చూస్తుంటే మతులు పోతుంటాయి. ఆ పేపరూ, ఆ రంగులూ ఎంత బాగుంటాయో. ముందు మన జనానికి ఈ రీడింగ్ హాబిట్ చెయ్యకపోతే ఈ పత్రికలన్నీ ఏమైపోతాయో?" అంది దుర్గ. ఆ పుస్తకాలకేసి చూస్తుంటే అక్కడినుండి కదలాలనిపించలేదు.

కనీసం నాలుగయిదు గంటలు స్పేర్ చేస్తే గాని వాటిని చూడటం సాధ్యంకాదు అనుకున్నాడు. అందులో పెద్దగా తెలుగు పుస్తకాలు కనిపించలా?

"తెలుగు పుస్తకాలు ఇక్కడ దొరుకుతాయి. అయితే అడ్డమైన ప్రతి చెత్తా దొరకదు. మన ఓల్డ్ రైటర్స్ క్లాసిక్స్ ఉంటాయి. లేదా థీరీకి సంబంధించిన బుక్స్ ఉంటాయి. రోజువారీ విడుదలయ్యే పుస్తకాలు ఇక్కడ ఉండవు''

"పెద్ద పెద్ద కమర్షియల్ రచయితలవి కూడానా?"

"ఫ్యాన్సీగా కొన్ని ఉంచుతారు. అవి కూడా అందరివీ ఉండవు. కొంతమందయితే తమ

పుస్తకాలు ఇక్కడ ఎగ్జిబిట్ అయితే చాలను కుంటారు''

"ఈ షాప్‌తో నీకెలా పరిచయం అయింది'' అన్నాడు.

"భలేవారే మాకు ఆహారమే ఇది. ఇక్కడ కొంతమంది ట్రాన్స్‌లేటర్స్ ఉన్నారు. ముందు కొత్త బుక్ వచ్చిందంటే చాలు. తీసుకోవటం-చదివిపారేయటం. అందులో నచ్చిన అంశాలుంటే నోట్ చేసుకోవటం వాటిని ఇక్కడ రచయితలకు అందిస్తే తెలుగుదనం పూస్తారు''

"అంటే క్యాసెట్స్ అవసరం లేదా?"

"ఎందుకు అవసరంలేదు. అది వేరే డిపార్ట్‌మెంట్. నాకు తెలిసిన ఒకాయనకి కలర్ టీ.వీ., వి.సి.ఆరూ., ఓ అయిదువందల క్యాసెట్లున్నాయి''

"బాప్‌రే' అన్నాడు రాఘవ.

"అవును. స్పీల్‌బెర్గ్‌నుండి అకిరాకురసోవా దాకా. క్లాసిక్స్‌నుండి కౌబాయ్‌దాకా. నేను చెప్పినాయన ఓ చిన్న రచయిత. ఇంక పెద్ద రచయితలైతే ఊహించుకోండి మాస్టారూ''

మరికొంచెంసేపు చూశాక ఒకటి రెండు తెలుగుపుస్తకాలు సెలక్ట్ చేశాడు.

చాలాకాలంగా చదవాలనుకుంటున్న పుస్తకాలవి.

కారు తిరిగి బయలుదేరింది.

"కానీ పరిశ్రమలో వచ్చిన మార్పు హర్షించతగింది కాదు. అవే సబ్జెక్ట్స్. అవే డైలాగులు. ఓ సినిమా హిట్టయితే ఆ మూసలోనే కొన్ని పదుల సినిమాలు. ఇదంతా మార్పేనా?"

"నేను వాటి గురించి చెప్పటంలేదు మాస్టారు. ఓ మార్పు మాత్రం వచ్చింది. అదేమిటంటే ధైర్యం చేసి మనం ఓ మంచి సినిమా తీయగలిగితే, అది బాగుందనుకుంటే ప్రేక్షకులు బాగా రియాక్టవుతున్నారు. ఆమాత్రం మార్పు వచ్చిందికదా.

"నీకు తెలిసినన్ని విషయాలు నాకు తెలియవులే'

"అలా అనకండి. ఇక్కడ పనిచేస్తున్నాం. కాబట్టి కొన్ని విషయాలు తెలుస్తాయి. లైట్ బోయ్ కూడా అనేక విషయాలు చెబుతాడు. అంతమాత్రాన సృజనాత్మకతను ఎవరు చేస్తారు. నేనూ అంతే. నేను బాగా మాట్లాడగలనేమో, కానీ రాయలేను''

"నేనలా అనుకోవటంలేదు. ప్రయత్నం చేస్తే రాయగలవు''

"లేదు లేదు. అదో డిఫరెంట్ స్కూల్. మనకి ఎందుకింత ఆరాధన అంటే అందుకో కారణం వుంది. మనందరికీ ఏకైక వినోద సాధనం సినిమా. రూపాయి ఖర్చు చేస్తే చాలు. మూడు గంటలపాటు థియేటర్‌లో రంగుల స్వప్నం చూడొచ్చు. నేల టిక్కెట్ పది రూపాయలనుండి ఇరవై రూపాయలు చేయండి. మొత్తం ఈ గ్లామర్ అంతా కుప్పకూలుతుంది'' చాలా తాపీగా డిక్లేర్ చేసింది.

"అవును మరి. అప్పుడిక సామాన్యుల వినోదసాధనంగా ఉండదు. అంతదాకా ఎందుకు? సినిమా అంటే ఎరుగని గిరిజనులున్నారుగా. వారి దగ్గరకెళ్తే వాళ్లేం ఆశ్చర్యంగా చూడరు సినిమావాళ్ళని. కొత్తవాళ్లని ఎంత ఆసక్తిగా చూస్తారో వాళ్లని అంతే' అంది.

రాఘవ మెచ్చుకోలుగా చూశాడు.

"ఈ మీడియమ్‌ను బాగుచేయాలంటే ఒకటే మార్గం ఉంది. ఆ గ్లామర్‌తెరలు చించేయటమే'' ఆవేశంగా అంది దుర్గ.

"అది సాధ్యమా?"

"ఎందుకు కాదు. మనిషి తలుచుకుంటే సాధ్యంకానిదేముంది. ఈ విషయం గురించి సీరియస్‌గా ఆలోచించే ఓ వర్గం బయలుదేరాలి'' అంది దుర్గ.

క్యాసెట్ షాప్‌లోకి ఎంటరవుతూ చెప్పింది.

"మీరు ప్రత్యేకంగా చూడాలనుకుంటున్న సినిమాలున్నాయా?"

"ఏమో''




"అయితే నేను కొన్ని క్యాసెట్స్ తీసుకువస్తాను. ఖాళీ సమయంలో అవన్నీ మీరు చూడండి'' అంది.

అక్కడ ఎక్కువ సమయం లేదు.

పదిహేను నిమిషాల్లోనే ఓ ప్యాక్‌తో బయటపడ్డారు.

"ఇంక ఇంటికేనా!" అన్నాడు రాఘవ.

"ఇంటికి వెళ్ళాలని ఉందా?"

"అలా అని కాదు''

"కొంచెంసేపు బీచ్ దగ్గర కూర్చుందాం"

"నీ ఇష్టం"

కారు వేగంగా పరుగులు తీస్తోంది.

ఇసుకలో నడుచుకొంటూ వెళ్లారు.

రాత్రి సమయం కావటంతో నీళ్లు మెరుస్తున్నాయి.

"చాలా బాగుంది'' అన్నాడు.

"ఇక్కడ ప్రజలకు సుఖం ఇదే'' అంది ఇసుకలో కూర్చుంటూ. చల్లటిగాలి... అదో రకమైన శబ్దాన్ని మేళవించుకుని. అంతకుమించి హెూరు.

"అవలా నిరంతరం ఎగిసి పడుతుంటాయి. ఆ లైట్లు రాత్రంతా వెలుగుతుంటాయి. అవిగో ఆ భవనాల గదుల్లో ఏం జరుగుతుందో ఏమో రాత్రీ పగలూ లేదు. సిన్మాలు తీస్తారు. హత్యలు జరుగుతుంటాయి. ఆకలితో పడుకుంటారు. ఆత్మహత్యలు చేసుకుంటారు.

మాస్టారూ... ఇది నగరం

రంగుల ప్రపంచం" అంది దుర్గ.

"నీ మాటలు కూడా నీ పాటంతా బాగున్నాయి''

"నిజమా... మాస్టారూ ఇప్పటివరకూ నా జీవితంలోని ఓ కోణం మాత్రమే చెప్పాను. ఇంకా చెప్పాల్సిందానికి ప్రారంభమే లేదు''

"నాకు తెలుసు దుర్గా. తలుచుకుంటే నాకు ఎంత ఆశ్చర్యంగా ఉందో. నా జీవితం ఇలాంటి మలుపు తీసుకుంటుందని నేననుకోలా. ఈ జీవితం ఎందుకూ పనికిరాకుండానే ముగిసిపోతుందనుకున్నా. అంతకుమించి నువ్వెంకో ఆశ్చర్యం. నువ్విలా మారటం. నువ్విలా మాట్లాడటం. ఇదంతా ఇంకా కలలానే ఉంది. నువ్వు ఉత్తరం రాయటంనుండి ఇదిగో ఇప్పటివరకూ ఏదీ ఊహించనిదే''

"నాకు చాలా కోరికలున్నాయి మాస్టారు

నాకు చాలా కసిగా కూడా ఉంది''

"ఎవరిమీద?"

"ఏమో నాకు తెలియదు

నేనిప్పుడు అశాంతితో రగిలిపోతున్నా

నేను మీమీద ఆశలు పెట్టుకున్నాను?"

"ఏ విషయంలో దుర్గా''

"చెబుతాను మాస్టారూ''

ఆ రాత్రి సమయంలో.

ఆ సముద్రపు వొడ్డున.

ఆ నీటి తళతళల్లో... ఓ మెరుపు మెరిసింది.

రాఘవ తదేకంగా చూశాడు.

అతనికి అర్థమయిందొకటే.

దుర్గలో 'మహానటి' ఉంది. గొప్ప తపన ఉంది.

గాలికి ముంగురులు రెపరెపలాడుతూ ముఖంమీద పడుతున్నాయి. పైట జారిపోయింది. అదేం పట్టించుకోలేదామె. ఆ క్షణం ఓ అపురూప శిల్పంలా ఉంది. గాలి కోర్కెల్ని రెచ్చగొడుతూంది.

అయినా రాఘవ దృష్టి అటులేదు.

ఓ మహాపాత్ర పోషించటం కోసం నిరీక్షిస్తున్న మహానటిలా ఉంది.

ఆమె కళ్లలో ఆర్ద్రత... ఆమె వదనంలో పట్టుదల మెరుస్తున్నాయి.

దగ్గరకు తీసుకొని నుదుటిమీద చుంబించాలనిపించింది.

కానీ ఇంగితం పనిచేస్తోంది.

ఇందాకా అంతే...

తను దుర్గను స్పర్శించేదాకా అలాంటిది జరిగిందని తెలియదు. అయితే ఆమెను తాక గానే అదోరకమైన అనుభూతి.

మోహం కాదది.

మరేమిటి?

ఏమో! ఏమైనా కావచ్చు.

ఆ స్పర్శలో కోరికే ఉంటే దుర్గ గ్రహించలేనంత అమాయకురాలా?

అసలు అలాంటిది జరిగిందన్నట్లు కూడా ఎరగని విధంగా ప్రవర్తించింది.

ఎంత సంస్కారం!

రాఘవ ఆలోచనలనుండి తేరుకున్నాడు.

"మనం వెళ్దామా?"

"పదండి''

ఇద్దరూ లేచి బయలుదేరారు.

ఇంటి దగ్గర ఆగాకగాని వారు మాట్లాడుకోలేదు.

"రండి మాస్టారు'' అంది.

రాఘవ అనుసరించాడు.

"ఈరోజు జ్వరంగా ఉందని ఇంటి దగ్గరే ఉండిపోయింది'' అంటూ ఓ గది దగ్గరకు నడిచింది.



"అమ్మా ఎలా ఉంది?" అంది.

"తగ్గింది''

"భోంచేశావా?"

"ఈ పూట తినాలనుకోలేదు. కొంచెం తేలిగ్గా ఉంటుందని''

"ఈయనెవరో తెలుసా?"

"తెలియదు''

"మన ఊర్లో ఉండేవారు. మీ గురువుగారు''

రాఘవకి నవ్వు వచ్చింది.

"మళ్ళా వస్తాను'' అంది.

ఆమె తలూపింది.

"రండి'' అంది.

"ఇదేమో గది''

"సినిమావారి గదిలానే ఉంది''

"స్నానం చేయాలంటే లోపలే. వేడినీళ్లు కావాలంటే స్విచ్ వేయండి. చాలు''

రాఘవ తలూపాడు.

"పది నిమిషాల్లో వస్తాను. భోంచేద్దాం"

"అలాగే'' రాఘవ తలూపాడు.

దుర్గ వెళ్ళిపోయింది.



ఉదయమే మేకప్ అయి వచ్చింది.

"వెళ్తున్నావా?" అన్నాడు రాఘవ.

"అవును టైం అయింది కదా. షూటింగ్ చూట్టానికి మీరూ వస్తారా''

"నాకేమంత ఇంట్రెస్ట్‌గా లేదు''

"అలా అయితే చదువుకోండి. లేదా సినిమాలు చూడండి. మీకు వి.సి.ఆర్ ఆపరేట్ చేయటం వచ్చా?"

"రాదు''

"అలా అయితే రండి'' అంటూ చూపించింది.

ఆ తర్వాత రిమోట్ కంట్రోల్ అందిస్తూ చెప్పింది.

"మీకు సినిమా డ్రాప్ అవుతున్నట్లు అనిపిస్తే ఇదిగో ఈ బటన్ నొక్కితే చకచకా ముందుకు వెళ్తుంది. తిరిగి ఈ బటన్ నొక్కితే మామూలుగా వస్తుంది. సరేనా?"

"తిరిగి రాత్రికేనా రావటం?"

"అవును. సాయంకాలానికల్లా వస్తాను. త్వరగా అయిపోతే ఇంకా ముందు వస్తాను. మీకు ఎప్పుడు భోజనం చేయాలనిపిస్తే అప్పుడు భోజనం చేయండి. మధ్యలో నేను ఓసారి ఫోన్ చేస్తా."

"అలాగే''

దుర్గ వెళ్ళిపోయింది.

వెనక్కి తిరిగి మరోసారి చెయ్యి ఊపి వెళ్ళింది.

రాఘవ నవ్వుకున్నాడు.

'ఇంక సాయంకాలందాకా దుర్గ రాదు' అనుకుంటే కొద్దిగా నిరాశ కలిగింది.

సినిమాలు చూడవచ్చుగానీ వంటరిగా చూడటంలో ఏమంత థ్రిల్ కనిపించలేదు.

అయినా అంతకంటే చేయదగింది కూడా కనిపించలేదు.

వరసగా క్యాసెట్లు చూడటం మొదలుపెట్టాడు.

'టెన్ కమాండ్‌మెంట్స్', 'సౌండ్ ఆఫ్ మ్యూజిక్', 'బైబిల్'.

ఇంకా స్పీల్‌బర్గ్ సినిమాలు...

ఇటీవల కాలంలో విడుదలైనవి...

ఏది సెలక్ట్ చేసుకోవాలో అర్థంకాలేదు. ఇంకోపక్క చాప్లిన్ సినిమాలున్నాయి.

ముందు తను తెచ్చుకున్న బుక్స్ చూశాడు.

చదవటానికి ప్రయత్నం చేశాడు.

ముందుకు నడవలా...

ఇలా కాదనుకుని ఓ క్యాసెట్ అందుకుని ఇన్సర్ట్ చేశాడు.

సినిమా ఆరంభం అయింది.

ముందు కొంచెం ఇబ్బందిగా అనిపించినా త్వరగానే లీనం అయిపోయాడు. ఒకటి రెండు చోట్ల కొంచెం డ్రాగ్ అయిందనుకున్నప్పుడు ముందుకు పరిగెత్తించేశాడు. త్వరత్వరగానే సినిమా పూర్తిచేసిన అనుభవం కలిగింది.

అప్పుడే ఓ విశేషం అర్థమైంది.

మనిషి మహా అయితే రోజుకు ఆరుగంటలు తదేకంగా సనిమా చూడవచ్చు. అదే రెగ్యులర్‌గా అయితే ఇంకో ప్రమాదం కూడా ఉంది. కళ్ళు దెబ్బతినవచ్చు. మరి రోజూ డజన్ల కొద్దీ సినిమాలు తయారై దేశంమీద కొస్తున్నాయి. వాటన్నింటినీ పరిశీలించాలంటే అంత సులభం కాదు.

ఇప్పుడయితే అలాకాదు. రిమోట్ కంట్రోల్ చేతిలో పెట్టుకుంటే ఎన్ని కాసెట్లయినా చేసేయటానికి అవకాశం ఉంది. ఇదో సౌలభ్యం అన్నమాట. అయితే ఇదంతా కొత్తదాన్ని సృష్టించటానికి కాకుండా కాపీ చేయటానికనే అంశమే బాధాకరంగా అనిపించింది.

ఓ సినిమా అని కాకుండా వరసగా అన్ని రకాల సినిమాలు చూశాడు.

"భోం చేయరా బాబూ'' అనేదాకా వాటిల్లోనే మునిగిపోయాడు.

భోంచేసి చెయ్యి కడుక్కున్నాక దుర్గ ఫోన్ చేసింది.

"భోంచేశారా?"

"ఇప్పుడే అయింది''

"ఇప్పటిదాకా ఏం చేశారు''

"సిన్మాలు చూస్తున్నా''

"ఎలా ఉన్నాయి?"

"బాగున్నాయి''

"భోజనం ఎలా ఉంది?"

"బాగుంది''

"మీరు అన్నిటికీ ఒకే సమాధానం చెబుతున్నారు''

"మరింకేం చెప్పను''

"సరోజగారు గుర్తొచ్చారా?"

"నిజం చెప్పాలంటే రాలేదు''

"ఆవిడ చేసిన భోజనంలా లేదు కదూ''

"అదేంకాదు... ఆవిడ పద్ధతి ఆవిడది. ఇక్కడా బాగుంది''

"ఇప్పుడేం చేస్తారు? పడుకుంటారా?"

"ఇంకా ఏమీ నిర్ణయించుకోలా''

"సరే... సాయంకాలం సరాసరి వచ్చేస్తా. ఈలోగా వీలయితే రెడీగా స్నానం చేసి ఉండండి. మనం బయటకు వెళ్దాం"

"ఎక్కడికి?"

"ఎక్కడికయినా సరే'

"గదికి వెళ్ళాక గుర్తుకు వచ్చింది.

దుర్గ ఉదయం వెళ్తూ ఏవో పత్రికలు ఇచ్చింది... అవోసారి చూస్తే బాగుండును అనుకున్నాడు.

ఆ చిన్న సైజుకట్ట... తీసుకోగానే అర్థం అయింది. అవన్నీ ఎల్లో మాగజైన్స్ అని.

ఒక్కో పత్రికా తెరిచి చూశాడు. 'దుర్గ' ఫోటోలు. అన్నీ వివిధ సినిమాల నుండి సేకరించినవి. వాటికింద రకరకాల వ్యాఖ్యానాలున్నాయి. ఎంత డబ్బు చేతిలో ఉంటే దుర్గ దగ్గర పడుకోవచ్చో, ఆమె ఎవరెవరితో ఎలా తిరుగుతుందో అన్నీ వివరంగా రాసి ఉన్నాయి. కొన్ని పత్రికల ముఖ చిత్రాలమీద 'దుర్గ' ఉంది.

రాఘవ భ్రుకుటి ముడిపడింది.

ఈ పుస్తకాలన్నీ ఎందుకు సేకరించి పెట్టు కుంది?

వీటిని తనకివ్వటంలో ఆ అమ్మాయి ఆంత ర్యం ఏమిటి?

ఓ పత్రికలో అయితే 'దుర్గ' పచ్చి తాగుబో తు అనీ, రోజుకో మగాడు లేందే నిద్రపోదనీ రాసుంది.

రాఘవ దుర్గను అర్థంచేసుకునే ప్రయత్నం చేశాడు. తను నిన్ననే చెప్పింది. ఇంతవరకు చెబుతున్నది తన జీవితంలోని ఓ కోణం మాత్రమే అని. రెండో కోణం అంత బాగా ఉండదని. అయినా ఇవన్నీ చూసి తను ఏమనుకుంటుంది? అదలా ఉంటే ఎంతటి ఔన్నత్యం లేకపోతే తన గురించి గ్లామరస్‌గా చిత్రీకరించిన పత్రికలు ఇవ్వక వీటిని ఇవ్వగ లుగుతుంది!

కొద్దిసేపు చదివాక ఇంక చదవాలనిపించక పక్కన పడేశాడు.

చార్లి చాప్లిన్ పుస్తకం అందుకున్నాడు.

కొద్దిసేపటికి ఆ పుస్తకంలో లీనం అయిపో యాడు.

'ఎంత గొప్ప పుస్తకం' అనుకున్నాడు తనే.

అంతకుముందే 'సినిమారంగం' మీద నవల రాద్దామనుకున్న విషయం గుర్తుకు వచ్చింది. ఈ ప్రయాణం వలన కొన్ని విషయా లు అర్థం అయ్యాయి. వీటి ఆధారంగా కొన్ని పాత్రలు సృష్టించుకొని నవల ఆరంభిస్తే ఎలా ఉంటుంది అనుకున్నాడు.

ఎందుకో దుర్గ తలపుకు వచ్చింది.

దుర్గ జీవితాన్నే నవలగా మలిస్తే?

అయినా సినిమారంగానికి చెంది రాయాల నుకున్నప్పుడు రెండు రకాలుగా రాయవచ్చు. మొదటిది హాస్యం లేక వ్యంగ్యం. మన సినిమాలమీద ఇలాంటివి ఎన్నయినా రాయటా నికి అవకాశం ఉంది. రెండవది సీరియస్‌గా రాయటం. ఇలా రాయాలంటే తెరవెనక విష యాల్ని యథాతథంగా రాయటం. అక్కడక్క డా ప్రముఖులపేర్లు తగిలిస్తుంటే పాఠకులూ ఉత్సాహంగా చదువుతారు.

అయితే తను ఎందుకీ రచన చేయాలను కుంటున్నాడు.

ముందా విషయం తేల్చుకోవాలి.

దాన్నిబట్టే ఏరకంగా రాయాలా అనేది నిర్ణయం అవుతుంది.

తనిప్పుడు సినిమారంగానికి చెందిన టెక్నిక్ గురించి రాయాలనుకోవటం లేదు. కారణం అది తనకింకా తెలియదు. ముందు కొన్ని రోజులపాటు పనిచేస్తేగాని ఆయా విష యాలు అర్థంకావు.

మరెందుకు రాయటం?

ఏదో ఉంది.

ఇంకా ఈ రంగంమీద మమకారం ఉంది.

ఇది కూడా మారి తీరుతుందన్న నమ్మకం ఉంది.

పైకి తను అంగీకరించటంలా. కానీ తన మనసులో కోరిక మాత్రం కరిగిపోలా.

పని కుర్రాడు టీ అందించాడు.

"టిఫిన్ చేయమంటారా'' అన్నాడు.

"ఏం టిఫిన్ చేస్తావ్'

"పకోడి వెయ్యమంటే వేస్తాను'' అన్నాడు.

"సరే... వెయ్యి'' అన్నాడు.

పావుగంటలోపల పకోడీలప్లేటు వచ్చింది. చాలా రుచిగా ఉన్నాయి.

"చాలా బాగా చేశావే' అన్నాడు మెచ్చు కుంటూ.

ఆకుర్రాడు సిగ్గుపడ్డాడు.

"నువ్విక్కడికి ఎలా వచ్చావ్?"

"అమ్మగారి అన్నయ్యగారు తీసుకొచ్చా రండి''

"ముందు నుండి నీకు వంటలు వచ్చా?"

"రావండి... అమ్మాయిగారూ పెద్దమ్మగా రూ నేర్పారు''

"బాగానే నేర్చుకున్నావ్'





"ఇంకొంచెం తీసుకువస్తానండి''

"ఏమాత్రం చేసేవేంటి''

"చేశానండి. అమ్మాయిగారికి కూడా''

"ఉంటే తీసుకురా''

అతను వెళ్ళి తెచ్చాడు. అవి తిని స్నానం చేశాడు. బట్టలు కట్టుకుంటుండగా దుర్గ వచ్చింది.

"బోర్ కొట్టలేదుగా''

"ఏం లేదు... ఇప్పుడే మీవాడు ఉల్లిపాయ పకోడి వేసిస్తే రెండు ప్లేట్లు ఖాళీ చేశాను. చాలా బాగా చేశాడు''

"ఎన్ని సినిమాలు చూశారు''

"నాలుగయినా చూసుంటా''

"నేను మామూలు మనిషినవుతా'' అనేసి వెళ్ళిపోయింది. మేకప్ అంతా తుడిచేసుకొని పకోడీల ప్లేటుతో వచ్చింది.

"ఉదయం భోం చేయవా?"

"ఎందుకు చేయను''

"అక్కడికే వస్తుందా?"

"తినాలంటే వస్తుంది. అయినా నాకా భోజనం చేయాలనిపించదు. ఇంటి దగ్గర నుండే చిన్న టిఫిన్ తీసుకువెళ్తాను. మొన్న మీ ఇంట్లో పచ్చడితో తిన్నప్పుడు ఎంత హాయిగా ఉందో''

"నెయ్యి కూడా లేకుండానా?"

"నాకు అలా తింటమే ఇష్టం. సరోజగారు పచ్చళ్ళు బాగా పడతారనుకుంటా''

"అవును... వంట బాగానే చేస్తుంది''

"మరిప్పుడు మనం బయలుదేరుదాం" అంది.

"అలాగే అది సరే. వెళ్తూ నా దగ్గర మంచి పుస్తకాలే పడేసి వెళ్ళావ్''

"అదా'' నవ్వేసింది.

"నీకు బాధకలగదా?"

"మొదట్లో కలిగింది. తర్వాత అలవాటయింది''

"ఎందుకిలా రాస్తారు?"

"వాళ్ళూ బతకాలిగా''

"బతకాలంటే ఇన్ని అబద్ధాలు రాయాలా?"

"అవన్నీ అబద్ధాలని తీసేయకండి. అందులో కొన్ని నిజాలుంటాయి''

"అయినా మీ నటన గురించి కావాలి గానీ... మీ వ్యక్తిగత విషయాలు పాఠకులకు అనవసరం కదా''

"అని మనం అనుకుంటే సరిపోదు. ఎందుకంటే ఇంకొన్ని పత్రికలు మా వ్యక్తిగత విషయాలను గొప్ప చేస్తూ రాస్తున్నాయి. అందులోవి కూడా చాలా అబద్ధాలు. దానికి వ్యతిరేకంగా వీళ్ళు రాస్తుంటారు. ఇందులో బాధపడాల్సిందేంలేదు''

"వీటివలన మీమీద బాడ్ ఇంపాక్ట్ రాదా?" అన్నాడు రాఘవ.

"ఏం వస్తుంది? వీటిని చదివి ఆనందించేవాళ్ళు ఆనందిస్తారు. అంతదాకా ఎందుకు మా అమ్మమీద మర్యాదస్థులు చాలా నీచంగా మాట్లాడుకున్నారు. అది మాత్రం ఏం తక్కువ. అది అలా జరుగుతూనే ఉంటుంది'' అంది తేలిగ్గా.

రాఘవ మాట్లాడలేదు.

మరి కొద్దిసేపటి తర్వాత బయలుదేరారు.

"ఈ కారు నీదేనా?"

"అవును''

"ఇల్లు''

"అది కూడా నాదే''

"సో... నువ్వు సెటిలయ్యావ్''

"కారూ, ఇల్లూ ఉంటే చాలా మాస్టారూ''

"అలా అని కాదు''

"తిండివరకయితే దిగులు లేదు. ఇంకా ఖచ్చితంగా చెప్పాలంటే నేను బాగానే సంపాదించాను. నా దగ్గర కొన్ని లక్షల రూపాయల డబ్బు ఉంది'' నిర్వికారంగా చెప్పింది.



"అవి నీకు చాలవా?"

"చాలటానికి అంతేముంది? ఒకప్పుడు అయిదు రూపాయల కాయితం చూస్తే పరవశం కలిగేది, ఇప్పుడు లక్ష చూసినా అంతే"

"అంటే ఇంకా ఎంత సంపాదించాలని"

"నాకలాంటి కోరిక లేదు"

"మరి ఇంకా ఎందుకు ఇక్కడ"

"ఆ విషయం చెప్పటానికే తీసుకువెళ్తున్నా మాస్టారు"

కారు సరాసరి వెళ్ళి ఓ చోట ఆగింది.

"ఏమిటిది?"

"హొటల్... కానీ చాలా హాయిగా ఉంటుంది. మన ఇష్టం వచ్చినంతసేపు మాట్లాడుకోవచ్చు".

ఇద్దరూ లోపలకు నడిచారు.

వెయిటర్ వచ్చాడు.

దుర్గ ఆర్డర్ చెప్పింది.

"ఇప్పుడేగా తినివచ్చాం"

"ఫ్రూట్‌సలాడ్ చెప్పానంతే"

"సరే... చెప్పు"

"ముందు అది తిందాం"

రాఘవ నవ్వాడు.

"ఎక్కడ పుట్టాం- ఎలా పెరిగాం- చివరకి ఎక్కడ తేలాం అన్నది ఓ మహాగ్రంథం. అమ్మ తన జీవితాన్ని ఇంకోరకంగా మలుచుకుంటే ఈ కథంతా లేదు. అసలు ఓ సారాయి షాపులో తాగుబోతులకోసం మాంసం ముక్కలు తెచ్చుకోవాల్సిన రోజు నా జీవితంలో మొదటి విషాదం. ఎందుకంటే నాకు మాంసాహారం అంటే ఇష్టం ఉండేదికాదు అప్పుడు. కానీ ఇప్పుడు కాదు.

అప్పుడు జీవితానుభవం ఏమి చెప్పిందంటే నీ ఇష్టాఇష్టాల్తో నాకేం సంబంధంలేదు. నువ్వు బతకాలంటే ఇష్టాలతో సంబంధం ఉండకపోవచ్చునని. అది సరిగ్గా నడిస్తే ఇంకోరకంగా ఉండేది. మూడు రోజుల ముచ్చటగా అది ముగిసిపోయింది. మరికొన్ని రోజులు టీస్టాల్ దగ్గర గడిపాను పనిచేస్తూనే. అదీ శాశ్వతం కాదు.

మాకు కడుపుకింత కూడు దొరుకుతూంది. మాకు ఆ రోజుల్లో అంతకుమించి వేరే ఆలోచనలు కూడా లేవు. ఎప్పుడైతే నాకు వయసు రావటం ఆరంభమైందో ఈ పురుషప్రపంచం నాకు అర్థమౌతూ వచ్చింది. వాళ్ళకి వయసుతో కూడా అవసరంలేదు. ఆడదయితే చాలు. అందుకే నన్ను తాకేవారు. గట్టిగా రుద్దుకునేవారు. రకరకాల మాటలు మాట్లాడేవారు. ఇంకోరకంగా చెప్పాలంటే జుగుప్సాకరంగా మాట్లాడుకునేవారు.

ఎన్ని గంటలకాలమనీ- ఎప్పుడూ పనే ఎంత చేసినా ఇంకా మిగిలుండే పని. అయినా కూడా మా కడుపులు నిండలా. కనీసం మంచి బట్టలు దొరకలా. అన్నయ్యయితే ఇంకోరకమైన కోపంలో ఉండేవాడు. వాడితో స్నేహం చేసిన పిల్లలందరూ కూడా గాలికి తిరిగేవారే.

మేం అలాంటి వాతావరణంలో పెరిగాం.

అప్పుడు మా ముసలమ్మకి ఎవరో సలహా ఇచ్చారు.

పిల్ల బాగుంది. ముందుముందు ఇంకా బాగుంటుంది. ఇక్కడుంటే ఇంకా చెడగొడతారు. శుభ్రంగా ఏ డాన్సులాంటిదో నేర్పి మద్రాసు తీసుకువెళ్ళు, దాని జాతకం మారిపోద్ది" అని.

"నాకేం తెలుసు ఆ ఊరు"

"ఎవరికిమాత్రం ఏంతెలుసు. అదృష్టం మనల్ని వెతుక్కుంటూ రాదు. మనం వెతుక్కుంటూ వెళ్ళాలి" అంటూ ఉదాహరణలు చెప్పిందొకావిడ.

ఆమె చెప్పిందానిప్రకారం సినిమాల్లో వెలిగిపోతున్న నలుగురు తారలు మేం ఉండే ఊరికి చెందినవారు. కాబట్టి మేంకూడా వెళ్తే మంచి భవిష్యత్తు ఉంటుంది.

నాకయితే ఏది మంచో, ఏది చెడో తెలియదు. నేను బతకాలి. అంతే. అందరూ నాకళ్ళు




పెద్దవనీ, బాగుంటాయనీ, గుండ్రంగా తిప్పుతాననీ అంటుండేవారు. చెప్పగా చెప్పగా మా ముసలమ్మకి అదే బాగుండుననిపించింది. అది సాధ్యం అవుతుందా కాదా అనే విషయం ఆమె ఆలోచించలా. మేం మద్రాసు బండి ఎక్కుతున్నప్పుడు మాకు ఒకే విషయం చెప్పింది.

"ఇదిగో నేను చెబుతున్నా. నువ్వు పెద్దదానివైపోతావ్... నువ్వేం దిగులుపడకు... ముందు సరాసరి వెళ్ళి వాళ్ళింట్లో దిగండి. నేను చెప్పానని చెప్పండి. ఈ ఊరని చెప్పండి. ఆ తర్వాత మీ అదృష్టం" అంది.

అంతకుముందు కూడా అలానే చెప్పిందిట

మా ప్రయాణం మద్రాసుకు మొదలైంది.

అలా వెళ్తున్నప్పుడు నాకు మా అమ్మ గుర్తుకువచ్చింది''

దుర్గ ఆగింది.

నిశ్శబ్దంగా వింటున్నాడు రాఘవ.

నాకు నటన అంటే ఏమిటో తెలియదు. కెమేరా అంటే తెలియదు. అప్పటివరకూ చదువుకుంది తక్కువ. అయినా కూడా నేను మాట్లాడకుండా మద్రాసు వచ్చాను. నాకున్నదంతా కఠినమైన జీవితానుభవమే. మేం సరాసరి ఆ తార దగ్గరకే వెళ్ళాం. మాకేసి ఆశ్చర్యంగా చూసింది.

"మిమ్మల్ని ఇలారమ్మని చెప్పిందెవరో నాకు తెలియదు. చాలా పొరపాటు చేశారు'' అంది.

ఒక్కసారిగా నీరసం. అయితే ముసలమ్మ అప్పటికే ఓ నిర్ణయానికి వచ్చింది. అన్నయ్యని నమ్ముకుంటానికి లేదు. వాడు జులాయిగా తిరుగుతున్నాడు. మేం ఉన్న ఊరిలో సరైన జీవనమార్గంలేదు. అందుకే చెప్పింది.

"అక్కడ బతకలేక వచ్చాం తల్లీ''

"బతకలేకపోతే సినిమాలు బతికిస్తాయని మీరెలా అనుకున్నారు''

"పిల్ల కళ్ళు బాగుంటాయన్నారమ్మా''

"బాగానే ఉన్నాయి. అయినా కూడా అవకాశాలొస్తాయా'' అంది.

"కంఠం కూడా బాగుంటుంది. చక్కగా పాట పాడుతుంది''

"అవన్నీ ఇక్కడ అవసరంలేదు. పాటలు పాడటానికి ప్రత్యేకంగా వేరే వాళ్ళు ఉన్నారు మీకు తెలియదేమో ఎందరెందరో మీలానే వచ్చి నాశనం అయిపోయారు.'' మేం మాట్లాడలేదు.

"ఇప్పుడు నేనేదో సంపాదించానని, అనుభవిస్తున్నానని మీరు అనుకుంటున్నారు. ఈవిడ ఇలా మాట్లాడుతుందేమిట్రా అనుకోకండి. ఈ అమ్మాయిని చూస్తుంటే నాకెంతో జాలి కలుగుతోంది. అమాయకురాల్లా ఉంది. మీకూ పెద్ద అనుభవం ఉన్నట్లు కనిపించటంలా. లేకపోతే సరాసరి బండెక్కి మద్రాసు ఎలా వస్తారు. ఇదంతా మంచి ప్రపంచంకాదు. ఇక్కడ కనిపించేదంతా మాయ... మమ్మల్ని పైపైన చూస్తే మీకు ఏమీ అర్థంకాదు. ఇన్ని సంవత్సరాలుగా మేం పొందిన బాధలు, అవమానాలు ఎలా చెబితే మీకు అర్థం అవుతాయో తెలియదు. అందుకే చెబుతున్నా, మీరు వెంటనే వెళ్ళిపోండి. ఏదోరకంగా బతకండి. ఆ పిల్లకి మంచిపిల్లాడ్ని చూసి పెళ్ళి చెయ్యి. అంతేగాని ఇంకోక్షణం కూడా ఇక్కడ ఉండొద్దు'' అంటూ మరోమాటకి అవకాశం లేకుండా ఆమె చేతిలో ఓ వందరూపాయల కాయితం ఉంచి వెళ్ళిపోయింది.

ఆమె కారువంక చూస్తూ నిలబడ్డాం.

చేతిలో వందరూపాయల కాయితం రెపరెపలాడుతోంది. ఆమె నాకేసి చూసింది. నేను నిమిత్త మాత్రురాలిని. ఆమె ఏం చేయమంటే అది చేయటంమించి మార్గంలేదు నాకు.

మేం వెనక్కి తిరిగాం. ఇంటికి వెళ్దాం అని మాత్రం అనలేదు మా ముసలమ్మ. మద్రాసు నగరంలో కొంతమంది ఉన్నారు. వారికి ఎలా తెలుస్తుందో తెలియదు. సెంట్రల్ స్టేషన్లో ఏ అమ్మాయయినా సినిమాల్లోకి చేరాలని కాలు మోపితే చాలు వెంటనే తెలిసిపోతుంది.

నేను ఈ చరిత్ర అంతా దీర్ఘంగా చెప్పాలనుకోవటం లేదు. మీరు 'లోన్లీ లేడీ'' అనే సినిమా చూశారా అంది దుర్గ.

"లేదు''

అది చూసి ఉంటే బాగుండేది. మీకు అర్థం అయ్యేది నేను అంతగా వివరించాల్సిన అవసరం కూడా ఉండేది కాదు''

"ఫర్వాలేదు క్లుప్తంగా చెప్పు''

"ఓ అమ్మాయి నాలాంటి ఓ అమ్మాయి ఈ మీడియమ్ తళతళలు చూసి తనూ ఓ అద్భుతమైన చిత్రం తీయాలని వస్తుంది''

ఆమె తను తీయాలనుకుంటున్న సినిమాకు చెందిన స్క్రిప్ట్ అంతా తెచ్చుకుంది. ఎంతో జాగ్రత్తగా, ఎంతో ఆవేశంతో రూపొందించుకున్న ఆ స్క్రిప్ట్ మొహం ఎవరూ చూడరు. వాళ్ళ చూపులన్నీ ఆ అమ్మాయి శరీరం మీదనే ఉంటాయి. ఆమె చెప్పింది వినరు. అసలామెను ఓ వ్యక్తిగానే గుర్తించరు. అలా ఆరంభమైన ఆ అమ్మాయి జీవితాశయం ఏమిటంటే ఎలా అయినా ఓ సినిమా తీయాలి.

అప్పటినుండి మొదలవుతుంది. లైట్ బాయ్, మేకప్‌మాన్, దర్శకుడు, హీరో, డిస్ట్రిబ్యూటర్ ఒకరా ఇద్దరా ఓ సినిమా నిర్మించటానికి ఏఏ వ్యక్తుల ప్రమేయం ఉంటుందో అలాంటివారంతా ఆ అమ్మాయి శరీరంతో ఆడుకుంటారు'' ఆగింది దుర్గ.

"ఇంతకూ ఆ అమ్మాయి సినిమా తీసిందా?"

"ఆ విషయం అలా ఉంచండి. ఆ అమ్మాయిని గురించి మీరేమనుకుంటున్నారు''

రాఘవ సమాధానం చెప్పకుండా దుర్గకేసి చూశాడు.

"ఆ అమ్మాయంటే అసహ్యం కలగటం లేదా?"

"లేదు... అంతవరకు చెప్పగలను''

నేనెలా ఈ రంగంలోకి, తొలిసారి కెమేరా ముందు కాలుమోపానో నాకు గుర్తులేదు. మొదటిసారిగా నన్ను స్టూడియోలో చూసినప్పుడు ఆ మా ఊరి మహానటి కళ్ళు కొద్దిక్షణాలు పెద్దవయ్యాయి. తర్వాత తనకేం తెలియనట్లు ప్రవర్తించింది. అంతకంటే నన్ను ఆకర్షించిందేమిటంటే ఆవిడ కళ్ళు నాకేసి జాలిగా చూశాయి. ఆ చూపును నేనెప్పుడూ మరిచిపోలేను''

రాఘవ తలూపాడు.

"నా మొట్టమొదటి అనుభవం రాక్షసంగా చెరచబడటం" చాలా మామూలుగా చెప్పటానికి ప్రయత్నం చేసింది. అయినా కంట్రోల్ కావటం ఆమెకు సాధ్యంకాలేదు.

అలాంటి విషయం ఏదో చెబుతుందని రాఘవకి తెలుసు. రాఘవకి మాత్రమే కాదు సినిమారంగానికి చెందిన కనీసజ్ఞానం ఉన్నవారెవరికయినా తెలుసు.

కొద్దిక్షణాల తర్వాత తేరుకుంది.

"అదే ప్రారంభం... ఆ తర్వాత మనసు చచ్చిపోయింది. శరీరం మాత్రమే మిగిలింది. మీకో విషయం తెలుసా? ఈ రంగంలో అనేక మంది గొప్ప వారున్నారు. వారందరూ వారి వారి మొగపిల్లల్ని తిరిగి ఈ రంగంలోకి వారసత్వంగా తీసుకువస్తున్నారు. కానీ ఆడపిల్లలని తీసుకురావటంలేదు. ఎందుకంటే ఇక్కడేం జరుగుతుందో వారికి తెలుసు.

నాకిప్పుడు అనేక విషయాలు గుర్తుకొస్తున్నాయి. నా చిన్నతనంలో నా అనుభవాలన్నీ సినిమాకబుర్లే. ఈ జనానికి ఇంకే విషయాలూ అవసరం లేనట్లుగా ఆ విషయాల గురించే మాట్లాడుకునేవారు. ఇప్పటికీ అంతే. దాదాపు అరవైశాతం కబుర్లన్నీ సినిమాలమీదే. జనం ఎంతగా ఎడిక్ట్ అయ్యారంటే సినిమాకి పంపించలేదని ఆత్మహత్యలు చేసుకున్నవారున్నారు. అందుకే కాబోలు ఈ రంగం ఇంకా వెలిగిపోతూనే ఉంది'' అంది.

"నేనిక్కడకు వచ్చి చాలా సంవత్సరాలు అయింది. ఈ కాలమంతా నాలాంటివారిని




చాలామందిని చూశాను. అందరూ ఏదో సాధించాలనే వచ్చారు. ఇక్కడకు వచ్చాక వారి ఆశలన్నీ అడుగంటిపోయాయి. వాళ్ళు సినిమారంగంలో బతుకుమార్గం చూసుకోలేక పోయారు. కానీ శరీరాన్ని అమ్ముకుని మాత్రం బతుకుతున్నారు.

నా శరీరంతో ఆడుకున్న ఓ దర్శకుడికి నన్ను సెక్స్ పాత్రలకు వాడుకోవచ్చుననే విషయం తెలిసింది. అప్పటివరకూ అలా నటిస్తున్నవారు పాతబడిపోయారు. దశాబ్దాలుగా హీరోల్ని భరించగలరుగానీ ఇలాంటి పాత్రలకూ, హీరోయిన్లుకూ ఎప్పుడూ కొత్త రక్తం కావాలి. అందుకే అలాంటి అవకాశం నాకు రావటం జరిగింది. ఇప్పుడిప్పుడే నాకు ఆ రకమైన పేరు వచ్చింది. నాకు ఎంత పేరు వచ్చిందనే విషయంతో సంబంధం లేకుండానే నా గురించి పత్రికలు రాశాయి. వాటిల్లో నిజాలున్నాయి. నిజాలు లేకపోయినా కూడా నేనేం పట్టించుకోను''

"నిజమే''

"ఒక దేశాన్ని మొత్తంగా ప్రభావితం చేసే సినిమా ఈ రకంగా ఉండటానికి కారణం ఏమిటి?" అంది దుర్గ. ఆమె నిజంగానే ఆవేశంగా ఉంది.

"ఏముంది... డబ్బు... అదేకారణం అనుకుంటాను''

"కాదు.. అదొక్కటే కారణం కాదు. ఈ సినిమాలు తీస్తున్నవారికి మించిన డబ్బులు కలవారు ఈ ప్రపంచంలో లేరా?"

"ఎందుకు లేరు... ఉన్నారు''

"మరి అలాంటివారిలో బాధ్యత కలిగినవారందరూ ఎందుకు దూరంగా ఉన్నారు. ఈ విషయాలన్నింటికీ దడిసిపోయా- అసహ్యంచెందా- దేనికని?"

రాఘవ తలవంచుకున్నాడు.

"నాకు తెలుసు మాస్టారూ. మీరు చెప్పరు. మీకు ఈ రంగంమీద కొన్ని అభిప్రాయాలున్నాయి. వాటిని మార్చుకోరు. ఇదంతా డబ్బుతో కూడుకున్న వ్యాపారమే అయినా సినిమాలు తీసినవారందరికీ డబ్బులు రావటం లేదు. అయినా దేశంలో ఇంతమంది మేధావులున్నారు. రచయితలున్నారు. మీరందరూ ఈ రంగాన్ని ఇలా వదిలివేయటం వల్లనే కదా ఈ దుస్థితి''

"మనలాంటివాళ్ళు ఏం చేయగలరంటావ్''

"అదే... ఆ కారణం వల్లనే అలా అయింది. సినిమాలకు చెంది అలా అనుకున్నారు. రేపు సాహిత్యమూ అంతే. మరో విషయమూ అంతే. ఒక్కముక్కలో వాటిని తిరస్కరిస్తే మన పని అయిపోయింది''

రాఘవ నిర్లిప్తంగా నవ్వాడు.

"ఈ దేశంలో బాధ్యత కలిగిన వారు తలో అయిదు వందలు వేసుకున్నా కొన్ని లక్షల రూపాయలు పోగవుతాయి. వాటితో ఓ సంస్థను స్థాపించవచ్చు. మనం సినిమాని థియేటర్‌లోనే చూపించాలనేం లేదు. మన టార్గెట్ నగర ప్రేక్షకులు కాదు. పల్లెల్లో వినోదం కరువైన జనం ఉన్నారు. వారికి కథా చిత్రాలే చూపించవచ్చు. వాళ్ళనే అడిగితే డబ్బులు ఇస్తారు. సినిమా చూసినందుకు తలో రూపాయి ఇవ్వటానికి వాళ్ళేం బాధపడరు. ఒక యూనిట్ సినిమాలు నిర్మిస్తూ పోవాలి. ఇంకో యూనిట్ వాటిని జనంలోకి తీసుకుపోవాలి. అలా నిరంతరం కార్యక్రమం జరుగుతుండాలి. అయినా ఓ సినిమాకు ఎంత ఖర్చవుతుందని అనుకుంటున్నారు'' అంది దుర్గ.

'వ్యాపార సినిమాకు ఖర్చు కోట్లు దాటుతుందని అంటున్నారుగా''

"అవును... అదంతా పెద్దపెద్ద తారలు కావాలనుకుంటే. మనం అలా చేయకూడదు. అసలు ఇదో కార్యక్రమం. ఇక్కడ తారలుండరు. అంటే లక్షలు లక్షలు తీసుకునేవారు. కథా చర్చల పేరిట రోజుల తరబడి తాగటాలుండవు. ఓ అయిదారుగురు. లేదా ఇంకా

తక్కువమంది నాలుగయిదుసార్లు సమావేశం అవ్వాలి. ముందు ఎలాంటి సబ్జక్ట్ తియ్యాలో నిర్ణయించుకోవాలి. అవసరమైతే ఆయా విష యాలమీద కమాండ్ ఉన్న వారి దగ్గరకు వెళ్ళాలి. వారి సహకారం తీసుకోవాలి. చర్చ లు మంచి క్రియేషన్‌కోసం అయి ఉండాలి. అంతేగాని తాగిపడిపోవటానికి కాదు. అలాంటి నిర్ణయం తీసుకున్నాక ఎవరికివారు ఒక్కో విభాగం ఏర్పాట్లు చూసుకుంటూపో వాలి. పెద్దపెద్ద సెట్స్ అవసరంలా. ఎంత తక్కువ ఖర్చులో మనం ఓ చిత్రం ప్రొడ్యూస్ చేయగలమో చూసుకోవాలి. అంతే, ఓ పార లల్ సినిమా తయారయిపోతుంది''

"నువ్వు చెబుతున్నంత సులభంగా జరుగు తుందా?" రాఘవ నమ్మలేకపోతున్నాడు.

"ఏదీ సులభం కాదు. అంతదాకా ఎందుకు, లక్షలు కోట్లు కుమ్మరించినా సర యిన సమయానికి సినిమాలు పూర్తిచేయలేని వారు చాలామంది ఉన్నారు. దానర్థం డబ్బు ఉండటం మాత్రమే చాలదని''

"నిజమే అనుకో. ఇవన్నీ వినటానికి బాగా నే ఉంటాయి. కానీ ఆచరణలోకి వచ్చేసరికి ఇబ్బందులు ఎదురౌతాయి''

"వాటిని అధిగమించాలి'' అంది దుర్గ.

"నువ్వు ఏం చెప్పదలుచుకున్నావో నాకు అర్థం కావటంలా''

"అది రేపు చెబుతాను. ముందు నా ఆరాటం మీకు అర్థంకావాలనేదే నా గోలంతా''

"నువ్వు చెబుతున్న విషయాలన్నీ నాకు అర్థం అయ్యాయి. అంతే కాదు సినిమారంగం అంటే నాకేం పూర్తిగా వ్యతిరేకత లేదు. అదంతా కొంతమంది వ్యక్తులమీద వ్యతిరేకత మాత్రమే. అయినా 'మీడియం'గా దాని శక్తి నాకు బాగా తెలుసు. నాలాంటివారు ఎంతవ రకు ఉపయోగపడగలరు అనే విషయం మీలాంటివారు ఆలోచించాలి''

"ఇంక బయలుదేరదామా?" అంది దుర్గ.

"అలాగే'' అన్నాడు.

ఇంటికి వచ్చాక అంది.

"నేను వివిధ సందర్భాల్లో డైరీ రాసుకున్నా ను. అది ఈ రాత్రి మీకు ఇస్తాను చదవండి''

"నీ డైరీనా''

"అదంతా డైరీకాదు. రోజూ రాయను. ఎప్పుడన్నా రాయాలనిపించినప్పుడు మాత్రం రాసేదాన్ని. ఇదంతా వ్యక్తిగతమే కాదు. మీరు చూడాలి, చదవాలి కూడా''

"నాతోపాటు ఇంటికి తీసుకువెళ్తాను''

దుర్గకొంచెంసేపు ఆలోచించి "సరే' అంది.

మరికొద్దిసేపటి తర్వాత ఓ అందమైన పుస్తకం తెచ్చి అందించింది.

అందులో తన ఫొటో అంటించింది.

"చాలా బాగుంది'' అన్నాడు రాఘవ.

* * *

దుర్గా-

నేను వెనక్కి వచ్చేశాను.

నేను నీతోపాటు అక్కడికి వచ్చేముందున్న నా మానసిక పరిస్థితి వేరు. ఇక్కడికి వచ్చాక వేరు. నా జీవితాన్ని విశ్లేషించుకుంటే నాకు అది ఎంతో అనుభవపూర్వకంగా ఉందేమో అనిపించేది. ఎందుకంటే నేను ఘర్షణకు చెందిన రంగాన్ని ఎన్నుకున్నాను. అంతకు మించి జీవితమే నన్ను ఘర్షణకు గురిచేసింది. నా అనుభవాలు చాలా స్వల్పమైనవే అనే విషయం నాకు తెలుసు.

అయినాకూడా ప్రతి మనిషీ తన గురించి తాను ఎక్కువగా అంచనా వేసుకుంటాడు. ఒక్కోసారి చాలా తక్కువగా కూడా అంచనా వేసుకుంటాడు. ప్రతి మనిషిదీ ఓ చిత్రమైన అనుభవం.

నా ఇటీవల అనుభవం ఏమిటంటే - నా అనుభవాలు చాలా స్వల్పమైనవి. నేను ఎంత ఘర్షణ అనుభవించినా అవన్నీ ఓ ఎత్తు. నువ్వు చెబుతున్న అంశాలు వింటుంటే నాకు ఆశ్చర్యం కలిగింది. భయం కలిగింది. ఇంకా దుఃఖం విరుచుకుపడింది. అంతకుమించి సంతోషం, ఉద్వేగం ఒకటా రెండా ఎన్నెన్ని




భావాలు నన్ను ఉక్కిరిబిక్కిరి చేశాయో చెప్ప లేను.

నువ్వు ఓ మెరుపులా వచ్చావ్. నన్ను నీతోపాటు తీసుకువెళ్ళావు. నువ్వు చాలా చెప్పాలనుకున్నావ్. నీ ఉద్వేగం అంతా ఓ క్రమంలో పెడితే అది ఎంత గొప్పగా ఉంటుందో వేరే చెప్పనవసరంలేదు. అయినా నువ్వు చెప్పనవసరంలేదు. చెప్పింది ఎంత స్వల్పమైనా అందులో అనంతమైన వే దాంతం ఉంది. ముందు నేను ఇక్కడకు వచ్చాక చాలా ఆలోచించాను. ఒక్కసారిగా నిశ్శబ్దం అయిపోయాను. ఎవరితోనూ మాట్లా డాలనిపించలేదు. చివరికి సరోజతోనూ, పిల్ల ల్తోనూ కూడా.

నన్ను భరించటం ఆమెకు అర్థమూ, అలవా టూ కూడా అయ్యాయి. అందుకే నన్నలా వదిలేసింది. మనం ఏకాలంలో జీవిస్తున్నాం అనే విషయం తెల్చుకోవటం చాలా అవసరం. ఒకనాడు నాకున్న ఆవేశాలు ఈనాడు లేవు. అయితే ఓనాటి స్వప్నాన్నిమాత్రం నేను తుడి చేసుకోలేదు. ఈ ప్రపంచంలోని దురదృష్ట వంతుల్లో నేను ఓ అతి స్వల్పభాగం అనేది ఎలాంటి మినహాయింపులు లేకుండా అర్థం అయింది. నేను ఇక్కడకు రాగానే ఓ చిత్రం జరిగింది. 'లోస్లీ లేడీ' సినిమా వచ్చింది. వెంటనే వెళ్ళాను. ఆ పోస్టర్లనిండా ఆ సిని మాకు చెందిన బూతుబొమ్మలు. ఏదో చూ పిస్తామని ఆశపెట్టడం కనిపించాయి. సినిమా చూశాను.

దుర్గా... నేను మనిషిని కాలేకపోయాను. నాకు నువ్వు గుర్తొచ్చావ్. నిన్నే ఆ పాత్రలో చూస్తున్నానా అనిపించింది. నాకు నీ డైరీని తీసి చదవాలని ఇంకా అనిపించటంలేదు. ఎందుకో తెలుసా? అది చదివేస్తే ఓ అపురూప అనుభవం సమాప్తం అవుతుందనే భయం. అంతకంటే ఇంకో భయం ఏమిటో తెలుసా? నువ్వు ప్రశ్నిస్తున్నావ్... నీకు జవాబు చెప్పుకో వలసిన వ్యక్తుల్లో నేనూ ఒకడినే.

మనిషి బలాల, బలహీనతల పుట్ట. నేనూ మనిషినే. నా బలం గురించి నాకు తెలియదు గానీ, నా బలహీనత గురించి నాకు తెలుసు. నాలాంటివారు ఈ సమాజానికి చాలా భిన్నంగా ఉంటామని అనుకోవచ్చు. అయితే అది వాస్తవం కాదు. మేం నిరసించే కొత్త రూపాల్లో మా లక్షణాలుగా కూడా రావచ్చు. ఇదంతా ఎందుకు రాస్తున్నానంటే నీ మాటలు, నీ అనుభవాలు, నీ ప్రవర్తన నన్ను అంతగా కదిలించాయి. ఒకానొక దశదాకా జీవితానికి నువ్వు లోబడినట్లుగా కనిపించావ్. కానీ అను భవాలనుండి ఇంతగా ఎదగటం అందరికీ సాధ్యంకాకపోవచ్చు.

అయినా నిన్ను గమనించాక నాకో విషయం అర్థమయింది. నువ్వెంత ఎదిగినా కూడా నీ ప్రవర్తన గమనిస్తే నువ్వేదో తప్పు చేసిన భావనకు లోనయినట్లుగా భావిస్తున్నా వేమో అనిపించింది. అప్పటి జీవితం నీ చేతుల్లో లేదు. ఇప్పుడిప్పుడే ఆ కళ్ళాలు నీ చేతుల్లోకి వస్తున్నాయి. నువ్వు నీ శరీరాన్ని ఎందరికో ఆహారం చేశావ్. ఓరకంగా ఆలోచి స్తే, నేటి సంప్రదాయాల పరిధినుంచి చూస్తే అదంతా అసహ్యంగా కనిపించవచ్చు. నా కెందుకో మన రోడ్లమీద కనిపించే చెత్త గు ర్తుకు వచ్చింది. అది వీధుల్లో, రోడ్లమీదా అడ్డదిడ్డంగా పడుంటుంది. దాన్ని ఓచోటికి పోగుచేసి అగ్గిపుల్ల వెలిగిస్తే ముందు కొంచెం పొగ రావచ్చునేమోగాని ఆ తర్వాత జ్వలించే ఆ మంటని చూస్తే ఎంత సంతోషం కలుగు తుంది... ఆ మంటలు ఎర్రగా ఉంటాయి. బాగా జ్వలించినప్పుడు నీలిరంగులో దర్శనం ఇస్తాయి.

నాకు నువ్వు జ్వలిస్తున్న నీలిమంటలా ఉన్నావ్. నువ్వింకా మండుతూనే ఉన్నావ్. ఆ నీలిమంట నా హృదయంలో భద్రంగా ఉంది. చిత్రంగా ఈ మంటలు నన్ను బాధించడంలే దు. తన్మయత్వానికి గురిచేస్తున్నాయి. అయి నా మండుతున్న నిన్ను తాకటం ఎలా సాధ్యం చెప్పు. అందుకే నీకు ఇలా చెప్పాలని పించింది. నువ్వు ఏం చేశావనేది ప్రస్తుతం

కాదు. నువ్వు తప్పు చేశావనే అపరాధ భావనతో కుంగిపోవద్దు. మనం ఏం చేశామో మనం అనుకున్నంత మాత్రానే చాలదు. అది సమగ్రం కాదు. మన చర్యల్ని కాలం సమీక్షిస్తుంది. దాని నిర్ణయానికే శాశ్వతత్వంలేదు. ఒకనాటి మంచి ఆ తర్వాతికాలంలో తీవ్రమైన విమర్శలకు గురయింది. ఒకనాటి చెడు తర్వాతికాలంలో గొప్పగా కీర్తించబడింది. తిరిగి వాటి స్థానాలు మారతాయి. అందుకే ఏ కాలంలో, ఏ వాస్తవికతలో మనం బతుకుతున్నామా అనేది అసలైన ప్రశ్న.

ఇక్కడకు వచ్చిన దగ్గర్నుండి నన్ను కదిలిస్తున్న సమస్య ఇంకోటుంది. నిజం చెబుతున్నా. ఇప్పటివరకూ నేను గీసుకున్న చిత్రం వేరు. అది నాకు సంతృప్తిని కలిగించింది. ఒకానొక దశలో నేనున్న చోటులో ఆవిధంగా నిలబడటమే గొప్ప అనిపించింది. కానీ ఇప్పుడలా అనిపించడంలేదు. అలా ఉండటం విశేషమే కావచ్చుగానీ అదేం గొప్ప విషయంకాదు. నేనో వృత్తం గీసుకున్నాను. అదే ఈ ప్రపంచం అనుకున్నాను. అంతవరకూ ఎలాంటి ప్రమాదం లేదు. ఎందుకంటే అదంతా నేను ఇతరులమీద రుద్దలేదు కాబట్టి ఇప్పుడు నాకు అనిపిస్తున్నదేమిటంటే-

జీవితం అందిస్తున్న కొద్దిపాటి స్థిరత్వం నన్ను లోబరుచుకుందేమోనని. నువ్వు చాలా విషయాలు చెప్పావు. అయినా నువ్వు కోరుకున్నంత ప్రతిస్పందన నాలో కనిపించి ఉండదు. నాలో స్పందన ఉండాల్సిన చోటులో జడత్వం ఉండటాన్ని కూడా గుర్తించి ఉంటావ్.

అవును దుర్గా... స్తబ్దత, ఈ జీవితమంతా స్తబ్దత. నిజంగా నువ్వలా జ్వలించకపోతే ఎన్ని భ్రమల గూళ్ళు కట్టుకునేవాడినో. నా స్తబ్దత చుట్టూ అందమైన అక్షరాల్ని పేర్చుకునేవాడిని. నాలో నేను సృష్టించుకున్న స్వప్నాలు చూసి మురిసిపోయేవాడిని. ఈ జీవితం అలా సాగుతూ ఏదో ఒక బిందువు దగ్గర నిశ్చలంగా ఉండిపోయేది. కానీ ఇప్పుడలా కాదు... మంట నన్నూ తాకింది.

ఇకనుండి నా నేపథ్యం వేరు. సరికొత్తదేదో ఆవిష్కరించాలనుకుంటున్నాను. చెప్పానుగా నువ్వు మాటలకోసం ఎంతగా ఇబ్బందిపడ్డావో నేనిప్పుడు పదాలకోసం అంతగా ఇబ్బంది పడుతున్నాను. అందుకే నేనిక్కడ ఆగిపోతా. మరలా రాస్తా... మనం అసంపూర్ణంగా జ్వలించాం. తిరిగి నేను నీతో మాట్లాడాలి. మనం ఆ జ్వలనంనుండే ఓ మార్గం రూపొందించుకుందాం. అలాంటి అవకాశంకోసం చూస్తుంటా...

ఉండనామరి

రాఘవ

"మాస్టారూ!

మీ ఉత్తరం అందింది. మళ్ళీ మళ్ళీ చదువుకున్నాను. నేనున్న మానసిక పరిస్థితుల్లో అదో గొప్పనేస్తం అయింది. నాలాంటి స్త్రీకి ఏం కావాలో అవన్నీ అందించిందా ఉత్తరం. నేను కూడా మీతో మాట్లాడటానికే ప్రయత్నం చేస్తున్నాను. ఎందుకంటే మొన్న మీరు వచ్చినప్పుడు మనం అసంపూర్ణంగా వదిలేసిన వాటిని తిరిగి పూర్తిచేయాలి. సినిమా రంగానికి చెందిన నాకున్న కొన్ని ఆలోచనలు మీకు చెప్పాను. అవి మీకు అంగీకారమో కాదో నాకు తెలియదు. అంతకుమించి అవన్నీ ఆచరణలోకి వచ్చేటప్పటికి కొన్ని కొత్త సమస్యలు కూడా ఎదురుకావచ్చు. అలానే కొన్ని కొత్త ప్రయోజనాలు కూడా మనం పొందవచ్చు. ఆరోజు నేను మీకు ఓ ఆరాటంతో చెప్పాను. ఆ తర్వాత ఆ విషయాల గురించి నా మాటలో కేవలం ఆవేశం, ఆదర్శం మాత్రమే ఉన్నాయా అనేది నేను పరిశీలించుకోవాల్సి వచ్చింది. నాకెందుకో అదంతా చేయగలమనే అనిపించింది. అంతేకాదు ఈ రంగం మరీ గొడ్డుపోలేదు. హిందీ, మలయాళ రంగాలు అలా ఉంచండి. తెలుగుభాషలో కూడా ఓ ఆరాటంతో వచ్చిన మంచి నటులు కొంతమంది ఉన్నారు. వారికి సామాజికంగానూ, సాహిత్య




పరంగానూ పట్టు ఉంది. ముందు సినిమా ఇలా తయారవుతుందే అనే ఆవేదన ఉంది. దురదృష్టం ఏమిటంటే అలాంటి నటుల్లో కొందరు ఎప్పుడో ఓసారి చిన్న చిన్న పాత్రల్లో కనిపిస్తారు. నాకయితే అంత అరుదుగా కని పిస్తూ కూడా ఈ మహానగరంలో ఎలా జీవిస్తు న్నారా అనిపిస్తోంది. వారు ఓ మంచి పరిస్థి తిలో ఉంటే ఎలా ఉండేదోగానీ ఏదో చేయాల నే ఆరాటం ఉంది. అయితే వారు రంగంలోకి రావటమే కష్టం. ఓసారి ఎవరన్నా కదిలితే వారూ ముందుకు నడుస్తారు. మీరు ఈ రంగంమీద ఇప్పుడు పెద్ద ఆశలు పెట్టుకోవ ద్దు. ముందు ఆరోగ్యకరమైన సినిమాని బయ టకు తేవటం అనేది ఎవరైనా కొట్టాల్సిన దెబ్బ. అలాంటివి ఎంత ఎక్కువ సంఖ్యలో రాగలిగితే అంత మంచిది. కాబట్టి ఇప్పుడు మీకు నేనో సూచన చేయదలుచుకున్నాను. ముందు మీరో సమస్యని తీసుకోండి. అది మహిళలకు చెందిందయితే బాగుంటుంది. దా నిచుట్టూ ఓ మంచి కథ అల్లండి. అంతగా అయితే మనం కూర్చుని ఆ కథకు అవసర మైన మార్పులు చేద్దాం. మన సినిమా పూర్తిగా అటో, ఇటో ఉండదు. అంటే నా ఉద్దేశం మన సినిమా ప్రజల్ని చేరాలి. అందుకే అది ఎలా వీలవుతుందని మనం అనుకుంటే ఆరకంగా మనం ముందుకు పోదాం.

నాకయితే ఓ అడ్వంచర్ చేయాలనుంది. చాలా తీవ్రంగా ఉంది. మీరు ఆలోచించండి... నేను నాకు తీరికగా ఉండే రోజులకోసం చూస్తున్నాను. అంతగా అయితే మీరు మరలా ఇక్కడకు రావలసి ఉంటుంది. సరోజగారిని అడిగినట్లు చెప్పండి. వెంటనే కథ తయారుచే యడంలో మునిగిపోతారని ఆశించవచ్చా? మీనుండి రానున్న ఉత్తరంకోసం ఎదురుచూ స్తూ-

మీ
శ్రీదుర్గ

ఉత్తరం చదువుకున్నాక రాఘవ ప్రేమగా రింటికి వెళ్ళాడు. ఆ సమయంలో బాలకృష్ణ లేడు.

"ఏమిటి విశేషం" అంది ప్రేమ.

"దుర్గ ఉత్తరం రాసింది"

"ఏం రాసింది"

"అర్జెంటుగా ఓ కథ తయారుచేయమని తన గొడవ"

"చేస్తే ఎవరు తీస్తారు?"

"దానికి ఆమెకోమార్గం ఉంది. మన మందరం ఇన్వాల్వ్ అయ్యే పరిస్థితి వచ్చేట్లు ఉంది"

"కొంచెం వివరంగా చెప్పు" అంది.

రాఘవ దుర్గ ఆలోచనల గరించి వివరించా డు.

ప్రేమ ఆశ్చర్యంగా అంది "నిజమా! ఆ అమ్మాయిలో అంత షార్ప్‌నెస్ ఉందా?"

"మనిషి అలా కనిపించదు. కానీ ఆమెలో ఎంత ప్రతిభ ఉందో అంచనా వేయటం కష్టం. ఆ నడుమ మీరన్నారుగా. జీవితం మరీ నిస్సారంగా గడుస్తోందని. అలా అయితే మన కిదో చాలెంజింగ్ ప్రాజెక్ట్ అవుతుంది. ఈ సమయంలో చంద్రంగారి సలహాలు కూడా మనం తీసుకుంటే బాగుంటుంది"

"తప్పకుండా... మనం కబురుచేస్తే తను వస్తాడు. పాటలవరకూ తను చూసుకుంటా డు. కథవరకూ నువ్వు చూసుకుంటే బా గుంటుంది. ఏమంటావ్?"

"బాగానే ఉంటుంది. కానీ సినిమా గురించి బొత్తిగా టెక్నిక్ తెలియకుండా ఎలానా అని ఆలోచిస్తున్నా"

"దాని గురించి ఇంత ఆలోచన ఎందుకు? నువ్వు రాయాల్సింది స్క్రిప్ట్ మాత్రమేగా. అంతగా అయితే నువ్వు ఓసారి మద్రాసు వెళ్ళిరా. అక్కడ దుర్గ ఎవరినైనా పరిచయం చేస్తుంది. వాళ్ళ స్క్రిప్ట్‌లు పరిశీలిస్తే నీకు ఎలా తయారు చేసుకోవచ్చో తెలుస్తుంది. ముందు నేను నీకో సలహా ఇవ్వదలచుకు న్నా"



"చెప్పండి''

"నేను తెలుగు సినిమాలు చూడను. లేదా ఫలానా సినిమా చూడను అని భీష్మించుకుని కూర్చోవద్దు. మంచి తెలుగు సినిమా అనుకున్నదాని దగ్గరనుండి చెడ్డ సినిమా అనుకున్నంతవరకూ చూడు. అంతేకాదు బాగా డబ్బులొచ్చిన సినిమాలు చూడు. ఓ దృశ్యం ఎందుకంత గొప్పగా ఉంటుందనుకుంటున్నావో నోట్స్ రాసుకో. అలాగే ఓ దృశ్యం మీకు చెండాలంగా అనిపిస్తే ఎందుకలా అనిపించిందో కూడా నోట్‌చేసుకో కొంత అవగాహన వస్తుంది. ఇంకా డిటైల్స్ కావాలంటే కొంతకాలం ఓ దర్శకుడి దగ్గర పనిచేయటమే''

"అయితే ప్రస్తుతం చేస్తున్న ఉద్యోగం సంగతి ఏమిటి?"

"అది నిర్ణయించుకోవలసింది నువ్వు. నీకు ఓ సంవత్సరం సెలవుపెట్టే అవకాశం ఉంటుందా?"

"ఉంటుందనుకుంటా''

"మరింకేమిటి? చెయ్యి... ఓ ప్రయోగం చెయ్యి''

"దానివల్ల కుటుంబం ఏమన్నా ఎఫెక్ట్ అవుతుందేమోనని ఆలోచిస్తున్నా''

"అందుకే ముందుగా రిజైన్ చేయొద్దు. ఈ ప్రాజెక్ట్ సక్సెస్ అయితే అది వేరే విషయం. అప్పటిదాకా ఈ ఉద్యోగం అవసరం"

"అలా చేద్దామా?"

"చేద్దామని నేననటంకాదు. నువ్వు నిర్ణయించుకో. సరోజతో మాట్లాడి నిర్ణయం తీసుకో. ముందు ఏది ప్రారంభించాలన్నా అది అవసరంకదా'' అంది ప్రేమ.

రాఘవకి అది వాస్తవమే అనిపించింది.

అందుకే ముందుగా ఈ విషయం సరోజతో మాట్లాడితే బాగుండును అనుకున్నాడు.

"మళ్ళీ కలుస్తా'' అంటూ వచ్చేశాడు.



"సరోజా! నేనీ ఉద్యోగం మానేయాలనుకుంటున్నాను. నీ అభిప్రాయం చెప్పు''

"ఎందుకని?"

"సినిమా రంగంలోకి వెళ్ళాలనుకుంటున్నాను''

"ఇందులో నేను చెప్పేదేముంది?"

"నువ్వు చెప్పక ఇంకెవరు చెబుతారు'' అన్నాడు ఆశ్చర్యంగా.

"అలా అనికాదు. మీరు అన్నీ ఆలోచించుకున్నాక కదా ఓ నిర్ణయానికొస్తారు'' అంది సరోజ.

"అలా కాదు, నా ఆలోచనలన్నీ సరయినవి కాకపోవచ్చు. రెండవదేమిటంటే నేను చేసే పనివల్ల ఫలితం అనుభవించేది నేను ఒక్కడినే అయితే ఈ సమస్య రాదు. నాతోపాటు మీరందరూ ఉన్నారుకదా! అందుకనే అడుగుతున్నాను''

సరోజ కొద్దిసేపు ఆలోచించింది. "మీరు ఎక్కడికెళ్ళినా నాకేం అభ్యంతరంలేదు. మీకు నచ్చితేనో, లేదా సంతోషం కలిగితేనో కదా అలాంటి పనులు చేస్తారు. అలాంటప్పుడు నాకు ఇంకో అభిప్రాయం ఉండదు. అయితే ఇంటికి చెందిన సమస్యలున్నాయి. మీరు అలా వెళ్తే మనం ఎలా బతకటం. అది ఆలోచించారా?"

"అందుకే అడిగింది. నేను వెంటనే రాజీనామా చేయాలనుకోవటంలేదు. ఓ సంవత్స





రంపాటు సెలవు పెడతాను. ఆ తర్వాత మనం విజయం పొందితే అక్కడ కొనసాగుతాం. లేదంటావా ఈ ఉద్యోగం ఎటూ ఉంటుందికదా!"

"మీ ఇష్టం"

"అదికాదు. నేను సినిమారంగంలోకి వెళ్ళటం నీకు ఇష్టంలేకపోవచ్చుకదా!"

"లేదంటే మానేస్తారా?" అంది సరోజ.

"మానేస్తాను''

"అలా అయితే మానేయండి'' అంది.

"మానేసి..."

"హాయిగా ఉద్యోగం చేసుకోండి. తీరిక సమయంలో కథలు రాసుకోండి. లేదా మీకు ఎలా చేయాలనిపిస్తే అలా చేయండి'' అంది సరోజ. రాఘవ నవ్వాడు.

"ఎందుకని నవ్వుతున్నారు?"

"నీ మనసులో ఇన్ని ఆలోచనలు పెట్టుకొనే నా మీ ఇష్టం వచ్చినట్లు చేయండి అంది''

సరోజ కూడా నవ్వుతూ చెప్పింది "మీ మనసు తెలుసుకుందామనే నేనూ ఇలా అన్నాను. నిజంగా మీరు ఏం చేసినా నాకు ఆనందమే. అంతగా అయితే మనం కొన్ని కష్టాలు పడతాం. అంతేగా... పడదాం. మీకోసం ఆమాత్రం కష్టాలు భరించలేనని మీరు అనుకుంటున్నారా?"

"అబ్బే... అలాంటిదేంలేదు'' అన్నాడు రాఘవ.

"మీరెందుకిలా అడుగుతున్నారో నాకు బాగా తెలుసు''

"ఎందుకనుకుంటున్నావ్?" రాఘవలో ఆశ్చర్యం.

"సినిమాల్లోకి వెళ్తే చెడిపోవటానికి ఎక్కువ అవకాశాలున్నాయి. నేను వాటికి భయపడుతున్నానా అనే విషయం మీరు తెలుసుకోవాలనుకున్నారు. అంతేగా... నేనోమాట చెబుతాను. చెడిపోవటమా, బాగుపడటమా అనేది అలా ఉంచండి. చెడిపోవటం మీకు ఆనందాన్ని కలిగిస్తే నేను చెప్పగలిగిందేమీ లేదు. కానీ మీరు ఏదైనా పనిచేస్తున్నారంటే ఈ కుటుంబం గురించి ఆలోచించకుండా ఉంటారని నేననుకోవడంలేదు. మీరు ఒకటి అనుకుంటే అది మీకు ఆనందాన్ని కలిగిస్తుందనే నేను అనుకుంటున్నా''

రాఘవ మాట్లాడకుండా సరోజకేసి చూశాడు.

"బాగా చెప్పావ్. నేను వెళ్ళాలనుకుంటున్నది నా ఆనందంకోసంమాత్రమే కాదు. ఏదో చేయాలనే ఆరాటంతో. అది అవసరం కూడా అని నేననుకుంటున్నాను''

"అలాంటప్పుడు ఇంక నేను అభ్యంతరం చెప్పేదేముంది?"

"చాలు... నువ్వు అలాంటి నమ్మకం ఇస్తే చాలు'' అన్నాడు.

★ ★ ★

"మాస్టారూ మీరా'' అంది ఫోన్‌లో ఆశ్చర్యంగా.

"అవును నేనే. మాట్లాడదామనివచ్చాను''

"ఈరోజు రావటానికి కొంచెం ఆలస్యం కావచ్చుననుకుంటాను. ఓ పాట తీస్తున్నారు''

"నేను అక్కడికి రావచ్చా? ఆ పాట ఎలా తీస్తారో చూడాలని ఉంది''

"తప్పకుండా రండి. నేను ఎదురుచూస్తుంటా. గేట్ దగ్గర మనిషిని ఉంచుతా. సరాసరి లోపలకు తీసుకువస్తాడు''

"అలానే, ఇప్పుడే బయలుదేరుతున్నా''

మరికొద్దిసేపట్లో రాఘవ ఫ్లోర్‌లో ఉన్నాడు.

"వచ్చారా?" అంటూ వచ్చింది.

భుజంమీద టవల్ కప్పుకుంది. బట్టలు చాలా తక్కువగా ఉన్నాయి. లైటింగ్ ఎరేంజ్‌మెంట్లు చూస్తున్నారు. ఓ పక్క హీరో కుర్చీలో రిలాక్స్ అవుతున్నాడు. ఆయన చుట్టూ కొంత మంది చేరిఉన్నారు. ఇంకోపక్క కొంతమంది నిర్మాతలు ఆయన్తో మాట్లాడడం కోసం ఎదురుచూస్తున్నారు.

"ఏమిటీ షూటింగ్ చూడాలనిపించిందా?"

"అవును... ముందు పాట ఎలా తీస్తారో చూద్దామని''

"కూర్చోండి'' అంది ఓ కుర్చీ చూపిస్తూ.

ఒకరిద్దరు వారి కేసి ఆశ్చర్యంగా చూశారు.

తిరిగి ఎవరిపనుల్లో వారు మునిగిపోయారు.

"నేను వస్తా'' అంటూ వెళ్లింది.

డాన్స్ డైరెక్టర్ 'మూమెంట్స్' వివరిస్తున్నాడు. దర్శకుడూ, హీరో వాటిని గమనిస్తున్నారు. దర్శకుడు కొన్ని సలహాలు ఇస్తున్నాడు. డాన్స్ డైరెక్టర్‌తోపాటు ఇంకో అమ్మాయి కూడా ఉంది. ఆ అమ్మాయి కదలికలు చాలా వేగంగా ఉన్నాయి.

దుర్గకు ఎలా చేయాలో చూపిస్తోంది.

మరికొద్ది క్షణాల తర్వాత అంతా తయారయిపోయారు.

పాట వినిపిస్తోంది.

ఇంకోసారి మూమెంట్స్ చూసుకున్నారు.

హీరోగారికి తిరిగి ఫైనల్ టచప్ ఇచ్చారు.

'కమాన్... రెడీ'

'సైలెన్స్'

అంతా నిశ్శబ్దం...

పాట తాలూకు సంగీతం.

దుర్గ కెమేరా ముందుకు వచ్చింది.



ఆమెను వొడిసిపట్టుకున్నాడు హీరో.

క్లాప్ కొట్టారు.

పాట...

లైట్లు...

కదలికలు...

కొద్దిక్షణాలు... అంతే...

'కట్'

కెమేరా తిరగటం ఆగిపోయింది.

దర్శకుడు ఏదో చెబుతున్నాడు. అసిస్టెంట్ డైరెక్టర్ కాయితంమీద ఏదో రాసుకుంటున్నాడు.

హీరోగారి అసిస్టెంట్స్ ఆయనమీదకు స్ప్రే చేస్తున్నారు. సెట్ అంతా కోలాహలంగా ఉంది.

ఓ అరగంట చూశాడు. రాఘవకు అప్పుడు అనిపించింది.

"ఇదేమంత తేలిక విషయం కాదు. చాలా ఓపిక కావాలి'' అని దాదాపు ఓ అరగంట విరామం వచ్చింది.

దుర్గ రాఘవని దర్శకుడి దగ్గరకు తీసుకువెళ్లి పరిచయం చేసింది.

"రాఘవగారని, మంచి రచయిత"

అతను తల ఊపాడు. కనీసం విష్ చేయాలని కూడా అతనికి అనిపించలేదు. ఓ క్షణం రాఘవకు చివుక్కుమనిపించింది.

అయినా అలాంటి భావం కనిపించకుండా జాగ్రత్తపడ్డాడు.

వెనక్కివచ్చాక అంది దుర్గ.

"బాధపడ్డారా?"

"లేదు... లేదు''

"ఇక్కడ అంతే. మీరు ఎంత బాగా రాయగలరు అనే విషయంతో ఎవరికీ అవసరంలేదు. అంతేకాదు పత్రికారంగంలో నెంబర్‌వన్ రచయితలు ఇక్కడకు వస్తే వారినసలు గుర్తించరు''

"మీడియమ్ వేరుకదా'' అన్నాడు.

"అనేకాదు. మీడియమ్ వేరు అయినంత మాత్రాన మనిషిని గ్రీట్ చేయటం అనేది కనీస మర్యాదకదా''

రాఘవ నవ్వాడు.

"ఇక్కడ బ్రేక్ చేయాల్సినవి చాలా ఉన్నాయి. అయినా ఓ ఆరాటంతో పనిచేసేవారు ఇంత రిజిడ్‌గా ఉండరు''

"అయినా మనం ఒకటి నేర్చుకోవాలనుకున్నప్పుడు మన వ్యక్తిగత అహాలు విడిచిపెట్టాలి. నేను కమర్షియల్ రచయితని కాదు, నన్ను గుర్తించటానికి. అదే సమయంలో నేను సృష్టించిన గొప్ప అద్భుతమూ లేదు. నేనూ ఏవో కొన్ని రాశాను కాబట్టి రచయిత అంటారు. అది సరే. ముందు నేను స్క్రిప్ట్ ఎలా తయారుచేస్తారు, స్క్రీన్‌ప్లే ఎలా రాసుకుంటారు, ఈ విషయాలన్నీ స్టడీ చేయాలనుకుంటున్నాను''

"అవును... నేను ఓ రచయితని పరిచయం చేస్తా. లేదా ఇంకోపని చేస్తే సరిపోతుందా. కొన్ని దృశ్యాల కాపీలు ఫొటోస్టాట్ తీయించితే వాటిని మీరు స్టడీ చేయొచ్చుకదా''

"అవును... అలా చేస్తే బాగుంటుంది''

"వీలయితే మొత్తం ఆ వివరాలన్నీ మీకు అందించే ప్రయత్నం చేస్తాను'' అంది దుర్గ.

రాఘవ తలూపాడు.

మరికొద్దిక్షణాల తర్వాత షూటింగ్ ఆరంభం అయింది.

ఏకాగ్రతతో వాటిని పరిశీలించాడు.

లైటింగ్‌నుండి మొదలై.. కెమేరాలో ఓ షాట్ ఓ.కే. అయ్యేంతవరకూ అన్ని విషయాలు రాఘవ మనసులో ముద్రించుకుపోతున్నాయి.

అంతా అయిపోవటానికి చాలా సేపు పట్టింది.

దుర్గ సెలవు తీసుకుని బయటపడ్డాక.

"బోర్ కొట్టిందా?" అంది.

"బోర్ అని కాదుగానీ చాలా ఫిలిం వేస్ట్ అయిందనిపించింది''

"అవుతుంది"

"ఒక్కోసారి ఎంతకూ టేక్ ఓకే కాదు. ఒక్కో దృశ్యానికి పదులకొద్దీ టేక్స్ తిన్నవారున్నారు"

"అలా అయితే ముందోపని చేస్తే బాగుంటుందికదా. రిహార్సల్స్ చేస్తే అదంతా తప్పుతుందికదా"

దుర్గ నవ్వుతూ అంది.

"అంత సమయం ఎవరికి ఉంది"

లేకపోతే ఎలా. కనీసం ఓ సినిమా విజయవంతం కావాలన్నా ఆ మాత్రం సిన్సియారిటీ ఉండాలికదా"

"ఉంటే ఇన్ని ఫ్లాప్స్ ఎందుకు వస్తాయి. కొన్నిచోట్ల ఎంత భయంకరంగా ఉంటుందంటే సినిమా మరో రెండురోజుల్లో ప్రారంభం అవుతుందనేదాకా అసలు స్క్రిప్ట్ తయారైఉండదు"

"మరెలా?"

"అంతే! కథ అవసరంలేదు. సీరియస్‌గా తీయాలనేం ఉండదు. ఆ హీరో హీరోయిన్ల కాల్‌షీట్స్ దొరికితే చాలు. ఇక్కడ ఇన్‌స్టెంట్ రచయితలున్నారు. వారు క్షణాల్లో ఏది కావలిస్తే అది వండి ఇస్తారు. దాన్నే రంగుల్లో చుట్టి జనంముందు పడేస్తారు"

"కనీసం హీరోలూ, హీరోయిన్‌లయినా అడగరా. వారి ఇమేజ్‌దెబ్బ తింటుందికదా"

"వీళ్లందరిదీ ఒకే కొలబద్ద. సినిమాని చూడక చస్తారా అనుకుంటారు. అయినా పదిలక్షలు తీసుకునే హీరోకి ఇంకో అయిదు ఇస్తానని వస్తే ఎందుకు అభ్యంతరం చెబుతాడు. ఇంత ఖర్చుపెట్టి సినిమా తీస్తున్నప్పుడు ఆ రిస్క్ నిర్మాతకుండాలి. అయినా ఓ సంవత్సరంలో అయిదారు ఫ్లాప్స్ వచ్చినా ఫర్వాలేదు. ఓ హిట్ ఇస్తే చాలు. తిరిగి అందరూ అటే తిరుగుతారు"

"అవి సరే. ఇవన్నీ మనకి ఏవిధంగా ఉపయోగపడతాయి?"

"చాలా బాగా ఉపయోగపడతాయి. ముందు వీళ్లని గమనిస్తే మనం ఏం చేయకూడదో తెలుస్తుంది. అదే అసలైన అనుభవం"

ఇంటికి వచ్చాక స్నానాలు కానిచ్చి కుర్రాడు అందించిన టీ తాగారు.

"నేను ఇంత త్వరగా రావటానికి కారణం ఉంది. అవునూ... నువ్వు కథని తయారుచెయ్యమన్నావెందుకు?"

"ఎందుకేమిటి మనం సినిమా తియ్యటం కోసమే"

"అదే ఎప్పుడు"

"ఎప్పుడంటే మనం అన్నీ సిద్ధం చేసుకున్నప్పుడు"

"అన్నీ అంటే... ముందు కావలసింది పెట్టుబడికదా" అన్నాడు రాఘవ. దుర్గ ఆలోచిస్తూ తలూపింది.

"వాటన్నింటికంటే ముందుగా కావలసింది స్క్రిప్టు" అంది.

"అది తయారుచేసుకుందాం. అది లేందే మనం రీళ్లు చుట్టడంలాంటిదేం ఉండదు. నేను ప్రేమ్‌గారితో మాట్లాడా... సరోజతో మాట్లాడా... వారంతా నన్ను ముందుకే వెళ్లమన్నారు. అవసరం అయితే నన్ను ఓ సంవత్సరకాలం సెలవు పెట్టమన్నారు. నేను కూడా అదే అనుకుంటున్నా. మనం ఓ ప్రయోగం చేద్దాం. చేయాలనే నేను అనుకుంటున్నా. సక్సెస్ అయిందా... ఓ.కె. లేదంటావా. నేను వెనక్కి వెళ్ళిపోతాను" అన్నాడు.

దుర్గ తలూపింది.

"నువ్వు చెప్పావు. ఓ ఆర్గనైజేషన్‌గా ఏర్పడి సినిమాలు తీయాలని అదంతా పెద్ద ప్రాసెస్.. మనం అదంతా పూర్తిచేసేదాకా ఆగుదామా లేక అంతకుముందే ఆరంభించాలా? ఈ విషయం తేల్చుకోవాలనే నేను వచ్చాను" అన్నాడు.

ఆమె ఓ నిర్ణయానికి వచ్చినట్లుగా తలూపింది.





"మనమే ఓ సినిమా తీద్దాం"

"మళ్లీ మొదటికొస్తున్నాం"

"పెట్టుబడి గురించేనా?"

"అవును..."

"నేను పెడతాను'' అంది దుర్గ.

"నువ్వా?" ఆశ్చర్యంగా అన్నాడు.

"నా దగ్గర కోట్లు మూలగటంలేదు. నేను సంపాదించిన డబ్బు ఈ సినిమామీద పెడతాను''

"అదే ఎంతని... అంత డబ్బు నీ దగ్గరుందా అని''

"మన సినిమాకు అవసరం అయినంతవరకు నేను పెట్టుబడి పెడతాను. అయితే ఈలోగా మనం చేయవలసిన కార్యక్రమం చాలా ఉంది. మనం తీసిన సినిమా పూర్తవుతుంది. అందులో ఎలాంటి సందేహం లేదు. ఆ లోగానే మనం చేయాలనుకుంటున్న కార్యక్రమం ఓ రూపంలోకి రావాలి''

"అంటే''

"అంటే మనలాంటివాళ్ళని మనం కలుపుకొని రావాలి. ఓ సంస్థగా ఏర్పడాలి. నిధులు సమకూర్చుకోవాలి. ముమ్మందు ఇంకో సినిమాను తయారుచేయగల పరిస్థితి ఉండాలి'' అంది.

రాఘవ తలూపాడు.

"ఆ కార్యక్రమం మనం నెత్తిన వేసుకోలేం. ఎందుకంటే పూర్తిగా మనం చిత్రనిర్మాణంలో మునిగిపోతాం. ఆ కార్యక్రమాన్ని వేరేవాళ్లు తీసుకుంటే బాగుంటుంది''

"ఆలోచిద్దాం" అన్నాడు రాఘవ.

"ఆలోచించటం కాదు. మీకు పరిచయం ఉన్నవారిని, అభిరుచి ఉన్నవారిని ఇందులో ఇన్వాల్వ్ చేయాలి. అప్పుడు మాత్రమే ఇదంతా సాధ్యం అవుతుంది. అయినా మనం చొరవ చేయాలేగాని... ఈ పరిస్థితులన్నింటికీ బాధపడుతున్నవారు చాలామంది ఉన్నారు. అలాంటివారిని మనం కలుపుకోగలిగితే తప్పకుండా సహాయం అందిస్తారు'' అంది.

"తప్పకుండా... ఇకనుండి నేను ఈ పని మీదే ఉంటాను''

దుర్గ తలూపింది.

"ఎలాంటి సబ్జెక్ట్ తయారుచేసుకుంటే బాగుంటుంది'' అన్నాడు రాఘవ.

"ఈ విషయంలో పెద్ద భ్రమలు పెట్టుకోవద్దు. సినిమా ద్వారానే మనం అంతా సాధించేస్తాం అనే ఆలోచనలో ఉంటే మనం ముందుకు పోలేం. మన ఉద్దేశం సినిమారంగానికి చెందిన గ్లామర్ తెరలు తొలగించటం. అదో పెద్ద కర్తవ్యం. ఇదేమంత త్వరగా జరిగేది కాదు. అలా జరగాలనుకుంటే ఇప్పుడున్నదంతా మాయం అయిపోవాలని మనం అనుకోవటంలేదు. ఈ హీరోలూ, హీరోయిన్లూ, ఈ రంగుల ప్రపంచం గొడవలు. అలాగే ఉండనీయండి. వాటితో మనకు అవసరంలేదు. మీకు ఈసారి అసలు ఓ గిరిగీయను అన్నారు. నేను అలా అనుకోవటంలేదు. మనం గిరి గీసుకుందాం" అంది.

"చెప్పు''

"ముందు మన టార్గెట్ చాలా చిన్నది. ఇప్పుడొస్తున్న చిత్రాలకు భిన్నం అయిన సినిమా మనం ప్రొడ్యూస్ చేస్తాం. అంతవరకు... అంటే కథలోగాని, చిత్రీకరణలోగాని పూర్తిగా కొత్త పద్ధతులు అవసరంలా. అంతకంటే ముందు మీరు క్లాసిక్స్ చూశారుగా. మనం అలాంటివి కూడా ఇప్పుడు తీయబోవటంలేదు. మనకిప్పుడు జనం కావాలి. జనం కావాలంటే మనం జనానికి అర్థం కావాలి. మనం చెబుతున్నది వారు అంగీకరించకపోయినా అసలు ఇదేమిటి అని ప్రశ్నించుకోవాలి చాలు... మన మొదటి టార్గెట్ అది''

"బాగానే ఉంది'' అన్నాడు రాఘవ.

"చాలామంది రెండురకాల పొరపాట్లు చేశారు. మొదటిది అసలు పట్టించుకోకపోవటం. నా విషయంలో అది ఏమాత్రం సరయింది కాదు. రెండోరకం పెద్ద టార్గెట్ పెట్టుకోవడం.



మనం పునాదిలోనే పొరపాటు చేస్తే ఆ ప్రభావం కొన్ని సంవత్సరాలపాటు పడుతుంది. తిరిగి ప్రారంభం కావాలంటే ఓ మహా పోరాటం చేయాల్సిఉంటుంది''

"నిజమే... అయితే నేనొకటి చేయాలనుకుంటున్నాను దుర్గా''

"చెప్పండి మాస్టారూ'' అంది.

"ఇక్కడనుండి వెళ్తాను. ముందు ఓ సంవత్సరంపాటు లీవ్ పెడతా. మొదట మూడు నెలల కార్యక్రమం అంతా ఓరకంగా ఉంటుంది. అభిరుచిగల పెద్దలందరినీ కలుసుకుంటా. వారితో చర్చిస్తా. మనకు వాళ్లు ఏవిధంగా ఉపయోగపడతారో తేల్చుకుందాం. తప్పకుండా ఉపయోగపడతారు. ఆ తర్వాత రెండునెలలపాటు స్క్రిప్ట్ కార్యక్రమం మీద కూర్చుందాం. సంతృప్తిగా వచ్చేంతవరకూ ఆ పనిచేయటం ఆ తర్వాత కార్యక్రమం ఇంకో టుంది. నేను కనీసం ఓ మూడు నెలలపాటు ఓ దర్శకుడి దగ్గర వర్క్ చేయాలనుకుంటున్నాను. అప్పుడు ప్రారంభిద్దాం మనం. ఈ విషయంలో నీ అభిప్రాయం చెప్పు''

"బాగుంది... అలానే చేయండి. మనం ఏ విషయంలోనూ త్వరపడాల్సిన అవసరంలేదు. మెల్లగానే చేద్దాం. ఒకటికి రెండుసార్లు ఆలోచించాకే చేద్దాం. మామూలుగా అయితే మనం చేస్తున్నాం. అంటే చేయమని అనేవారు చాలామంది ఉంటారు. అయితే ఇది ఏమేరకు సక్సెస్ అవుతుందా అనే అనుమానం వారికుంటుంది. ఇంకొంతమందయితే చాలా అట్టహాసంగా ప్రారంభించి వదిలేస్తారు. అనేక విషయాల్లో ఇలాంటివి చూసివుంటారు కాబట్టి మనం ఏదో చేయగలం అనేదాన్ని నమ్మరు. అంతకుమించి మనకు చాలా నిరాశనే కలగచేస్తారు. అయినా కూడా మనం నిరుత్సాహపడొద్దు. ఎందుకంటే ఎవరు అంగీకరించినా అంగీకరించకపోయినా ముందు మనం ఒక సినిమావరకు తయారుచేయగలంగదా'' అంది.

"అదిసరే ఇదంతా మనం ఊహించినట్లు జరగకపోతే''

"జరుగుతుందని ఎవరన్నారు?" అంది దుర్గ.

రాఘవకు అర్థం కానట్లు చూశాడు.

"మనం ఇలా జరగాలనుకుంటున్నాం మాస్టారూ... కొంతవరకి మాత్రమే మన చేతుల్లో ఉంది పరిస్థితి. ఆ తర్వాత మనం చేయగలిగిందేం ఉండకపోవచ్చు. మొత్తం మనం తలపెట్టిందంతా కొలాప్స్ కావచ్చు. అయితే అవనీయండి. మనం ఓ ప్రయత్నం చేశాం. ఆ తృప్తి ఉంటుందికదా''

"కానీ..."

"ఏమిటో చెప్పండి''

"నువ్వు సంపాదించుకున్న డబ్బంతా''

"ఏమవుతుంది. పోతుంది అంతేకదా. ఆ తర్వాత నాకు సినిమా ఛాన్స్‌లు ఉండవు. అంతేగా. ఇప్పుడున్న కార్లూ, ఫోన్లూ ఉండవు. అంతేగా. ఇవన్నీ లేకపోతే మాత్రమేంటి మాస్టారూ... బతకలేనా?

"బతకలేవని కాదు''

"గౌరవంగా బతకలేననా?"

"అలా కూడా కాదు''

"ఏం ఫర్వాలేదు. తిరిగి నేను నా పాతజీవితానికి మారటానికయినా తయారుగా ఉన్నాను. మనిషికి ఆకలి తీరితే చాలుగా. చాలా ఫ్రాంక్‌గా చెప్పాలంటే నేను మద్రాసు వచ్చింది నటించటంకోసం. కానీ నటించటానికంటే ముందు జరిగింది వ్యభిచారం. నా దగ్గరున్న డబ్బంతా నా శరీరం అమ్ముకుంటే వచ్చిందే. కెమేరాముందు అమ్మింది కొంతయితే కెమేరా వెనక అమ్మింది ఇంకొంత"

రాఘవకి దుర్గ ముఖంలోకి చూడాలనిపించలేదు.

అంత ధైర్యం చేయలేకపోయాడు.

"ఇదంతా నా పొట్టకోసమేనా నేను సంపాదించింది. నేను అంతటి ఆకలితో లేను.




అందుకే ఇదంతా నాకు తృప్తి కలిగించదు. ఈ సుఖాలేవీ నన్ను అశాంతినుండి బయటపడవేయవు. అయినా ఎందుకిలా జరిగిందంటే అదంతే. జరిగిపోయింది. నా ప్రమేయం లేకుండా జరిగింది. నాకు తెలిసీ జరిగింది. ఒకప్పుడు అయితే ఆ డబ్బును చూస్తుంటే నాకు ఇంకా భయం పట్టుకుంది. ఇది లేకపోవటంవల్లనే కదా నేను ఇలా కావలసివచ్చిందని. అందుకే ఇంకా ఇంకా సంపాదించాలనుకున్నా. ఆనాటి ఆవేశం అది. సంపాదించా. నీతి లేదు. విలువలు లేవు. డబ్బు సంపాదన మాత్రమే నాకు మిగిలిన ధ్యేయం.

అయిపోయింది. డబ్బు వచ్చింది. అయిపోయిందా. అప్పుడు తిరిగి మేల్కొన్నా. దేనికోసం ఇదంతా. నాకు అర్థంకాలా... ఎవరిదిదంతా. నాకు తెలుసు. జీవితంకోసం నేను పోరాడుతున్నప్పుడు నా దగ్గర డబ్బులేదు. తిండికోసం అల్లాడిపోతున్నప్పుడు నా దగ్గరకు ఇది రాలేదు. ఆరోజు గంటలకు గంటలు శ్రమచేస్తూ అనుకునేదాన్ని.

ఈ డబ్బంతా ఏమైపోతూంది. ఎక్కడికి వెళ్లిపోతూంది అని. నాకప్పుడు తెలియదు. ఇదిగో ఇప్పుడు తెలుసు. నా దగ్గరే కొన్ని లక్షలు ఉంది. మరి ఈ దేశంలో డబ్బంతా ఎందరెందరి దగ్గర ఎలా పేరుకుపోయిందో నాకు తెలుసు. అలా పేరుకుపోవటమే ఈ సమస్యలన్నింటికి కారణం. ఇప్పుడా డబ్బువలన ప్రయోజనంలేదు. అందుకే దాన్ని బయటకు తీస్తాను. అది మంచిపనికి ఉపయోగపడటాన్ని మించి ఏంకావాలి. మంచిపనికోసమే అంతా పోయిందనుకోండి. పోనీండి. అందువల్ల నాకు తృప్తి లభిస్తుందిగా''

రాఘవ అప్పుడు చూడగలిగాడు దుర్గని.

"తృ...ప్తా..." అస్పష్టంగా వినిపించాయా మాటలు.

"అవును మాస్టారూ... తృప్తే. మనిషి వెతుకులాట అంతా తృప్తి కోసమే. ఇంత డబ్బుంది కదా నాకు తృప్తి ఉందా?"

"లేదు''

"అందుకే అంటున్నా. నాకా తృప్తి చాలు. మా అమ్మనుండి నేను నేర్చుకుంది అది. తృప్తికోసం బతుకుతాను. దానికోసమే ఎన్ని కష్టాలనయినా ఆహ్వానిస్తాను. దానికోసమే మరణిస్తాను''

"దుర్గా..." అన్నాడు రాఘవ.

"అవును మాస్టారూ నాకీ జీవితం జీవించాలనిపించటంలేదు''

చాలా సేపు మౌనం.

"అలా అని చచ్చిపోవాలనుకునేంత పిరికిదాన్ని కాదు మాస్టారు. ఈ కుబుసం విడిచేస్తా. ఓ కొత్త సరికొత్త పాత్రకోసం నేను చూస్తున్నా. సినిమాల్లోనే కాదు, జీవితంలో కూడా. బహుశా మన సినిమా మొదలయితే ఇంక నేను నటించే సెక్స్ పాత్రలు మానేస్తాను. ఆ నిర్ణయం ఆరోజునుండే అమలులోకి వస్తుంది.

రాఘవ దుర్గనే చూస్తున్నాడు.

"అలా అంటున్నానంటే మనం తీయబోయే సినిమాలో నేనే నటించాలని కాదు సుమా. మీ పాత్రకు ఎవరు సరిపోతారనుకుంటారో ఆ నటి. అయితే పెద్ద తారల్ని మనం భరించలేం కాబట్టి కొత్త అమ్మాయి కోసం వెతుకుదాం" అంది.

రాఘవ మాట్లాడలేదు.

'నేను రేపు వెళ్తాను'' అన్నాడు చాలా సేపటి తర్వాత.



దుర్గా-

నీ దగ్గరకొచ్చిన ప్రతిసారీ ఓ నూతన

అనుభవం కలుగుతోంది. నువ్వు మాట్లాడి నంత హాయిగానూ, సూటిగానూ నేను కూడా మాట్లాడాలనుకుంటున్నా. అయితే అది నాకు సాధ్యం కావటంలా. నేను మాట్లాడటం కంటే కూడా రాయటంలోనే ఎక్కువ శక్తివంతంగా నా అభిప్రాయాలు చెప్పగలనేమో అనుకుంటు న్నా.

నేను రాగానే మొదట చేసినపని ఏమి టంటే సంవత్సరంపాటు సెలవు పెట్టడం. అందరూ ఆశ్చర్యపోయారు. ఎందుకంటే ఈ ఉద్యోగం రావటానికి నేను పడిన ఇబ్బందులు నాతోపాటు వారికీ తెలుసు. అలాటి అవసరం అది. ఈనాడూ అవసరమే. దానికిమించిన గమ్యం ఒకటి దొరికిందికదా.

ఇప్పుడింక నేను చేయదలుచుకున్న పనుల న్నీ ఓ క్రమంలో చేస్తూపోతా.

సరోజతో నీ భావాలన్నీ చెప్పా.

నాకు సంతోషం కలిగించిన విషయం ఏమిటో తెలుసా. తనూ ఇంతకుముందు అదే మాట అంది.



"మీకు తృప్తికలగాలేగానీ మేం ఎన్ని కష్టా లనయినా భరించగలం" అంటూ. నువ్వూ అంతే.

అంతకంటే గొప్ప విషయం ఏమిటంటే మన సినిమాకు ఇంకెవరినైనా ఎన్నుకోమ నటం-

నేను అలా అనుకోవటంలేదు. ఎందుకంటే ఈ పరిస్థితుల్లో అంత సాహసం చేయటం మంచిదికాదు. పూర్తిగా కొత్త అమ్మాయిని పరిచయం చేయలేం. ముందు ఆమెకు నటన నేర్పాలి. అదంత సులభం కాదు.

నీకు తెలుసు పరిశ్రమకి కొత్తగా వచ్చే వారినుండి ఏం పిండుకుంటారో... మన టార్గెట్ అది కాదు. ఆ అమ్మాయి అందచందా లకంటే నటన ముఖ్యం. అందుకే నా దృష్టిలో నువ్వు ఉన్నావ్. నువ్వు ఇప్పటికే పదిమందికి తెలిసిన నటివి. అయితే ఇది సాహసమే. అక్కడి భాష ప్రకారం.

ఎందుకంటే నువ్వు మన సినిమాలో విభిన్న పాత్రను పోషిస్తావ్.

నీకు అలాంటి పాత్రను సృష్టిస్తాను. నా మనసులో ఇప్పటికే ఆ పాత్ర తాలూకు రూపం అస్పష్టంగా రూపుదిద్దుకుంటోంది.

ఆ పాత్రను నువ్వు మాత్రమే పోషించాలి.

అంటే నీకంటే గొప్ప తారలు లేరనికాదు నా ఉద్దేశం. ఆ పాత్రకు చెందిన ఘర్షణను నువ్వయితేనే బాగా ఎక్స్‌ప్రెస్ చేయగలవని నాకు అనిపించింది. అందుకే రాస్తున్నా.

దుర్గా... ఆ పాత్ర నీది.

అంతేకాదు... ఇదో ప్రేమకథ.

ఎవరికైనా మనం ఈ విషయం చెబితే ఏమంటారో నాకు తెలియదు. కానీ మన మొదటి సినిమా ప్రేమకథ మాత్రమే కావాల నేది నా ఆరాటం. ఈ విషయం గురించి నీ అభిప్రాయం రాయి. ఇక నేను ఇప్పట్లో మద్రాసు రాలేను. నేను దేశమంతా తిరుగుతానని నీకు చెప్పానుకదా. ఆ పనిమీదే ఉంటాను. ఎప్పటికప్పుడు నా చిరునామా ఇస్తాను. నువ్వు ఉత్తరాలు రాస్తుండు. అంతేకాదు మన ఉత్తరాలన్నీ దాచిఉంచు. నీ ఉత్తరాలు నేను దాస్తున్నా. అవన్నీ రేపు నాకు మన స్క్రిప్ట్ రూపొందించటానికి ఉపయోగపడతాయి. అంతేకాదు నీ లేఖలు నాకు మంచి సంభాషణలు రాయటానికి కూడా సహకరిస్తాయి అనుకుంటున్నా''

మరలా రాస్తాను.

రాఘవ.

ఆ ఉత్తరం పోస్ట్‌చేసి సరాసరి ప్రేమగారింటికి వెళ్ళాడు.

"ఎవరికో ఉత్తరం రాస్తున్నట్లున్నారు''

"చంద్రానికి. తను రాశాడు. ఇంతవరకూ రాయలా. తర్వాత తిడతాడు''

"వెంటనే రాయవచ్చుగా''

"బద్ధకం బాబూ'' అంది ప్రేమ.

"అయితే ఒకదాన్ని వదిలించుకోవాలి. నేను సంవత్సరంపాటు సెలవుపెట్టా''

"పెట్టేశావా?"

"అవును... ఇంక తర్వాతి కార్యక్రమం ప్రారంభం మీతోనే''

"నన్నేం చేయమంటావో చెప్పు''

"ముందు మనకున్న మిత్రుల్లో అభిరుచిగలవారెవరో ఓ లిస్ట్ తయారుచేయాలి. రెండవదేమిటంటే వాళ్ళ చిరునామాలు నాకివ్వాలి. మూడవది మీరు కూడా కొంతమందిని కలుసుకొని ఈ విషయం గురించి మాట్లాడాలి. ముఖ్యంగా మీ మహిళాసంఘం తరపున మీరు చేయాల్సిన కార్యక్రమం చాలా ఉంది. అంతకుమించి బాలకృష్ణగారు చేయాల్సిన పని ఇంకా ఉంది. ముందు నేను చంద్రంగారిని కలవాలనుకుంటున్నా''

"ఎప్పుడు బయలుదేరుతావ్?"

"రేపే..." అన్నాడు రాఘవ.

"అయితే ఈ ఉత్తరం తర్వాత రాస్తాను'' అని పక్కన పెట్టింది.

"దుర్గ మొదటి సినిమావరకు పెట్టుబడి పెడతానంది. అయితే అవి మనం ఎంత తక్కువ ఖర్చులో తీయగలమా అనేది వేరే నిర్ణయించుకుందాం. ముందుగా కనీసం ఓ అయిదారుగురం ఓ కమిటీగా ఏర్పడుదాం. ప్రధాన నిర్ణయాలు చేయటంలో మనందరం





పాత్ర వహిస్తాం"

"మరీ ఎక్కువమందిని పెట్టకు. కబుర్లు చెప్పుకోవటం అవుతుంది''

"అందుకే నేనయితే నలుగుర్ని అను కుంటున్నా''

"ఎవరెవరు?"

"మొదట మీరు''

"నేనా?"

"నన్ను చెప్పనీయండి. మీరూ, దుర్గ, నేనూ, చంద్రంగారు మన నలుగురం ఏదైనా చేయాలనుకున్నప్పుడు కలిసి చర్చించాలి.

"అంతా మనమే అయిపోయాంకదా'' అంది.

"మొదటి ప్రాజెక్ట్‌వరకూ అంతే. అయితే ఇంకో ప్రత్యేక ఆహ్వానితుడు కూడా ఉన్నాడు. ఆయన బాలకృష్ణ.

ప్రేమ నవ్వింది.

"నేననుకుంటున్నది ఏమిటంటే ఈ దశలో మనం అయితే కొంత హాయిగా ఉంటుంది. ఫ్రీగా చర్చించుకోవచ్చు. దీని కాన్వాస్ పెరిగి తే కొత్త పరిచయాలవుతాయి. అప్పుడెటూ మనం విస్తృతం కాకతప్పదు''

"అయితే ముందు మనం చేయాల్సిందే మిటో చెప్పు''

"ఈ దశలో మనం డబ్బులకోసం ఎవరి దగ్గరకూ వెళ్లొద్దు. మనం ఏదీ ప్రారంభించ కుండానే అలా చేయటం వలన చాలా డామేజ్ జరిగే ప్రమాదం ఉంది. అందుకని ముందుగా సాధ్యమైనంత ఎక్కువ మందిని కలుసు కుందాం. ఇలా చేయాలని ఉంది, అని చెబు దాం. మీ అభిప్రాయం చెప్పమందాం. అయి నా వాళ్లు నిరుత్సాహపరుస్తారు. మొత్తంగా మనకు ఏ రకమైన అభిప్రాయాలు వస్తున్నా యీ అనేది మనం పరిశీలించుకుందాం. ఆ తర్వాత మనం ఎటూ మన మొదటి ప్రయ త్నం పూర్తి చేస్తాం. అప్పుడు మనం ఏమైతే చెప్పామో అదే చేశామనేది ఋజువవుతుంది. అప్పుడు తప్పకుండా ముందుకు వస్తారు''

"బాగానే ఉంది''

"మరి మీరు ఎప్పుడు బయలుదేరుతా రు?"

"వెంటనే నాకూ ఏ కార్యక్రమం లేకపోవ టంతో బోర్‌గా ఉంది. నా ఫ్రెండ్స్ ఉన్నారు. ముందు వాళ్లని చూసినట్లుంటుంది. ఓరోజు వారితో గడిపినట్లుంటుంది. అంతేకాదు వారి పరిచయాలనుకూడా మనం వినియోగించు కుందాం"

"అంతేకాదు... ఇంకో పనికూడా చేయాలి మనం"

"ఏమిటో చెప్పు''

మనం ఈ దశలో మాస్‌ని ఎట్రాక్ట్ చేయబో వటం లేదు. అక్కడక్కడా చెల్లాచెదురుగా పడున్న అభిరుచిగల వారందరూ ముందు తలెత్తాలి. మనకోసం చూడాలి. అంతవరకు సాధిస్తేచాలు. వాళ్లనోట్లో పడితే అంతకు మించిన ప్రచారం అవసరంలేదు''

"అవును'' అంది ప్రేమ నవ్వుతూ.

"ఇంకో విషయం కూడా ఉంది''

"చెప్పు''

"బాలకృష్ణగారిని ఈ విషయంలో మనం బాగా ఉపయోగించుకోవాలి. అసలు దీనికి ప్రారంభమే ఆయన గదికదా!"

"కానీ ఆయన్ని నమ్ముకుంటే''

"మీరు ఊ అనండి చాలు... ఆ తర్వాత నేను చూసుకుంటాగా''

"భలేవాడివే. నేను కాదన్నానా? ఆయని ష్టం"

"అంతేకదా''

ప్రేమకు అనుమానం వచ్చింది.

"నువ్వు ఏ విషయం గురించి మాట్లాడుతు న్నావ్?"

"మాస్టారికి కాఫీ తాగటానికి అనుమతి ఇవ్వటం గురించి''

"అంటే ఇప్పుడు ఆయన మానేశాడా?"

"ఆయన మాటమీద నిలబడే మనిషటక దా!"

"ఇంకానయం.. ఆయన నన్ను వదులు కుంటాడుగానీ కాఫీని కాదు''

రాఘవ నవ్వాడు పడిపడి.

"నిజంగా నమ్మేశాను''

"అదేకదా ఆయన స్పెషాలిటీ"

"అందుకే ఆయన్ని ఉపయోగించుకోవాలి. మనమేదో గొప్పది సృష్టించబోతున్నామని ఆయన సర్కిల్స్‌లో నమ్మించేస్తాడు''

"అది నిజమే'' అంది ప్రేమ.

"మరి నేను బయలుదేరతాను''

"చంద్రం అడ్రస్ ఇస్తానుండు'' అంది ప్రేమ



మాస్టారూ-

మీ ఉత్తరం అందుకున్నాను,
మీరు ఇంతత్వరగా కదిలినందుకు సంతోషంగా ఉంది. మనం ఒకానొక ఆవేశంలో ఉన్నప్పుడు ఏరకంగానైనా మాట్లాడవచ్చు. అయితే అవి ఆచరణలోకి రావటం అంత సులభంకాదు. ఈ విషయం నాకుతెలుసు. అందుకే నేను మిమ్మల్ని బలవంతం చేయటం లేదుకదా అనుకున్నాను.

ఇప్పుడు మీ ఉత్తరం అందుకున్నాక నాకా సంశయం పోయింది. తర్వాత నా ఉత్తరాలు దాచుకుంటున్నా నన్నారు. నాకు అంత అదృష్టమా! తర్వాత మనమొదటి సినిమా ప్రేమ మీద అంటున్నారు. ఈ విషయం గురించి ఆలోచించండి. ప్రేమ గురించి సినిమా తీయ వద్దని నేను అనటం లేదు. ఆ మాటకొస్తే ఈనాటి మన సినిమాలు దాదాపు అన్నీ ప్రేమ పేరుతోనే తీయబడుతున్నాయి.

అది ప్రేమా, మరొకటా అనేది అలా ఉంచండి. అందులోనూ ప్రధాన పాత్ర నన్ను పోషించమంటున్నారు.

'ప్రేమ'లాంటి విషయాలు మనం డీల్ చేయాలనుకున్నప్పుడు ఫ్రెష్‌నెస్ అవసర మేమో ఆలోచించండి.

తిరిగి మనం కొన్ని సూత్రాలు ఏర్పరుచు కుంటున్నట్లుగా అనిపిస్తుంది. అయితే సూత్రాలను మనం వ్యతిరేకించం. సూత్రాల పేరుతో ఉండే మొరటుదనాన్నే మనం వ్యతిరేకించేది.

ఏదిఏమైనా మీరో కార్యక్రమం తీసుకున్నారు. అది విజయవంతం అవుతుంది. కావాలి. అందుకు మనం శ్రమించుదాం.

తర్వాత కొంతకాలం మీరు పనిచేస్తానంటున్నారు. మంచిదే. ముందు మనకు కొన్ని విషయాల మీద కమాండింగ్ పవర్ ఉండాలి. అందుకే తప్పకుండా అలాంటి ఏర్పాట్లు చూద్దాం.

ఈ లేఖతోపాటు డిమాండ్ డ్రాఫ్ట్ జత చేస్తున్నాను. రెండువేల రూపాయలకి. మీరు దేశమంతా తిరుగుతానంటున్నారు. దానికి డబ్బు అవసరం అవుతుంది.

మాస్టారూ మనం అనవసర ఖర్చులు పెట్టకూడదని మాత్రమే అనుకున్నాం. అవసరమైన చోట ఖర్చులు పెట్టకూడదనికాదు. అందుకని మనం ఈ కార్యక్రమం కోసం ఖర్చు చేస్తున్న ప్రతి నయాపైసా గురించి కూడా రాయండి. దానివల్ల మనం మొత్తం ఎంత ఖర్చుపెట్టామో తెలుస్తుంది.

అంతేకాదు మన ఈ కార్యక్రమం ఓ




రూపం తీసుకునేంతవరకూ మాత్రమే నేను బాగా కష్టపడతాను. ఆ తర్వాత ఈ రకం పాత్రలకు స్వస్తి చెబుతాను. సరోజగారిని అడిగినట్లు చెప్పండి. అలాగే ప్రేమగారిని కూడా.

ఇంతకుమించి రాయటానికి ఏంలేదు.

మీ దుర్గ

రాఘవ చంద్రం దగ్గరకు వెళ్లటానికి రెండు రోజుల ఆలస్యం అయింది. అందుకు కారణం తను అడిగినచోట డబ్బులు అందకపోవటమే. ఈలోగా ఈ ఉత్తరం చాలా సంతోషం కలిగింది ఆ అమ్మాయి ముందు చూపుకి.

ముందే అడుగుదామనుకున్నాడు. ఇంతలో సంశయం పీడించింది. అలా అడిగితే బాగుంటుందా అని.

బహుశా దుర్గ అర్థం చేసుకునే ఉంటుంది. ఏదిఏమైనా ఓ ప్రధాన సమస్య తీరిపోయింది.

చంద్రం దగ్గరకు వెళ్లాడు.

ఆయన ముందు ఆశ్చర్యపోయాడు.

"ఏమిటండోయ్ ఉరుములేని పిడుగులా వచ్చారు'' అన్నాడు నవ్వుతూ.

"మీతో చాలా పనుండి వచ్చాను'' అన్నాడు నవ్వుతూ.

ఆ తర్వాత తను వచ్చిన కార్యక్రమం గురించి చెప్పాడు.

"అదే విషయం మనం ఈ కార్యక్రమాన్ని ముందుకు తీసుకుపోవాలి. దానికి మీ సహకారం చాలా అవసరం అని మేం అనుకుంటున్నాం"

"తప్పకుండా''

"కొత్త సినిమాకు చెందిన స్క్రిప్ట్ నేను తయారు చేస్తున్నా. మనం దానిమీద చర్చ చేయాలి''

"దాందేముంది అలానే చేద్దాం"

"ఈ సినిమాలో ఎక్కువ పాటలుండవు. అయితే మొత్తం మీద పాటలుంటాయి. ఒక్క పాట మాత్రం మినహాయించి మిగతావన్నీ మీరే రాయాల్సి ఉంటుంది''

"అలాగే''

"నేనోమాట అడుగుతా చెబుతారా?"

"అడగండి''

"ఈ కార్యక్రమం గురించి మీ అభిప్రాయం ఏమిటి?"

"మంచి కార్యక్రమమే''

"ఇది విజయవంతం అవుతుందనుకుంటున్నారా?"

ఆయన కొంచెంసేపు మాట్లాడలేదు.

"చూద్దాం... ఓ ప్రయత్నం చేస్తున్నాం. అందులోనూ పూర్తికాలం ఈ పని చేయటానికి ముందుకొచ్చారు. ఇంక విజయవంతం కాకపోవటం అనే సమస్యలేదు. ముందు మనకు కావలసిన నెట్‌వర్క్‌ని మనం రూపొందించుకోవటం చాలాఅసవరం"

"నాకింకో ఆలోచన ఉంది''

మనం ఈ అవకాశాన్ని బాగా వినియోగించుకోవాలి. అందుకే రెండురకాల యూనిట్స్ నిర్మాణం జరగాలి. మొదటిది క్రియేషన్ సైడ్. రెండవది డిస్ట్రిబ్యూషన్ సైడ్'

"అవును''

"అది సరే, ఫిలిం సొసైటీలు ఎలా ఉన్నాయి?"

"అవి నగరాలకే పరిమితం అయిపోయాయి. అవి కూడా అన్ని చోట్లా సరిగ్గా నడుస్తున్నట్లుగాలేవు. అయితే ఇది ఓ పాయింట్ దాటగలిగితేమనం చాలామందిని ఆకర్షించగలమని నాకు అనిపిస్తోంది''

"అవసరమైతే మీరు ఈ ఉద్యోగం విడిచి రాగలరా?"

ఆయన కొద్దిసేపటి తర్వాత చెప్పాడు

"ఆలోచిద్దాం"

"మంచిది... ఆమాత్రం నమ్మకం చాలు. నేను మీకు ఉత్తరాలు రాస్తుంటాను. ఈ విషయం మీద మీ అభిప్రాయాలు రాయండి. అవసరమైతే మిమ్మల్ని మేం పిలుస్తాం.



అప్పుడువద్దురుగాని. మొత్తం మీద ఓ పెద్ద ఆర్భాటంతోనే మనం ఆరంభం అవుతాం"

"ఆరంభం మన జన్మహక్కు'' అన్నాడాయన. ఇద్దరూ నవ్వుకున్నారు.

"నేను ఈ విషయం మీద కాన్సన్‌ట్రేట్ చేస్తా. వాళ్లు ఏం ఫీల్ అవుతున్నారా అనేది రాస్తుంటా. ఐ విష్‌యూ ఎవ్విరి సక్సెస్'' ఆప్యాయంగా కరచాలనం చేశాడు.

రాఘవ తృప్తిగా వెనక్కి తిరిగాడు.

★ ★ ★

దుర్గా,

నువ్వు పంపిన డబ్బులు అందాయి. నిజానికి నేను ముందే అడగాల్సింది. మనం మామూలు మనుషులం కూడా. మన నడుమ ఎంత అవగాహన ఉన్నా ఒక్కోసారి ఏమనుకుంటారో అనే ఆలోచనకు కూడ గురవుతుంటాం.

నాకో మిత్రుడు తగిలాడు. అతను జర్నలిస్ట్ కూడా. అతనికీ నడుమ కొంత తీరిక లభించి పిల్లల పుస్తకాలు చదివాడుట. అతను ఏమంటున్నాడంటే...

"నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. మనకాలంనాటి పేదరాసి పెద్దమ్మ ఇలా లేదు. సొంతం బాల సాహిత్యంనుండి అదృశ్యం అయిపోయిందనుకుంటున్నా'' అన్నాడు.

తను త్వరలో ఏదో బాంబు పేల్చే హడావుడిలో ఉన్నాడనిపించింది.

నేను మన ప్రయత్నం గురించి అతనికి వివరించాను.

నా మతిపోయేవాదన చేశాడు. అతని ప్రకారం, 'సినిమాగానీ టీవీగానీ ఈ మీడియమ్ పట్ల నాకు నమ్మకం లేదు. బేసికల్‌గానే అవి జనానికి వ్యతిరేకమైనవి' అన్నాడు.

**సినిమాకంటే రచన మాత్రమే పాఠకుడి** మీద ఎక్కువగా ప్రభావితం చేస్తుంది అని అంటాడతను.

ఆ మాట కొస్తే సినిమా అనేది రచనని కూడా తనలో ఇముడ్చుకున్న కళా రూపం. ఆ విషయం అతనూ అంగీకరించాడు. అంతేకాదు కోట్లాదిమందికి అందుబాటులో ఉన్న ఏకైక సాధనం అదేనని కూడా అతను అంటున్నాడు. తను చాలా లోతుగా ఆలోచించాకే ఈ నిర్ణయానికి రాగలిగాను అని అతను గట్టిగా చెబుతున్నాడు.

"సినిమా మనిషిని ఆలోచించనివ్వదు'' అంటాడు.

"ఎందువల్ల'' అన్నాను.

"అదే దృశ్యం యొక్క గొప్పతనం" అని అతనన్నాడు.

అయినా సినిమా మనిషిని అంతస్తబ్ధతకు ఎలా గురి చేస్తుందా అనేది నాకు తెలీని సందేహం. ఒక్కో దృశ్యం చూస్తుంటే గుండెలనుండి దుఃఖం ఎగతన్నుకొస్తుంది. ఒక్క సంఘటన మనల్ని బాల్యంలోకి విసిరేస్తుంది. సినిమాలు చూసి మనం నవ్వుతాం. గంతులేస్తాం. ఆవేశం తెచ్చుకుంటాం. ఇదంతా ప్రభావమేకదా. మరి ఆ మిత్రుడికి ఇంకో రకమైన అనుభవం ఎందుకు కలిగిందనేది ప్రశ్న. దానికింకా జవాబు దొరకలా.

బేసికల్‌గా విజువల్ మీడియా మనిషిని బొమ్మలా చేస్తుంది. మనిషి కళ్లప్పగించి చూస్తాడు. మెదడుతో పనిలేదు అంటాడు. అదే పుస్తకం చదివితే మానసిక ప్రపంచం మరింత వికాసం పొందుతుంది. కొత్త ఇమేజస్ ఏర్పడుతాయి అని అతని వాదన.

ఆ మిత్రుడితో మాట్లాడాక నాకు మరింత విశ్వాసం పెరిగింది. తను ఏదో ఒక కోణం గురించి మాత్రమే ఆలోచించి ఉంటాడు. సినిమా అనేది అన్నింటినీ మేళవించుకున్న ఓ అపూర్వ కళారూపం. ఏకకాలంలో ఇన్ని కళల్ని తనలో ఇముడ్చుకో గలిగింది ఇంకేమైనా ఉందా?

రచన, సంగీతం, కళ, దృశ్యం, నాట్యం, గానం ఇలా అనేకానేక ప్రక్రియల్తో ఇంత గొప్పరూపం సాధించిన ఈ మీడియమ్ పట్ల




ఆ యువకుడు ఎందుకలాంటి అభిప్రాయానికి రాగలిగాడా అనే దిగులూ కలిగింది.

అంతదాకా ఎందుకు సాహిత్యంలోనే విభిన్న ప్రక్రియలున్నాయి. ఎవరికివారు ఇటీవల కాలంలో తాము కృషి చేస్తున్న రంగాన్ని మాత్రమే గొప్ప చేసి మాట్లాడటం అనేది నాకు కనిపిస్తూనే ఉంది. ఒక్కోసారి నేనే అలాంటి ప్రభావానికి లోనుకావటం జరుగుతుంది.

అదలా ఉంచు...

నాకు ఇంకోరకం అనుభవం కూడా వచ్చింది. అదేమిటంటే సినిమా మీడియమ్ పట్ల విశేషమైన అభిమానం, అవగాహన ఉన్న వాళ్లు చాలామంది ఉన్నారు.

వారినుండి అద్భుతవరాలు లభించాయి. అవేమిటో తెలుసా?

ప్రపంచంలోని అద్భుతమైన సినిమాలు, వీటిని చూస్తుంటే ఎంత ఆనందమో, ఎంత ఆశ్చర్యమో, మనం ఎంత వెనుకబడి ఉన్నాం. ఎంతగా ఊబుల్లో కూరుకుపోయాం అనే భావన కలిగింది. నిజం. ఇంతవరకూ నేను ఇంతమంచి సినిమాలు చూసి ఉండనేలేదు. నేను ఇవి చూస్తూ ఎంతటి ప్రలోభానికి లోనయ్యానంటే నేను సైతం అలాంటి సినిమాలు ఎందుకు తీయకూడదు అనిపించింది.

కొన్ని సినిమాలున్నాయి, చాలా అస్పష్టంగా ఉంటాయి. ఇందులో ఏదో ఉంది అని మాత్రం తెలుస్తుంటుంది. కానీ అర్థంకావు. అర్థం కావని వద్దందామా అంటే... ఆ ధైర్యం లేదు. ఉండనీ... అలాంటి చిత్రాలన్నీ ఫిలిమ్ ఆర్కైవ్స్‌లో భద్రపరిస్తే భవిష్యత్ తరాలకు అందుబాటులోకి వస్తాయేమో అనిపిస్తుంది.

మన తెలుగులోనే కొందరు దర్శకులంటారుకదా,

'మాకు విమర్శకుల్తో పనిలేదు. మేం తీయాలనుకుందేదో తీస్తాం' అని.

ఇంకోరకంవారి వాదన ఏమిటంటే, "సినిమారంగానికి చెందిన రకరకాల స్కూల్స్ ఉన్నాయి. నా స్కూల్ అది' అని.

దుర్గా మనం కూడా అలా కాకూడదు. కనీసం కొంతకాలం. అందుకే మాస్టర్ పీస్‌ల జోలికి మనం పోకుండానే ఉందాం. మనం అత్యంత సాధారణమైన సినిమాలు మాత్రమే తీద్దాం. మనం చెప్పదలుచుకున్నదేదో స్పష్టంగా చెబుదాం. మన తర్వాతి తరం వారు ఎదిగి వచ్చి మన కార్యక్రమం అందుకునేదాకా అలాంటి కళాఖండాల ప్రేక్షకులుగా మిగిలిపోదాం.

దీనికి చెంది నువ్వేమంటావో ఈసారి రాస్తావుగా.

తర్వాత నా ప్రయాణం గురించి రాయాలి.

నేను ఈ ప్రయాణంలో అనుభూతులు మాత్రమే పొందలా... ఇంకా చాలారకాల పాత్రలు లభించాయి. విషయాలు దొరికాయి. అన్నీ నోట్ చేసుకుంటున్నా ఒకప్పుడు ఏం రాయాలా అని అర్థంకాక గిలగిలలాడేవాణ్ణి. ఈ ప్రయాణాలు నన్ను ఎంతగా సంపద్వంతం చేశాయంటే నా సమస్య ఇప్పుడు, ఎప్పుడు వీటిని రాయగలుగుతానా... వీటిని అసలు పూర్తి చేయగలుగుతానా అని.

అన్ని రకాల వస్తువులు లభించాయి.

కథలూ, కవిత్వమూ, నవలలూ... అంతేకాదు మనం తీయబోయే రేపటి సినిమాలకు చెందిన స్కెచ్‌లు...

నిన్నటి లేఖలో నేను ప్రేమ గురించి రాశాను కదూ...

దుర్గా, ప్రేమకు ఫ్రెష్‌నెస్ కావాలంటున్నావ్ కదూ.

అసలు ప్రేమే ఫ్రెష్‌నెస్‌తో కూడుకున్నదనుకుంటాను నేను.

నేను ఊహిస్తున్న ప్రేమకథలో హీరోహీరోయిన్లు పాటలు పాడుకోరు. పరిగెత్తరు.. నేటి సినిమాని ప్రతిబింబించరు.

అయినా కూడా అది ప్రేమకథా చిత్రం అవుతుంది.

అదెలా ఉంటుందో తర్వాత చెబుతా.

ప్రేమకు ఫ్రెష్‌నెస్ అవసరం అని నువ్వు గట్టిగా వాదిస్తే...

నీకంటే తాజాదనం ఎక్కడినుండి రాగలదు.

ఏనాడైనా నిండుగా చీరకట్టనిచ్చారా నిన్ను. నీ కళ్లలోకి కెమేరా ఎప్పుడైనా దృష్టి నిలిపిందా? ఆ కళ్లలోని ఆర్తిని ఎవరైనా గమనించారా. నాకు రాజ్‌కపూర్ గుర్తుకు వస్తున్నాడు. లలితమైన అతని ప్రేమ దృశ్యాలు గుర్తుకు వస్తున్నాయి. అంతెందుకు మీ అమ్మ పాదాల చెంత పాడుతూ కళ్లు మూసుకున్న మీ నాన్న గుర్తొస్తున్నాడు. ఇప్పటివరకూ నీలో ఏ విలువయితే అద్భుతంగా ఉందో దాన్నే నేను వెలికి తీయాలని ఆరాటపడుతున్నా.

అసలు మనం మన అనుభవాల్నే ఎందుకు చిత్రించకూడదు?

మన జనం తమ కళ్లూ, చెవులూ మూసుకున్నారుగానీ.. వాటిని తెరిచి ఉంచితే ఇక్కడి ప్రతి అనుభవమూ ఓ దృశ్య కావ్యం కాదా?

మనం ఈ జనాన్ని ఏ రకంగా మలిస్తే ఆ రకంగా మారతారు. మైనం ఉంది. దాన్ని ఏ రూపంలోకి తేవాలా అనేదాన్ని మనం నిర్ణయిస్తాం. మైనం తనంతట తాను నిర్ణయించదు. ఇక్కడ కొంతవరకే జనాన్ని మైనంతో పోల్చుతున్నాననే విషయం గుర్తుంచుకో.

చాలా రాశానుకదూ...

ఇక వుంటాను. కింద చిరునామా రాస్తున్నాను.

రాఘవ

★ ★ ★

మాస్టారూ!

ముందు మీ మిత్రుడి ఆవిష్కరణ గురించి నా అభిప్రాయం రాస్తాను. మీరన్నట్లుగా ఆయనేదో పొరపాటు అభిప్రాయానికి వచ్చారు. అలా రావటంవెనుక ఆయనలో ఆవేదన ఉంది. అంతవరకు వాస్తవం.

అమెరికాలాంటి దేశాల్లో టీవీ బాగా చెరుపు చేస్తోంది. ఎక్కువ సమయాన్ని టీవీనే ఆక్రమిస్తోంది. మనకింకా ఆ పోటీ పూర్తిగా రాలేదు. అయితే అదంతా రేపటి డేంజర్. ఇంకోరకంగా చెప్పాలంటే ముందు ముందు మనం సినిమాలను కాక టీవీకోసం చిత్రాల్ని నిర్మించాల్సి రావచ్చు.

నాకు తెలిసినంతవరకు సినిమాగానీ, టీవీగానీ రెండురకాల ప్రభావాల్ని కలగచేస్తుంది. మొదటిది చెడుప్రభావం, రెండవది మంచి ప్రభావం. అంతేగాని స్తబ్దతని కలిగిస్తుంది అనేది నేను అంగీకరించలేను.

కొంతమందున్నారు. వారు ప్రతిరోజూ సినిమా చూస్తారు. కొంతమంది రోజూ మందు తాగినట్లుగా వారు సినిమా చూస్తారు. అది ఆనందించే స్థానంనుండి వ్యసనానికి మారింది. ఏదో ఒకటి వారు చూడాలి. వాళ్ళలా చూస్తుంటారు. అంతే. పిల్లల విషయంలోగానీ, పెద్దల విషయంలోగానీ అంతే. అలాంటివాళ్ళని చూసి మనం ఓ నిర్ణయానికి రాకూడదు.

అదేసమయంలో సాహిత్యం విషయం తీసుకుందాం. కొంతమంది ఉన్నారు. వారు ప్రతిరోజూ ఏదో ఒక పుస్తకం చదువుతుంటారు. చదవకపోతే వారికి పిచ్చి పిచ్చిగా ఉంటుంది. అలాంటి విషయాలమీదే రాసిన పదులకొద్దీ నవలలు చదివే ఉంటారు. అయినాసరే చదవాల్సిందే. మరి దాన్నిబట్టి సాహిత్యం కూడా మనుషుల్ని స్తబ్దంగా ఉంచుతుంది అందామా?

అయితే మీ మిత్రుడి అభిప్రాయం ప్రకారం ఓ దృశ్యం నడుస్తూ ఉంటుంది. ఆ క్షణంలో మన దృష్టి అంతా దానిమీద ఉంటుంది. కాబట్టి మనం అప్పుడు మెదడుతో ఆలోచించే అవకాశం ఉండదు. కళ్ళు దాన్ని చూస్తున్నాయి కాబట్టి అనవచ్చు. అదే నిజమైతే సాహిత్యానికీ ఆ ఇబ్బంది ఉంది.

పుస్తకం కూడా ఓ దృశ్యం! పుస్తకంలోని విషయాన్ని కంటితో చూసి చదువుతాం. అలాంటప్పుడు కూడా మనం ఆలోచించం.




ఎప్పుడైతే చదవటం ఆపామో, అప్పుడు మనకు దానికి చెందిన విషయం అనుభవంలోకి వస్తుంది. దాంతో మనం ఏకీభవిస్తున్నామా? లేదా అనేది తర్వాత తేలుతుంది. కాబట్టి మనిషిని నిర్వీర్యం చేసే శక్తి పుస్తకాలకుసైతం ఉంది. అందుకే మనం ఈ విషయాల గురించి తగాదాపడనవసరంలేదు. టీవీగానీ, సినిమాగానీ కలిగించే దుష్ప్రచారం గురించి మనం మాట్లాడుకోవచ్చు. దానికి విరుగుడుగా ఏం చేయాలనేది ఆలోచించవచ్చు. అంతేగాని పూర్తిగా ఈ మీడియమ్‌ను తిరస్కరిస్తున్నామంటే అర్థం ఏమిటంటే మనిషి సాధించిన అభివృద్ధిని తిరస్కరించటం అన్నమాటే.

కాబట్టి మనకు నిరాశలేదు. మనం ముందుకే వెళ్దాం. ముఖ్యంగా రాయటం ఏమిటంటే సినిమాలు ఎవరికోసం అనే విషయంలో మనకు స్పష్టత ఉండాలి. ఈ విషయంలో మనం క్లియర్‌గానే ఉన్నాం. మన సినిమాలు కూడా ప్రపంచస్థాయినందుకోవాలనే ఆరాటమూ వద్దు. భ్రమలూ వద్దు. మనం మన జనానికి ఏమైనా ఉపయోగపడగలిగితే చాలని నేననుకుంటున్నాను.

అదేసమయంలో మంచి సినిమాలు మనం చూసితీరాలి. నాకు బొమ్మలు గీయటం రాదు గానీ నా దృష్టిలో ప్రతి స్త్రీ ఓ చిత్రకారిణి కూడా. ముగ్గులు వేయటం కూడా ఓ కళే. కానీ అన్నిరంగాల్లో పురుషుల ఆధిక్యత ఉన్నట్లుగానే ఈ రంగంలోనూ ఉంది. బొమ్మలు బాగా గీసి పేరు తెచ్చుకున్నవాళ్ళు అరుదుగా ఉన్నారుకదూ!

నేను కూడా పిచ్చిగీతలు గీసినదాన్నే. స్కెచ్‌లు తీయలేనుగానీ మొత్తంమీద కొంతవరకు నేను గీసిందాంట్లో బొమ్మల్ని మీరు గుర్తుపట్టగలరనే అనుకుంటున్నాను.

ఇవన్నీ మనం చేయాలనుకుంటున్నవి. తప్పకుండా చేద్దాం. చూద్దాం.... ఫలితం ఎలా ఉంటుందో... మనం సిన్సియర్‌గా చేశామా లేదా అనేదాన్నిబట్టే ఉంటుంది. అన్నట్లు మీరు తిరగటం మొదలుపెట్టి చాలాకాలమైంది. ఇంక రెండోదశలోకి ప్రవేశించగలిగితే బాగుంటుందనుకుంటున్నాను. మీరు ఎప్పుడు వచ్చేదీ తెలియచేయండి. ప్రయాణం అయిపోతే సినిమాకు చెందిన స్క్రిప్ట్‌ను రూపొందించే పనిలో ఉండటం మంచిది.

ఇంతేమరి

మీ

దుర్గ

డాక్టర్ భరద్వాజ గురించి రాఘవ ఎవరి ద్వారానో విన్నాడు.

"మీరు ఆయన్ని కలుసుకోగలిగితే బాగుంటుంది. అంటే ఆయనేదో సినిమా ప్రపంచం గురించి బాగా చెబుతారని కాదు. కానీ ఆయన కూడా తన రంగంలో కొన్ని ప్రయోగాలు చేస్తున్నారు. ఆయనలాంటివారి అభిప్రాయాలు తెలుసుకుంటే బాగుంటుంది'' అన్నారు.

"ఆయన చిరునామా ఉందా?" అన్నాడు రాఘవ.

"ఉంది'' అంటూ అందించాడు.

రాఘవ అప్పుడప్పుడు ఆయన గురించి పత్రికల్లో చదువుతున్నాడు. ఆయన కూడా వివిధ విషయాలమీద వ్యాసాలు రాస్తున్నాడు.

ముందు రాఘవ ఆయనకో ఉత్తరం రాశాడు.

"ఓ విషయం గురించి మీతో చర్చించాలనుకుంటున్నాను. మీకు ఎప్పుడు వీలవుతుందో నాకు తెలియచేయగలిగితే నేను అప్పుడు బయలుదేరి రావాలనుకుంటున్నాను. కాబట్టి మీ తీరికా, నాకోసం కొంత సమయం వెచ్చించే అవకాశం చూసుకొని నాకు తెలియజేస్తారని భావిస్తున్నాను''

అందులోనే తన గురించి క్లుప్తంగా పరిచయం చేసుకున్నాడు.

త్వరలోనే ఆయననుండి ఉత్తరం అందుకున్నాడు.





"ఈ వారంరోజులూ నేను ఎటూ వెళ్ళడంలేదు. కాబట్టి మీరు ఏ క్షణంలోనైనా బయలుదేరి రావచ్చు''

వెంటనే ప్రయాణం అయి వెళ్ళిపోయాడు.

"రండి... రండి'' అంటూ ఆయన సాదరంగా ఆహ్వానించాడు.

సరాసరి హాస్పటల్‌కే వెళ్ళాడు.

ఊరికి దూరంగా ప్రశాంతకర వాతావరణంలో నిర్మించారు. చాలామంది పేషెంట్లు కనిపిస్తున్నారు.

ఆయన మరికొంతమందిని చూశాక లేచి వెళ్ళాడు. ఆయనతోపాటు ఓసారి ఓ యువడాక్టర్ రావటం జరిగింది.

"రండి... మనం వెళ్దాం" అన్నాడు.

రాఘవ ఆయన్ని అనుసరించాడు.

ఆ గదిలోకి వెళ్ళాక ఆయన చిరునవ్వు నవ్వుతూ అడిగాడు.

"మీ బుక్స్ ఏమైనా తీసుకొచ్చారా?"

రాఘవ రెండుమూడు నవలలు అందించాడు.

వాటిని చూసి పక్కనపెడుతూ అన్నాడు "వీటిని చదువుతాను''

రాఘవ నవ్వాడు.

"నేను మెడిసిన్ చదువుతున్న రోజుల్లో రాయాలనే ఆవేశంలో ఉండేవాణ్ణి. అప్పట్లో కొన్ని కథలు రాసినట్లు గుర్తు''

"పొయిట్రీ రాశారా?"

"లేదు. కానీ మంచి పొయిట్రీ దొరికితే చదువుతాను. మరి ఎందుకనో నేను రచయితని కాలేకపోయాను. ఇప్పుడు అంత తీరికలేదు. అయితే మీలాంటివారిని చూసినప్పుడు మాత్రం నాకు తిరిగి ఆ రోజులు గుర్తొస్తుంటాయి. అది కొనసాగిస్తే బాగుండేదేమో అని''

"ఇప్పుడయినా ఫర్వాలేదు. అందులోనూ ఓ డాక్టర్‌గా మీరు రకరకాల రోగుల్ని ఎదుర్కుంటారుగదా''

"ఎదుర్కోవటమా'' అని నవ్వాడు భరద్వాజ.

రాఘవ తమ ప్రాజెక్ట్ గురించి వివరంగా చెప్పాడు. ఆయన నిశ్శబ్దంగా విన్నాడు. అంతా అయిపోయాక అన్నాడు చిరునవ్వుతో

"గుడ్... మంచి ప్రారంభం"

"ఈ విషయంలో మీ అభిప్రాయాలకోసం నేను వచ్చాను''

ఆయన చిరునవ్వుతో తల పంకించాడు.

"మీరు కాఫీలాంటిది తీసుకుంటారా?"

"లేదు. ఇప్పుడలాంటి అవసరంలేదు. తాగాలనిపిస్తే అడుగుతాను''

"బాగుందే. సరే... విషయానికొద్దాం. మీరు చెప్పిందంతా బాగుంది. నేను కూడా నా వృత్తికి చెంది... ఇందులో కొన్ని మార్పులు అవసరం అనుకుని ఇదంతా ప్రారంభంచేసినప్పటి పరిస్థితి, నేను కూడా మీలానే మా డాక్టర్లని కలుసుకున్న రోజులు గుర్తుకువస్తున్నాయి. అప్పట్లో నాకేమంత ప్రోత్సాహం లభించలేదు కూడా. మెడిసిన్ చదవటానికి కొన్ని లక్షల రూపాయలు ఖర్చుపెడుతున్నారు. తిరిగి అవి రాబట్టుకోవాలి. అలా రాబట్టుకోవాలంటే దేశంలో రోగాలుండాలి. మందులుండాలి. మందుల కంపెనీలుండాలి. అసలు రోగాలు లేని సమాజం మనం నిర్మించుకుందాం అంటే అందరూ వినరుకదా... అయినా నేను నిరుత్సాహపడలేదు'' రాఘవ జాగ్రత్తగా వింటున్నాడు.

"మేం చాలా చిన్నగానే ప్రారంభం అయ్యాం. వైద్యం చాలా తక్కువ ఖర్చులో చేస్తాం అంటున్నా మొదట్లో మాదగ్గరికి రోగులు రావటం జరగలేదు. అందుకు రకరకాల కారణాలున్నాయి. మొత్తంమీద నిరాశపడకుండా అలానే కొనసాగించాం. ఇప్పుడు మాకంటూ ఓ బిల్డింగ్ ఉంది. కొన్ని ప్రత్యేక యంత్రాలు తెప్పించాం. యువడాక్టర్లు కొంతమంది పనిచేస్తున్నారు.

రెండువందల చిల్లరమందులు చాలు మన కొచ్చే వ్యాధులు నయంచేయటానికి. మనదే శంలో ఓ ఇరవైవేల రకాలు తయారుచేస్తున్నా రు. అంతేకాదు విదేశాల్లో మాకు ప్రమాదం బాబూ అని అవతల పారేసినవాటిని ఈదే శంమీదకి పంపిస్తున్నారు. ఇలాంటి సమ యంలో ఎంత పెద్ద పోరాటం చేయాలో ఆలోచించండి. మరి డాక్టర్లు తమ వృత్తి గురించే ఆలోచిస్తారా? వీటిమీద పోరాటం చేస్తారా? అందుకే అదంతా ఓ కార్యక్రమంగా తీసుకునే కొంతమంది కావాలి. అసలు ఈ దేశంలో కొన్ని వేల గ్రామాలున్నాయి. కోట్ల మంది ప్రజలున్నారు. మరి వారందరికీ ఎంత మంది డాక్టర్లున్నారు. కనీసం గ్రామానికి ఇద్దర యినా కాంపౌండర్లాంటివారిని మనం తయా రుచేసుకోగలుగుతున్నామా? ఇలాంటివన్నీ మా ముందున్నాయి. కానీయండి మీరు ఓ రంగం గురించి అడుగుతున్నారు. నేను ఇంకోరంగం గురించి మాట్లాడుతున్నాను''

"అదేంలేదు... మీ అనుభవాలు చెప్పండి. ఏరంగంలోనైనా ఉన్న పరిస్థితులకు ఎదురీ దటం అంటే సామాన్యం కాదు. ముందా పద్ధతులు అన్నిరంగాలకూ ఉపయోగించవ చ్చు.

"అవును... సరే సినిమా రంగానికొద్దాం. నాకు కొంతమంది సెన్సార్ బోర్డ్ మెంబర్స్ తెలుసు. అందులో కొందరు అభిరుచిగలవారు న్నారు. అంతేకాదు కలకత్తాకు చెందిన కొంద రు నటుల్తోనూ, అలాగే ఆ రంగానికి చెందినవా రితో పరిచయాలు ఉన్నాయి. వారు కేవలం తమ రంగానికే పరిమితం కావటంలేదు.

మనకు ఇక్కడ భిన్నమైన పరిస్థితి ఉంది. సామాజిక బాధ్యత అనేది కనిపించదు. అధి కార రాజకీయాలకోసం ముందుకు వచ్చేవారే తప్పించి తమమీద ఇంకే బాధ్యత ఉండాలని వారు అనుకోరు. ఒక్కోసారి వారి బాధ చూస్తుంటే నవ్వు వస్తుంటుంది. ఫలానాయన కి అవార్డ్ రాలేదనో... ఫలానా సినిమాకి అవార్డ్ ఇవ్వలేదనో గోల తప్పితే ఇంకోటి లేదు. అయితే అదంతా అలానే ఉంటుందను కోండి'' అన్నాడు.

"సో... మనం ఇక్కడ మార్పుకోసం పనిచే యటం అనేది సర్లైందేకదా''

"అందులో ఎలాంటి సందేహంలేదు. మీరు ఎన్నుకున్న టార్గెట్ కూడా బాగుంది. నగర ప్రేక్షకులు కాదు మీ దృష్టి. ఈ సమ యంలో మీకో విషయం చెబుతా. ఓ మంచి సినిమా నగర ప్రజలకంటే ఇంటీరియర్స్‌లోకి వెళ్ళగలిగితే వాళ్ళు బాగా ఆదరిస్తారు. ఎందు కంటే మనం ఓ మంచి సినిమా తీశాం. ఓ థియేటర్‌లో ప్రదర్శిస్తున్నాం. ప్రేక్షకుడు మన థియేటర్ దగ్గరికి రావాలి. అతను బయలుదేరా డు. దారిలో అభిమాన హీరో కన్పిస్తాడు. తుపాకులు పిలుస్తుంటాయి. ఆడపిల్లల గుండె లు పిలుస్తుంటాయి. మరి మన థియేటర్ చాలాదూరంలో ఉంది. ఇన్ని ఆకర్షణలను అధిగమించి అతను మనదగ్గరకు రావాలి. వస్తాడా? రాడు... ఒకరో... అరో రావచ్చు''

రాఘవ తలూపాడు.

"అంటే నగర ప్రేక్షకుడు పొల్యూట్ అయి పోయాడు. అతని మనసునిండా రకరకాల చెత్త అంతా నింపి వాటికోసమే ఎదురుచూ సేంతగా ఎడిక్ట్ చేశారు. మంచి ప్రేక్షకుడు అనుకున్నవారిమీద కూడా ఏదోమేరకు ఈ ప్రభావం ఉంటుంది. తనకు కావాల్సిన సినిమా లు రావు. ఏదో ఒకటి చూడాలి. అలా చూస్తు న్నాం అంటే ఆ ప్రభావంలోకి మనకు తెలియ కుండానే మనం జారిపోతున్నాం అన్నమాట.

ఈ పరిస్థితి గ్రామాల్లో లేదు. గ్రామాల యూత్‌లో ఉంటే ఉంటుంది. అది కూడా చాలా తక్కువశాతం. ఇంకా చాలా ఎక్కువ మంది పొల్యూట్ కాలేదు. వారిదగ్గరకు మన సినిమాని తీసుకువెళ్తాం అనుకోండి. అద్భుత మైన రిజల్ట్స్ ఉంటాయి. నాకా నమ్మకం ఉంది. ఇది నా అభిప్రాయం కాదు. ఓ సెన్సార్ మిత్రుడు ఏం చెప్పాడో తెలుసా...




'మృణాల్‌సేన్ సినిమాని నగర ప్రేక్షకుడు చూడడేమో... కానీ ఓ గిరిజనుడు చూసి ఆనందించగలడు' అని..."

రాఘవ ఆశ్చర్యంగా ముందుకు వంగాడు.

"అంటే ఇదంతా కేవలం ఆదర్శంగానో, మరోరకంగానో కొట్టిపారవేయనవసరంలేదు. రెండవదేమిటంటే నగర ప్రేక్షకుడికంటే గిరిజనుడు గొప్పవాడని నేను అనటంలేదు. వారిద్దరి దృష్టిలోనే తేడా ఉంది.

నగర ప్రేక్షకుడి కొలబద్ద వేరు. గిరిజనుడి కొలబద్ద వేరు.

మనం టెక్నిక్ గురించి చూస్తాం. కథ గురించి ఆలోచిస్తాం. అది సరిగ్గా చెప్పబడిందా లేదా... అందులో ఏయే లోపాలున్నాయి అనేది మనకు కావాలి. వాళ్ళకు అవసరంలేదు. అందుకే నేననుకుంటాను. ఇండియన్ మాసెస్‌ని కమర్షియల్ కళాకారులు అర్థంచేసుకున్నంత బాగా మనలాంటివారు అర్థంచేసుకోలేదేమో అని''

"కావచ్చు'' అన్నాడు రాఘవ.

"మీరో రచన చేశారనుకుందాం..., అది రాయటంలోనే మీకు కొన్ని ఇబ్బందులు ఎదురౌతాయి. ఇది ఇలా రాశాం అంటే విమర్శకులు ఏమంటారో? ఫలానాయన ఏమంటాడో? ఫలానావిడ విమర్శిస్తుందేమో అనుకుంటూ, కొన్ని సూత్రాలు తెచ్చుకుని వాటిని తగినరీతిలో ఉందా లేదా అని చూసుకుంటారు. మామూలు పాఠకుడికి వీటన్నింటితో అవసరంలేదు. తనకు ఏది కావాలో అదిమాత్రం గ్రహించి మిగతాది వదిలేస్తాడు''

రాఘవ తలూపాడు.

"ఈ జనం మనకు ఇష్టంలేని సినిమాలు చూస్తున్నారు. మనకి ఇష్టంలేని రచనలు చదువుతున్నారు. మనకు ఇష్టంలేని పార్టీకి అధికారం అప్పగిస్తున్నారు. అదేసమయంలో మనకు ఛండాలం అనిపించినది వారికి బాగుంటుంది. మనకు అద్భుతంగా అనిపించేదాన్ని వీరూ ఎంజాయ్ చేస్తున్నారు. అంటే మానవానుభవాన్ని అధ్యయనం చేయటం అనేది ఇక్కడ పాయింటే. అది ఎవరికి వారు చేయాలి. ఎంత కృషిచేసినా అర్థమయ్యేది కొంతమాత్రమే అనుకోండి. అది వేరేవిషయం. అందుకని ఇక్కడ మనం నిర్ణయించుకోవలసింది ఏమిటంటే...

ఈ రచన ఎవరికోసం?

నీ సినిమా ఎవరికోసం?

విమర్శకులకోసమా? ఫేమ్‌కోసమా? ప్రయోజనం కోసమా?

ముందు ఈ పాయింట్ దగ్గర తేల్చుకుని ముందుకు పోవటం అవసరం అని నేను అనుకుంటా.

అది కనుక క్రిటిక్స్‌కోసం అయితే, ఫేమ్ కోసం అయితే ఇంత ఘర్షణ చెందనవసరంలేదు. ఇంత నెట్‌వర్క్ అవసరంలేదు. అదంతా కథ ఎలా చెప్పాలి... ఎంత బాగా చెప్పాలనేదానికి చెందిన ఘర్షణే. నీకు డబ్బుంటే, పెట్టుబడి పెట్టేవాడు దొరికితే ఆ కోరిక తీర్చుకోవచ్చు. ఆ ప్రయోజనం నెరవేరుతుంది.

క్రిటిక్స్ ఏమనుకుంటారా అనేది నీకు అనవసరం. నువ్వు ఎన్నుకున్న పాఠకుడు, ప్రేక్షకుడు... అతను ముఖ్యం. అయితే ఇదంతా చెబుతున్నానంటే క్రిటిక్స్ అవసరంలేదనీ, వాళ్లని పట్టించుకోనవసరంలేదనీ, మనం నానా చెత్త తీసి అదంతా జనంకోసమే అని దబాయించటానికి కాదు.

నిన్నటిదాకా ఏయే శాఖలద్వారా తమకు తెలిసీ తెలియకుండా ఓ సైలెంట్ ఉద్యమాలు జనానికి వ్యతిరేకంగా నిర్మించారో, ఈరోజు మనమూ అలానే చేయాలి. తప్పకుండా చాలామంది కలసివస్తారు. సో... మీరు చేయదలుచుకున్నది నిస్సందేహంగా బాగుంది. అంతకుమించి ఈ రంగంలో ఆధునికంగా వస్తున్న మార్పుల్ని మనం వినియోగించుకుందాం... అదెలా అంటే 'వీడియో' ఉంది. మనం వీడియోకెమేరాని ఎందుకు వినియోగించకూడదు? చాలామంది కుర్రాళ్ళు వీడియో కె

మెరాతో అద్భుతాలు చేస్తున్నారు. అదయితే చాలా ఖర్చు కలిసివస్తుంది. అంతగా అయితే మనం బ్లో అప్ చేయించుకుందాం. ఈరోజు వైడ్‌స్క్రీన్ అనుకుంటున్నాం. రేపటినుండి చిన్నతెరదే రాజ్యం''

"బాగా ఎఫెక్టివ్‌గా వస్తుందా అని'' అన్నాడు రాఘవ.

"ఈదశలో మనకు అంత ఎఫెక్ట్ అవసరంలేదు. ముందు మనం ఓ చిత్రాన్ని ప్రొడ్యూస్ చేయాలి. అది జరుగుతుందా... లేదా అనేది ప్రధానం. తర్వాత మనం సాధించే విజయాన్నిబట్టి అది ఉంటుంది''

"ఈ విషయంలో మీ సహకారం మాకు చాలా అవసరం''

"తప్పకుండా. నేను కూడా ఇలాంటి ప్రాజెక్ట్ గురించి ఆలోచిస్తున్నాను. అయితే నా ఆలోచనలు వేరేరంగానికి చెంది ఉన్నాయి. ఇప్పుడు ఈ విజువల్ మీడియాని మనం వినియోగించుకుందాం. నెట్‌వర్క్‌కి చెందిందంతా ఐ మీన్ డిస్ట్రిబ్యూషన్ నెట్‌వర్క్ గురించి నేను చూస్తాను. ఎందుకంటే మేం ఓ వాన్‌లాంటిది కొనాలని కొద్దికాలంగా అనుకుంటున్నాం. ఇప్పుడు దీని పరిధి పెరిగిందిక దా. ఏకకాలంలో రోగులదగ్గరకు వైద్యమూ, కళా రెండూ వెళ్ళాలి''

రాఘవ కళ్ళు సంతోషంతో మెరిశాయి.

అతను వచ్చేముందు మామూలుగా కొన్ని అభిప్రాయాలు తెలుసుకోవచ్చుననుకున్నాడు తప్పించి ఇంతటి ప్రోత్సాహం వస్తుందనే ఊహ కూడా రాలేదు.

"నాకు ఆనందంతో మాటలు రావటంలేదు'' అన్నాడు రాఘవ.

"ఇప్పుడేకాదు మిస్టర్ రాఘవా... తొలి ప్రసవం అయ్యాక అప్పుడు... అప్పుడు మాత్రమే మనం ఏ సంతోషాలకు లోనయినా''

"అవును... కానీ మీనుండి ఇలాంటి ప్రతిస్పందన రాగలదని నేను అనుకోలేదు''

"నేను కూడా మీలాంటి మిత్రులకోసం ఎదురుచూస్తున్నా. నాకు చాలా కోరికలున్నాయి. నా ఆలోచనలన్నీ ఒక్కో క్రమంలోకి తీసుకువస్తున్నా. మనం చేయవలసిందెంతో ఉంది. బృందాలు బృందాలుగా మనం చొచ్చుకుపోవాలి.

"దుర్గ ఏమంటుందో తెలుసా సార్?''

"చెప్పండి''

"సినిమా మీడియం కూడా గౌరవప్రదం అయింది కావాలి. ఇందులోకి ఎందరెందరో చదువుకున్నవారు చొచ్చుకురావాలి. మనం ఈ పాత్ర పోషించు అంటూ మన చెల్లాయిల్ని పంపించగలగాలి. మన అక్కల్నీ, భార్యనీ, బిడ్డల్ని సైతం పంపించాలి. స్త్రీలూ, పురుషులూ కలిసి చర్చించి, ఓ అవగాహనతో ఈ కళని ముందుకు తీసుకుపోవాలి. సినిమా ద్వారా ఓ నూతన ప్రపంచాన్ని మనం వెతుక్కోవాలి అంటుంది. ఇలాంటి మాటలు దుర్గ నోటినుండి వింటే హేళనచేస్తారు. చేయనివ్వండి ఫర్వాలేదు. ఆమె తన గమ్యం చేరుతుందనే నమ్మకం నాకుంది''

భరద్వాజ తలూపాడు.

అలా ఊపటంలో ఆయనలో తన్మయత్వమేదో కనిపించింది.

"అవును... కళాకారులెవరైనాసరే కళాకారులే. అది సినిమా కావచ్చు. నాటకరంగం కావచ్చు. చిన్నతెర కావచ్చు. మనం మామూలు మనుషులకు భిన్నం కాదని గ్రహించాలి.

"నేను అనుభవాన్నీ, నమ్మకాన్నీ మూటకట్టుకు వెళ్తున్నాను'' అన్నాడు రాఘవ.

"కాదు పంచి ఇస్తున్నా అంటే బాగుంటుందేమో''

రాఘవ నవ్వాడు.

"నా కార్యక్రమంలో ఓ అంకం పూర్తయింది. ప్రస్తుతం నేను కొద్దిపాటి పనులు పూర్తిచేసుకొని మద్రాసు వెళ్తాను. కొంతకాలంపాటు సహాయదర్శకుడిగా నేను పనిచేయా




లనుకుంటున్నాను''

"మంచిది''

"నేను రెగ్యులర్ కాంటాక్ట్‌లో ఉంటాను. ఉత్తరాలు రాస్తుంటాను. మనం మన ప్రాజెక్ట్‌ను ప్రారంభించేలోగా మరోసారి కలుద్దాం"

"అలాగే'' అన్నాడు భరద్వాజ.



దుర్గా...

మొదటి కార్యక్రమం పూర్తయింది.

"విజయవంతంగా'' అని రాయాలనుకున్నాను. కానీ రాయలేదు.

నేను ఇంక రెండో కార్యక్రమంలోకి రావాలి.

అంటే నీ దగ్గరకి... నన్ను ఎవరి దగ్గరయినా సహాయదర్శకుడిగా చేర్చాలి. నీకు గుర్తుందిగా. నన్ను ఓ మహానుభావుడికి పరిచయం చేసినప్పుడు ఆయనిచ్చిన భంగిమ, అలాంటివారి చెంత పనిచేయటం ఆరంభిస్తే నేను కూడా భంగిమలు ఇవ్వటమే నేర్చుకోవాలి.

కొంచెం అభిరుచి కలవారిని చూడు. హాయిగా మాట్లాడాలి. ఆ టెక్నిక్ గురించి మనకు పూర్తిగా చెప్పకపోవచ్చుగాని, కనీసం మూర్ఖంగా ప్రవర్తించకుండా ఉంటే చాలు.

ఈ కార్యక్రమంలో నూతన అనుభవం భరద్వాజ.

ఆయన ఈ సరికే ఓ కార్యక్రమంలో ఉన్నాడు.

ఆయన చెబుతున్న దాన్నిబట్టి ఇకముందు ఆ వ్యక్తికి చెంది కూడా కొన్ని డాక్యుమెంటరీలు తీయాల్సిరావచ్చు.

నేను వెంటనే బయలుదేరాలనుకున్నాను. అది అంత సులభంకాదని నీకు తెలుసు. ఇన్ని రోజులుగా తిరగటంవలన ఇంటి దగ్గర లేను. కొన్ని పనులున్నాయి. ముందు అవి పూర్తి చేసుకోవాలి.

అవన్నీ అయ్యాక బయలుదేరివస్తాను.

సరోజ బాగుంది. పిల్లలు బాగున్నారు.

నేననుకుంటున్న కథ ఓ రూపంలోకి వచ్చింది. త్వరలోనే ట్రీట్‌మెంట్ రాయటం ఆరంభిస్తాను.

ప్రేమగారు బాగున్నారు.

ప్రేమగారి భర్త బాలకృష్ణ చేస్తున్న హడావుడి అంతా ఇంతా కాదు. మొత్తంమీద మొదలుపెట్టిం దగ్గర్నుంచి ఇంతవరకు కూడా ఏ క్షణం ఎందుకిలా చేస్తున్నాను అనే ఆలోచన రాలేదు.

ఇప్పటివరకూ అదో విజయం అని నేననుకుంటున్నాను.

త్వరలోనే కలుసుకుందాం.

రాఘవ.

స్టేషన్ దగ్గరికి ప్రేమ, బాలకృష్ణ వచ్చారు.

ఇంక సరోజా, పిల్లల సంగతి చెప్పేదేముంది. అంతుకుముందురోజు చంద్రం వచ్చి వెళ్ళాడు. అందరూ ఈ విషయం గురించి మాట్లాడుకున్నారు.

మరో నాలుగునెలల కాలంలో అంతా ఆరంభం కావాలి. ఓ కొత్త దర్శకుడి దగ్గర రాఘవ పనిచేయబోతున్నాడు. అతను మూడునెలల కాలంలో ఆ సినిమా పూర్తిచేయటానికి నిర్ణయించుకున్నాడు.

అనుభవం ఉన్న దర్శకుడి దగ్గరయితే బాగుండేదేమో అనిపించింది. అయితే వారందరి చర్చల్లోనూ ఇదే నయం అనిపించింది.

కొత్త దర్శకుడయితే ఓ సౌలభ్యం ఉంది.

అతనింకా అహాన్ని తలకు ఎక్కించుకోకపోవచ్చు. తన మొదటి సినిమా విజయవంతం కావాలనే తపనతో ఉంటాడు. అందులోనూ ఇతరులు ఏమనుకుంటున్నారా అని పదేపదే తెలుసుకోవాలనుకుంటాడు. తర్వాతికాలంలో అతనికా అవసరం రాకపోవచ్చు.

అదే సమయంలో తనకు తెలిసిన విషయాలు చెప్పటానికి అతనికేమంత అభ్యంతరం ఉండదు.

రాఘవ రచయిత కూడా కాబట్టి వారిద్దరూ కలిసి పనిచేయటానికి ఇబ్బందులు ఎదురు కావు.

ఈ సినిమాకి చెంది ఇంకో కోణం ఏమిటంటే పేరు పొందిన తారలు లేరు. అలా ఉన్నా ఇంకో ప్రమాదం ఉంది. వాళ్లు దర్శకుణ్ణి కూడా కమాండ్ చేయవచ్చు. ఇప్పటి పరిస్థితి ఏమిటంటే-

అందరూ తమని తాము ప్రూవ్ చేసుకోవాలి.

రేపు ఇక్కడ నిలబడటమా లేదా అనేది చాలావరకు నిర్ణయం అయిపోతుంది. అందుకని అందరూ కూడా అహానికి అతీతంగా పనిచేస్తారు. అదే పెద్ద దర్శకుల దగ్గర కుదరదు. పెద్ద నటుల దగ్గర కూడా. అక్కడ క్రియేటివిటీ కంటే భారీతనంమీద మోజు ఉంటుంది అనుకున్నారు



అంతకుముందు మద్రాసు వెళ్లినా ఎవరూ రాలేదు.

ఇప్పుడు అందరూ రావటం చూస్తే రాఘవకి సంతోషంతోనూ, తనకే తెలియని మరో భావంతోనూ కూడా మనసు మూగబోయింది.

బాలకృష్ణ అయితే అటూ ఇటూ చూస్తున్నాడు.

హడావుడి పడుతున్నాడు.

"ఏంటి మాస్టారూ కాఫీ తాగుతారా?" అన్నాడు రాఘవ.

"ఛ... స్టేషన్లో కాఫీబాగుండదు'' అంది ప్రేమ.

"అదేంకాదులే' అనబోయాడు.

"అంటే... తాగుతారా?"

"అదికాదు'' అంటూ ఏదో చెప్పబోతుంటే.

"మాస్టారూ'' అంటూ ఎవరో వచ్చి పలకరించారు.

"రండి''

"ఎక్కడికి బయలుదేరారు''

"నేనా... లేదు లేదు. మా ఫ్రెండ్‌ని పంపించటానికి వచ్చాను''

"అలాగా... ఏ ఊరు?"

"ఈ ఊరే. మద్రాసు వెళ్తున్నాడు''

"మద్రాసా?" అన్నాడాయన.

"అవును మద్రాసే. ఎవరనుకున్నారు. ఎందుకెళ్తున్నాడనుకుంటున్నారు. త్వరలో యిరగదీసేయబోతున్నాడు.

"ఎవర్నండి?" అన్నాడతను అర్థంకాక.

ప్రేమా వాళ్లంతా ఆ మాటకి నవ్వారు.

రాఘవకి కూడా నవ్వు వచ్చింది.

బాలకృష్ణ ఆయన్ని పక్కకు లాక్కుపోయి ఏదో చెబుతున్నాడు. ఆయన కళ్లు ఇంతింత చేసుకొని వింటున్నాడు. వారందరికీ ఆయన నోటినుండి వస్తున్న ఒకేమాట వినిపిస్తోంది.





"అలాగా... అలాగా'' అంటున్నాడతను.

"మరేంటనుకున్నావ్?" అంటున్నాడు బాలకృష్ణ.

అతను తల తిప్పి చూడాలనుకుంటున్నాడు.

బాలకృష్ణ మాత్రం అలాంటి అవకాశం ఇవ్వటంలేదు.

"చూస్తున్నావుగా నువ్వు విరగదీయటం కాదు. బాలకృష్ణ విరగదీసేస్తున్నాడు. మహానుభావుడు నేరకపోయి పిలిచాడు. ఇంటికి వెళ్ళి వాళ్లు పట్టించుకోవలిసిందే'' అంది ప్రేమ.

రాఘవకి ఎంత నవ్వు వచ్చిందంటే కళ్ల వెంట నీళ్లు వచ్చాయి.

"ఎందుకయ్యా బాబూ అంత నవ్వుతున్నావ్? అయినా ఆ మనిషి సంగతి నీకు తెలుసుగా. రోజూ పదిమందిదాకా కుర్రాళ్లు ఇంటికొస్తున్నారు. ముందు ఎందుకింతమంది వస్తున్నారా అనుకున్నా... ఓ రోజు పిలిచి ఏంటి బాబూ మాస్టారితో ఏంపనుండి వచ్చారు అనడిగా. అప్పుడు నా మతిపోయింది''

"ఎందుకు?" అన్నాడు రాఘవ.

"వాళ్లందరూ నాటకాలంటే ఇష్టపడతారు. అప్పుడప్పుడు నటిస్తుంటారు. అందరికీ ఈయనేం చెబుతున్నాడంటే మావాడు త్వరలో విరగదీసేయబోతున్నాడు. మీ అందరికీ నేను తలో పాత్ర ఇప్పించేస్తాను. మీరందరూ కూడా విరగదీసేద్దురుగాని అని చెబుతున్నాట్ట''

తిరిగి రాఘవకి తెరలు తెరలుగా వచ్చింది నవ్వు.

"ఆషామాషీ సినిమా అనుకోకండి. ఆర్ట్ ఫిలిమ్ ఇది. అనికూడానట చెప్పాకదా. ఆయనవల్ల మనకు ఎంత ఉపయోగం ఉందో అంత డేంజర్ ఉందని. అయినా మనిషి మనల్ని ఇక్కడ వదిలేసి వెళ్లిపోయాడేంటి'' అంటూ పక్కకు తిరిగింది.

నడుంమీద ఓ చెయ్యి వేసుకొని ఇంకో చేత్తో కాఫీ కప్పుతో ఉన్నాడు.

ఆయనెదురుగా నిలుచున్నాయన మాత్రం

తాగటంలా.

కాఫీ తాగుతూనే ఇంకా చెబుతున్నాడు-

"ఏం మనిషయ్యా రాఘవా?" అందామె.

సరోజ కూడా నవ్వకుండా ఉండలేకపోయింది.

రైలు రావటానికి మరికొంత సమయం పట్టేట్లు ఉంది.

"ఏం బాబూ నువ్వెక్కబోయే రైలు లేటుగా బయలుదేరబోతోంది''

"ఎలా బయలుదేరినా సరిగ్గా గమ్యం చేరిస్తే చాలు'' అన్నాడు రాఘవ. మరో అయిదు నిముషాలకు వచ్చాడు బాలకృష్ణ.

"అయిందా?" అంది.

"నన్ను పట్టుకుని వదలకపోతే నన్నేం చేయమంటావ్''

"నిన్ను ఆయన పట్టుకున్నాడా... వినమ్మా. బుద్ధి తక్కువై నిన్ను పలకరించాడు. మనిషికి కాఫీ కూడా తాగాలనిపించలేదనుకుంటా తమరొక్కరే సేవించారు''

"వద్దన్నాడు''

"అవును. మరి తమరెందుకు తాగటం"

"రైలు ఇంకా రాలేదుకదా. విరగదీద్దామని''

"చూశావుగా స్టోరీ డిస్కషన్‌లో మాత్రం ఈ మహానుభావుడు వద్దు. ఆ కాఫీ ఖర్చుతో నాలుగు రీళ్లు చుట్టుకోవచ్చు'' అంది.

సరిగ్గా అదే సమయంలో బండి రాబోతున్నట్లుగా ప్రకటన వినిపించింది.

ప్రేమ రాఘవని చూస్తూ అంది.

"నేను కూడా బాలకృష్ణ భాషలో చెబుతున్నా... నువ్వు విరగదీయాలి'' రాఘవ చిరునవ్వుతో తలూపాడు.

మరికొద్ది క్షణాల్లో ప్లాట్‌ఫాంమీదకు రైలు వచ్చి ఆగింది. బాలకృష్ణ హడావిడిచేసి సూట్‌కేస్ సర్దాడు. కిటికీ పక్కన సీటే లభించింది. ముందుగా బుక్ చేద్దామన్నా రాఘవ వినలేదు. నేను అప్పటికప్పుడు టిక్కెట్ తీసుకొనివెళ్తాను'' అన్నాడు.

"మంచి సీటే దొరికింది'' అంది ప్రేమ.

"నాదేముంది. గురువుగారు విరగదీసేరు అడ్డం వచ్చినాళ్లని''

"మంచిది... ఇంక నీకోసం ఎదురుచూస్తాం రాఘవా... దుర్గని అడిగినట్లు చెప్పు'' అంది ప్రేమ.

ఓపక్క నిలబడి ఎవరో పరదేశిని చూస్తున్నట్లు చూస్తోంది సరోజ. రాఘవ పిలిచాడు దగ్గరికి.

"మాట్లాడటం లేదే''

"మాటలు రావడంలేదు''

పిల్లలకేసి చూశాడు.

"వస్తానమ్మా''

"బాగా చదువుకోండి''

వారిద్దరూ తలలూపారు.

బండి మెల్లిగా కదిలింది.

అందరూ చేతులూపుతున్నారు.

బండి మెల్లగా వేగం పుంజుకొంది.

సరోజ కళ్లనుండి మెల్లగా జారిందో బిందువు. తుడుచుకోవాలని తెలియదు. అలా చూస్తూనే ఉంది.

"బండెళ్లిపోతోంది''

ప్రేమ ఎందుకో సరోజకేసి చూసింది.

అంతలోనే బాలకృష్ణకేసి చూసింది.

ఆశ్చర్యం...

తను ఏడుస్తున్నాడు.

తన్మయత్వంతో.

"బాలకృష్ణా... ఇందుకేనేమో నువ్వంటే నాకు ప్రేమ" అనుకుంది ప్రేమ. రాఘవ వెళ్లిన నాలుగవరోజుకి తననుండి ఉత్తరం వచ్చింది. ఒకటి సరోజకి. రెండవది ప్రేమావాళ్లకి.

సరోజా-

చాలా సంవత్సరాలైందికదూ నీకు ఉత్తరం రాసి.

మన పెళ్లయిన కొత్తలో నేను దూరంగా ఉన్నప్పుడు మనం కొన్ని ఉత్తరాలు రాసుకున్నామనుకుంటాను.

నేను చాలాసార్లు ఊరువెళ్లాను. కానీ మొన్న వస్తున్నప్పుడు కలిగినంత అనుభూతి మాత్రం ఎప్పుడూ నాకు కలగలేదు. మీరందరూ నా కోసం వచ్చారు. మీ కళ్లలో ప్రేమా, అభిమానం, నేనేదో సాధించబోతున్నాననే నమ్మకం నాకు కనిపించాయి.

మీరంతా నాకు బలాన్నిచ్చారు.

చాలా సంవత్సరాలకిందట నేను ఇలానే కలకన్నాను. నా వెనకాల ఇలానే జనం ఉన్నారు. వారందరూ నాకు వీడ్కోలు ఇస్తున్నారు. నాకది ఎందుకో అప్పుడు అర్థంకాలా. ఇప్పుడా దృశ్యం గుర్తుకువచ్చింది.

నా కలలు ఫలించబోతున్నాయి.

నా సంతోషం అంతా అదే.

ఇలా జరుగుతుందని నేను కలలో కూడా అనుకోలేదు. ఇలా జరగాలని మాత్రం నాకు ఉండేది. అలా జరగాలంటే పెళ్లిలాంటివి చేసుకోకూడదనుకున్నాను. కానీ అవేం అలా జరగలా. ఎప్పుడయితే నిన్ను చేసుకున్నానో అప్పుడు నాకు అనిపించింది, ఇంక నావి కలలు మాత్రమే అని.

పిల్లలు పుట్టారు.

జీవితం కోసం పోరాటం ఆరంభమయింది. అదే ప్రధానం. అయితే నేను అది చేస్తూనే ఇంకో పనిచేయగలిగాను. అది రాయటం- అయినాసరే ఈ రంగంలోకి రాగలనని నాకు అనిపించలేదు.

నా జీవితంలో ఆ 'హోటల్' నాకు పీడకల అనుకునేవాడిని. అక్కడ పనిచేసినప్పుడు మాత్రమే కాదు, దానినుండి బయటకు వచ్చాక కూడా. ఆ ప్రభావంనుండి నేను బయటపడలేకపోయాను. అలాంటిది ఆనాటి విషాదకర అనుభవాలే లేకపోతే నేనింతగా రగిలిపోయేవాడినా అనిపిస్తోంది.

మా మావయ్య నన్ను కొట్టిన సమయంలో అక్కడినుండి వచ్చాక నాకు రకరకాల ఆలోచనలు వచ్చాయి. వెంకట్రావ్‌ని ఏదో ఒకటి చేయాలనుకున్నాను. ఏదో ఒకటి చేయటం మనిషికి ఏమంత కష్టమైనపనికాదు. ఆ విషయం నాకు తెలుసు. ఆనాటి నా మానసిక స్థితి అది.

ఆ తర్వాత కొద్దికాలంలోనే వారిని చూసి జాలికలిగింది. వాళ్లు పొందే ఆనందం చూసి నిజంగానే జాలి కలిగింది.

నీకో సంఘటన గురించి చెప్పాలి.

ఓరోజు మా ఊరిగ్రంథాలయం మీద ఓ సాహిత్య సభలాంటిది ఏర్పాటు చేశారు. అందులో నేను కూడా మాట్లాడాలి. కొద్దిమంది మాత్రం వచ్చారు. నేను కూర్చున్న కుర్చీ పిట్టగోడకు ఇవతల ఉంది. నాకు బయట అంతా కనిపిస్తోంది.

గ్రంథాలయం ముందంతా ఖాళీస్థలం.

పిల్లలంతా హాయిగా ఆడుకుంటున్నారు. అంతకుముందు నేను కూడా అలా ఆడుకున్నవాడినే. నాకా సమయంలో నా బాల్యం అంతా గుర్తుకువచ్చింది.

మరికొద్దిసేపట్లో నేను మాట్లాడాలి. అయినా నేను అలా చూస్తున్నా. సాయంకాలం అయిదుగంటల సమయం అది. ఆకాశంమీదికి ఎవరో ఎరుపురంగు స్ప్రే చేసినట్లుంది.

సరిగ్గా అప్పుడేమయిందో తెలుసా.

రొప్పుతూ ఓ వ్యక్తివచ్చి సైకిల్‌స్టాండ్ వేసి తలపైకెత్తాడు.

అతనెవరో తెలుసా?

వెంకట్రావ్.

నేను అతనికేసే చూస్తున్నా.

అతను నాకేసి చూస్తున్నాడు.

మా ఇద్దరి నడుమా ఉన్న గోడమీద ఓ తెల్లని బ్యానర్‌మీద ఆ సాహితీ సంస్థ పేరూ, సమావేశం గురించి రాసివుంది. వెంకట్రావ్ అది చదవగలడు. చదివాడనే నేననుకుంటున్నా.

అతను కింద ఉన్నాడు.

మేడమీద నేనున్నాను.





అతనేమనుకుంటున్నాడో నాకు తెలియదు.

నా మనసులో నిర్దిష్టమైన భావం ఉందని చెప్పటానికి కూడా లేదు. అతన్ని చూసి జాలా... నన్ను చూసుకొని గర్వమా. ఇంకేమై నా భావమా? అదేక్షణం పిలిచారు.

అతనలా చూస్తుండగానే నేను లేచివెళ్లా. అంతే అతన్ని మరిచిపోయా. పదినిముషాలే మాట్లాడింది. తిరిగివచ్చి కూర్చున్నా. ఎందుకో అతను గుర్తొచ్చాడు చూస్తే.

దూరంగా కూర్చున్నాడు.

గడ్డిపీకి నోట్లో పెట్టుకుంటున్నాడు.

ఆ క్షణం అతన్ని చూసి నిజంగానే జాలికలిగింది.

సభ అయిపోయింది. మేమందరం దిగి వెళ్లిపోతున్నాం. చీకటి పడుతోంది. అతనింకా అలానే ఉన్నాడు.

నేను దిగివెళ్తూ అతన్ని చూశా. మా ఇద్దరి కళ్లూ కలుసుకున్నాయి. మేమిద్దరం నేలమీదే ఉన్నాం. ఆ క్షణంలో అతను తల దించుకున్నాడు.

నేను నడిచివెళ్లిపోయాను.

అతనెందుకలా తలవంచుకున్నాడు?

పశ్చాత్తాపంతోనా?

తన ఓటమిని అంగీకరించా?

ఏమైనా కావచ్చు. ఈ ప్రపంచాన్ని జయించినంత సంతోషం కలిగింది.

నాకు రైల్లో వెళుతున్నప్పుడు ఏమనిపించిందో తెలుసా?

వాళ్లందరూ గుర్తొచ్చారు.

వారిని పిలిచి ఇలా చెప్పాలనిపించింది.

బాబూ మీరో గొప్ప అనుభవం అందించారు. జీవితంలోని చేదునంతా చూపించారు. ఆనాటి ఆ అనుభవమే ఈనాటి ఈ ప్రయాణం అని.

ఆ రోజుల్లో నా ఏకైకనేస్తం ఎవరో తెలుసా?

దుర్గ...

ఆ అమ్మాయి గురించి నీకు చెప్పింది చాలా తక్కువ.

అసలు మా పరిచయమే అంత స్వల్పం.

కానీ అది ఇంత గాఢం అని నేననుకున్నానా?

లేదు.

ఆ అమ్మాయి ఒక్కపూట రాకపోతే నేను అల్లాడిపోయేవాడిని. సాయంకాలం పూట పూలబుట్ట తీసుకొని ఊరంతా తిరిగే పూలకుర్రాణ్ణి చూసినప్పుడల్లా ఆ అమ్మాయి గుర్తుకువచ్చేది. అప్పట్లో ఆ అమ్మాయి చాలా చిన్నది. అయినాసరే తనని చూస్తుంటే నాకెందుకో తెలియని తన్మయత్వం కలిగేది.

సరోజా నా జీవితంలో నేను ఇంతవరకూ ఎవరినీ ప్రేమించినట్లుగా నీకు చెప్పలేదు. ముందు నాకలాంటి ధైర్యంలేదు. అంతగా అయితే ఎవరినన్నా చూసి కోరిక పెంచుకున్నానేమో... అది అంగీకరించటానికి నేనేం సిగ్గుపడటంలేదు. అయితే నేను నా కోరికలన్నింటినీ చిన్నతనంనుండి మనసులోనే దాచుకుంటున్నాను. సరోజా! ఇంతవరకు నువ్వు తప్పించి మరో స్త్రీతో నాకు ఏవిధమైన బంధంలేదు. అంటే మానసికపరమైన కోరిక ఎప్పుడూ కూడా శారీరకంగా మార్పుచెందలా.

అయితే నేను దుర్గని ప్రేమించాను.

నిజంగానే ప్రేమించాను.

ఇన్ని సంవత్సరాల తర్వాత ఈ విషయం నాకు ఇప్పుడే అర్థమైందంటే నమ్ముతావా? ఖచ్చితంగా చెప్పాలంటే కొన్ని సంవత్సరాల వరకూ ఆ అమ్మాయి నా ఆలోచనల్లోలేదు. ఆరోజు బాలకృష్ణ మాస్టారింట్లో చూశాక కూడా నేను గుర్తించలేదు. అంతకాలంపాటు నేనంత గాఢంగా ప్రేమించిన ఆ అమ్మాయి నాకెందుకు గుర్తుకు రాలేదు?

మనసు చాలా చిత్రాలు చేస్తుంటుంది.

మరి ఇప్పుడు నాకు ఆ అమ్మాయిమీద కలిగిన ప్రేమ ఎలాంటిది

నిజం చెబుతున్నా సరోజా.

ఆ ప్రేమలో కోరిక లేదు.

కోరికలేని ప్రేమ ఉంటుందా అని నీకు అనిపించవచ్చు. ఉంటుందని నేననుకుంటు న్నా.

చెప్పాగా. ఆరోజు నేను దెబ్బలుతిని భారంగా అడుగులు వేస్తున్నప్పుడు దుర్గ ఓ పాట పాడింది. అది నా కోసమే అనుకున్నా.

మా నడుమ ఇప్పుడు మాటలూ ఉత్తరాలూ ఉన్నాయిగానీ అప్పుడున్నది మాత్రం నిశ్శబ్దమే.

మరి ఆ అమ్మాయి సైతం ఇన్ని సంవత్సరాలు నన్ను గుర్తుంచుకుంది. అదే ఆశ్చర్యం నాకు. నేను ప్రయాణం చేస్తున్నప్పుడు ఇవే ఆలోచనలు.

నా సంగతి అలా ఉంచు.

చాలాకాలం క్రితం ఈ దుర్గ కూడా ఇలానే మద్రాసు బండి ఎక్కింది. ఆరోజు ఆమె చెంతన ఒక్క ముసలమ్మ ఉంది. తనను పంపించటానికి ఎవరూ ముందుకు రాలేదు. అసలు వెళ్లి ఏం చేయాలో తెలియదు. అదో ప్రయాణం అంతే.

మరి ఈరోజు నా ప్రయాణం వెనక మీరందరూ ఉన్నారు.

మీ ప్రేమ ఉంది. నమ్మకం ఉంది.

అంతకంటే మించి 'దుర్గ ఉంది.

మద్రాసు నగరంలో ఆమె ఏం కోల్పోయిందో నాకు తెలుసు. ఆమె హృదయం ఎంతగా గాయపడిందో నేను అర్థం చేసుకోగలను.

ఆ అమ్మాయికి ఎన్నిరోజులనుండి అలాంటి ఆలోచన ఉందో నాకు తెలియదు. తిరిగి నన్ను చూడగానే ప్రతిస్పందించింది.

నేను నీకు వచ్చేముందు ప్రేమలేఖ రాస్తానని చెప్పానుకదూ.

కానీ నీకు అంతా దుర్గ గురించి మాత్రమే రాస్తున్నాను. ఈ విషయం నాకూ తెలుసు. అయితే నువ్వు నన్ను అర్థం చేసుకుంటావని నాకు తెలుసు. నా జీవితం ఓ కొత్తమలుపు తిరిగినప్పుడు జరిగిపోయిన కాలాన్ని సమీక్షించుకోవటం అవసరం అని నేననుకుంటు న్నా. అలా అలా అల్లరిగా తిరిగిన నేను- కథలూ, కబుర్లూ చెప్పిన నేను ఈ రోజున ఇక్కడికి వచ్చాను. ఇప్పుడు నా దృష్టి అంతా నేర్చుకోవటంమీదే ఉంది. నా వర్క్ ఆరంభం అయింది. అంతా కొత్త యూనిట్.

అయితే సంతోషం కలిగించే అంశం ఏమిటంటే వీళ్ళందరూ మంచి అభిరుచి ఉన్న కుర్రాళ్లు. నేర్చుకుంటానికి ఉత్సాహం చూపిస్తున్నవాళ్లు. మేమందరం చాలా స్నేహంగా ఉంటున్నాం. రేపు వీళ్ళలో కొందరిని మన కార్యక్రమంలో వినియోగించుకోవచ్చునని నాకు అనిపించింది. వాళ్లు మా ప్రయత్నాన్ని అర్థంచేసుకున్నారు. మేం షూటింగ్ లేనప్పుడు వివిధ విషయాలమీద మాట్లాడుకోవాలనుకున్నాం.

ఇంక నేను మద్రాసులో ఉన్నప్పుడు మాత్రం దుర్గావాళ్ళింట్లో ఉంటా. మేం త్వరలోనే ఔట్‌డోర్ వెళ్తున్నాం. ఈ సినిమా అంతా ఎక్కువగా బయటే తీయటం జరుగుతుంది. అందుకే నువ్వు ఉత్తరాలు దుర్గ అడ్రసుకే రాయి. తను వాటిని నాకు అందేలా చూస్తుంది. పిల్లలు ఎలా ఉన్నారు. బాగా చదువుకుంటున్నారా? రాత్రి పడుకోబోయేముందు మాత్రం మీ అందరూ గుర్తుకువస్తారు. కొంచెంసేపు మీ గురించిన ఆలోచనల్లో కాలం గడుపుతాను.

ఉదయం లేచిందగ్గర్నుండి అంతాపనే.

అప్పుడు మాత్రం మనసంతా దానిమీదే కేంద్రీకరిస్తాను.

వీలయితే నడుమ ఓసారి వస్తాను. లేదా ఒకేసారి సినిమా పూర్తయ్యాక బయలుదేరివస్తాను- సరేనా!

నీ

రాఘవ

  





మూడునెలలకాలం అయిపోయింది.

అనుకున్నవిధంగానే సినిమా అయిపోయింది. రీరికార్డింగ్, మిక్సింగ్‌లాంటి కార్యక్రమాలు ఆరంభం అయ్యాయి.

రాఘవ తమ చిత్రానికి కథ రాయటం పూర్తిచేశాడు.

ట్రీట్‌మెంట్ కూడా రాసుకుంటున్నాడు.

ఆరోజు రాత్రి దుర్గతో కూర్చున్నాడు.

"నేను కథ చెబుతున్నా. సాంతం అయ్యాక నీ అభిప్రాయం చెప్పు'' అన్నాడు రాఘవ.

దుర్గ తలూపింది.

రాఘవ అక్కడకూడా కొన్ని సన్నివేశాలు వివరంగా చెప్పాడు. కథంతా పూర్తయింది.

దుర్గ రాఘవని తన్మయత్వంతో చూస్తోంది.

"ఏమిటలా చూస్తున్నావ్. కథ బాగుందా? లేదా?" అన్నాడు.

తల అడ్డంగా ఊపింది.

"మరి''

"మీరు ఎంత బాగా నటిస్తున్నారు?"

"నేను నటించటం ఏమిటి?"

"అవును... ఆ సంఘటనల్ని మీరు వివరిస్తున్నప్పుడు ఏ మంచి దర్శకుడు చూసినా మిమ్మల్ని వదిలిపెట్టడు''

"అది సరే. ఇంతకూ కథ..."

"కథ కాదు మాస్టారు... జీవితం"

"పాత్రలు''

"అవును. అవన్నీ ఎక్కడినుండి తీసుకున్నారు. మీనుండి. నానుండి, మన చుట్టుపక్కలనుండి. నిజం ఈ సినిమా మీరు సరిగ్గా తీయగలిగితే తన్మయత్వం చెందుతారు. కన్నీరు కారుస్తారు. ఇంకా ఏదో చెప్పలేని ఎమోషన్‌కి లోనవుతారు. నాకు ఎలా ఉందని చెప్పాలంటే చాలా ఇబ్బందిగా ఉంది.

"మరి నువ్వు ప్రాణం పోయాల్సిన పాత్ర అది''

"మరోసారి ఆలోచించండి. ఎవరికైనా ఈ పాత్రను ఇద్దాం"

"నో... నేను అంగీకరించను''

దుర్గ మాట్లాడలేదు.

"కొన్ని పాత్రలకా శాశ్వతత్వం ఎందుకొస్తుందో తెలుసా? అవి పోషించిన తారలవలన. అవి వారికోసమే సృష్టించబడ్డాయా అనిపిస్తుంది. ఆ పాత్రల్లో ఉన్న ఘర్షణను వారు ప్రతిబింబించగలగటానికి కారణం వారి జీవితాల వెనక విషాదాలేవో ఉంటాయి. లేదా ప్రేరణలుంటాయి. అందుకే నీకోసం నేను సృష్టించుకున్న పాత్ర అది. కాదనకు''

"మాస్టారూ... నాకు భయంగా ఉంది'' అంది.

"ఎందుకు?"

"ఇప్పటివరకూ నేను నటించలేదు. అదంతా అంగాంగప్రదర్శన. అలాంటిదాన్ని నన్ను నటించమంటున్నారు. అందులోనూ మీరు చాలా ఆశలు పెంచుకున్న పాత్ర అది. అంతేకాదు మాస్టారు జీవితంలో మనం ఏ పాత్రనయితే పోషిస్తున్నామో, దాన్నే కెమేరా ముందుకు వచ్చినప్పుడు పోషించటంలో విఫలం కావచ్చు. అదే సమయంలో అలాంటి అనుభవం లేకపోయినా కూడా గొప్పగా నటించేవారున్నారు''.

"నీతో నేను ఏకీభవిస్తా. అయితే నా పాయింట్ ఏమిటంటే నటన వేరు, జీవితం వేరు కాదు కొన్ని అంశాల్లో. జీవితానుభవం ఉన్న తారలయితే పాత్రలకు కొత్తరూపం తెస్తారు. దుర్గా నువ్వు నటివి. జీవితంనుండి వచ్చినదానివి. అనుభవాల్తో నలిగిపోయినాదానివి. నువ్వు నటిస్తే పేజీలకు పేజీలు మాటలు రాయనవసరంలా. నీ కళ్లలో. సవాలక్ష భావాలు పలుకుతాయి. నీ పెదవులు కదలనవసరంలా. నీ భృకుటి ముడిపడితే చాలు. నీ కళ్లు అరమోడ్పులయితే చాలు. శబ్దం తక్కువగా ఉంటుంది. కానీ ఆ భాష మాత్రం నిన్ను అర్థంచేసుకోవటానికి ఉపయోగపడుతుంది.

"నా గురించి మీరు చాలా ఎక్కువగా ఊహిస్తున్నారు''

"లేదు లేదు... అలాంటిదేం లేదు. నా ఊహ తప్పుకాదు. చూస్తుండు. రేపు నేను ప్రూవ్ చేస్తాను''

"నాకు భయంగా ఉంది''

"ఎందుకు?"

"మీ ఊహలమేరకు నటించగలనా అని''

"నీకలాంటి ఆలోచన రానీయకు. నువ్వు చాలా బాగా నటిస్తావు. నాకా నమ్మకం ఉంది. నేను సెంటిమెంట్ కోసం ఇవ్వటంలేదు. ఈ పాత్రని నీకంటే ఇంకెవరైనా బాగా చేయగలరు అనిపిస్తే వారికే ఇచ్చేవాణ్ణి. నాకు అలాంటిది అనిపించలా. మరెందుకని నేను రిస్క్ తీసుకోవాలి?"

"అది రిస్క్ అంటారా?"

"అంతే... నువ్వు మాత్రమే నేను ఊహించినట్లు చేస్తావ్. అంతేకాదు, నీతో నాకు ఎలా కావాలంటే అలా చేయించుకునే స్వేచ్ఛ ఉంది. నువ్వేకాదు. ఈ సినిమాలో నటించేవారంతా అలాంటి వ్యక్తులే అయివుంటారు''

"ధన్యురాల్ని'' అంది దుర్గ.

"ఇంక నేను బయలుదేరతాను. ఇంటిమీద గాలితిరిగింది. సరోజను చూడందే క్షణం అయినా నిలవలేను. పిల్లలిద్దరినీ హృదయానికి హత్తుకొని ఒక్కరోజంతానిద్రపోందే నా తృప్తి తీరదు''

దుర్గ నవ్వుతూ అంది.

"అదృష్టవంతులు''

"ఎవరు?"

"సరోజగారూ, పిల్లలు''

"కాదు దుర్గా... నేను అదృష్టవంతుణ్ణి''

దుర్గ కొద్దినిమిషాలపాటు మాట్లాడలేదు.

"రేపే నేను పత్రికలవారిని పిలుస్తాను''

"పిలిచి..." అన్నాడు.

"ఈరోజునుండి సెక్స్ పాత్రలు ధరించటం మానేస్తున్నానని చెబుతాను''

"గుడ్... నీకు కబురు చెయ్యగానే బయలుదేరివస్తావుగా''

"తప్పకుండా''

"మరి నేను బయలుదేరతాను''

దుర్గ లేచింది...

సెంట్రల్‌స్టేషన్‌లో వీడ్కోలు చెబుతూ అంది.

"త్వరలోనే మనం మన సినిమా ప్రారంభిస్తున్నాం''

★ ★ ★

రాఘవ సినిమా పత్రికలన్నీ ముందు వేసుకొని కూర్చున్నాడు. పత్రికలన్నీ దుర్గ ప్రకటనను ప్రముఖంగా ప్రచురించాయి. ఓ పత్రిక అయితే ఏకంగా ఇంటర్వ్యూనే ప్రచురించింది.

"మీరు ఇప్పటివరకూ పోషించిన పాత్రలు ఇకనుండి ధరించనంటానికి కారణం ఏమిటి?"

"చాలా కారణాలున్నాయి''

"మరి ఎలాంటి పాత్రల్ని మీరు ధరించాలనుకుంటున్నారు?"

"నాకు నచ్చిన పాత్రలు''

"అంటే ఎలాంటివని మీ ఉద్దేశం"

"ఖచ్చితంగా ఇప్పుడున్న పాత్రలలాంటివి మాత్రం కాదు''

"కొంచెం వివరంగా చెప్పకూడదూ''

"వివరంగా చెప్పేటంత అద్భుత పాత్రల సృష్టి అంటూ ఇక్కడలేదు. ఎవరో ఒకరిద్దరు ఏ పుష్కరానికో ఓ మంచి పాత్ర సృష్టిస్తారు. చాలు ఈ దశాబ్దానికి ఆ తృప్తిచాలు. మన సినిమాల్లో మంచి పాత్రలు సృష్టించాలన్న తపన చచ్చిపోయి చాలాకాలమైంది. ఇప్పుడు నటి శరీరం తప్ప ఇంకేం అవసరంలేదు''

"ఇంతకాలం మీరు అవే పాత్రలు పోషించారుకదా''

"అవును...పోషించాను. అది ఇప్పటివ




రకూ అవసరం. ఇకనుండి అలాంటి పాత్రలకు పూర్తిగా వ్యతిరేకం నేను''

"ఎవరు ధరించినా?"

"నేను అలా అనటంలేదు. నా గురించి నేను మాట్లాడుతున్నా. జీవితంనుండి తీసుకునే పాత్రలని పోషించాలని ఎంతోకాలంగా ఆరాటపడ్డాను. ఎంతో ఆశగా నిరీక్షించాను. ఉపయోగంలేదు. ఇక్కడంతా దారుణంగా తయారయింది. ప్రపంచంలోనే మన భాషలో సినిమాలు ఎక్కువగా తీస్తారు. వెనక్కి తిరిగి చూసుకుంటే ఏమీ మిగలవు. అయినా కథ గురించి కాసేపయినా ఆలోచించని వీరు...కాస్ట్యూమ్స్ గురించి చర్చించే సమయంలో సగం అయినా కేటాయించని వీళ్ళనుండి నేను ఇంక ఆశించే స్థితిలో నేను''

"అయితే నటిగా మీరు అదృశ్యం అవుతారా?"

"అలా ఎందుకు అనుకోవాలి?"

"మీరు కోరిన పాత్రలు మీకు లభించాలికదా''

"వాటికోసం ఎదురు చూస్తాను. రోజులన్నీ ఇలానే ఉంటాయని నేను అనుకోవటం లేదు''

"మీరిలా ప్రకటిస్తున్నందువల్ల కోపం తెచ్చుకున్నవారు మీకు తలపెట్టే హాని గురించి మీరు ఆలోచించరా?"

"ఏం చేస్తారు-నాకు పాత్రలివ్వరు. అంతేగా. నేను అలాంటిదానికి తయారయ్యే ఈ నిర్ణయం తీసుకున్నాను. అయినా ఇక్కడ అంత కోపం తెచ్చుకునే గొప్పవారు లేరు. తెచ్చుకుంటున్నారంటే అర్థం- ఏదో చేసిచూపించాలి. మనవాళ్లకి విజయం తప్పించి ఇంకోటి అవసరంలేదు. అయినా మమ్మల్ని ఈ ప్రపంచం అంతా పొగడటంలా. ఒకటికాదు... రెండుకాదు...ప్రతిరోజూ విమర్శలు వస్తూనే ఉన్నాయి. అయినా ఎవరు లెక్కచేశారు?"

"మంచి మార్పుకోసం మీరేం చేయాలంటారు?"

"మేం ఆ విషయం గురించే ఆలోచిస్తున్నాం. ప్రస్తుత పరిస్థితులకు ఓ షాక్ ట్రీట్మెంట్ ఇవ్వాలి''

"అంటే త్వరలో మీనుండి సంచలనాత్మక వార్త వినవచ్చా?"

"అది ఓ వార్త మాత్రమే. సంచలనం అని నేను అనుకోను''

"చెబుతారా?"

"ఇపుడుకాదు, సమయం రావాలి''

"ఇంకా ఏమైనా చెబుతారా?"

"అవును...చెబుతాను. ఓ ఆడపిల్ల ఎందుకు మెడిసిన్ చేయాలనుకుంటుందో, ఎందుకు ఇంజనీర్ కావాలనుకుంటుందో, ఎందుకు మరో వృత్తి స్వీకరించాలనుకుంటుందో అంత హాయిగా నటించటానికి ముందుకు రావాలి. కళకోసం బతుకుతున్నామనే వారెవరైనాసరే-తమ పిల్లల్ని ఆడపిల్లల్ని... నటించటంకోసం పంపాలి. ఇంకా చెప్పాలంటే ఇపుడు వీళ్ళు మా చేత ఎలా నటింపచేయాలనుకుంటున్నారో అలా వారికి చెందిన ఆడపిల్లలతో చేయించగలరా?"

"మీరు నటించనంటే వారేం కాదనలేరుగా''

"నేనూ అదే అడుగుతున్నా.... ఓ మనిషిని చంపితే లక్షలిస్తామంటారు. మరి వీరందరూ ఆపని చేయగలరా?"

"అదీ ఇదీ ఒకటి కాదు''

"నేను చెబుతున్నది కూడా అదే. సినిమా అంటే వ్యాపారమేకాదు. ఎవరినయినా అలా నటించే పరిస్థితికి ఎందుకు నెట్టాలి. అదే అవసరం అనుకుంటే, అదే డబ్బు తెస్తుంది అనుకుంటే నీ పిల్లలని ఎందుకు ఉపయోగించుకోవు. ఈ ప్రశ్నలు అడగాలి. నేను అడుగుతున్నా-ఇంకా ఎంతకాలం ఈ దరిద్రం? ఎక్కడనుండి తెస్తున్నారు ఈ పాత్రలు... ఈ హింస-ఏప క్యాసెట్లనుండి...చెప్పండి...ప్రజలకు చెప్పండి. ఇంకా




ఇలాంటివి ఎల్లకాలం సహించరు''

"ఈ అభిప్రాయాలన్నీ మీవేనా?"

"అవును... నావే. ఇంకా కొంతమందివి కూడా. మంచి భావాలున్నవారంతా ఏకం కావలసిన అవసరం వచ్చింది''

మా పాఠకులకు ఏమైనా చెప్పదలచుకు న్నారా?"

"అవును... మీరు మంచి సినిమాలకోసం చూడండి. మీకు నచ్చని చెత్తను వెనక్కి పంపించండి. అపుడు జాగ్రత్తపడతారు''

ఈ రకంగా సాగింది చర్చ. కాగా శ్రీదుర్గ త్వరలోనే సంచలనం కలిగించే వార్తను మనకు అందిస్తుందని ఆశించుదాం" అని రాసిందా పత్రిక.

రాఘవ మరలా మరలా చదివాడు. ఆ ఊపులోనే అందరూ చదివారు.

"ఇంతకుముందే ఆ అమ్మాయంటే నాకు గౌరవం ఉంది. అయితే ఆ అమ్మాయిలో ఇంత వేదన ఉందని తెలియదు. అంతదాకా ఎందుకు మనకు సంబంధంలేని, మనకు ఇబ్బంది ఎదురవని విషయం మీదకూడా ఓ అభిప్రాయం చెప్పటానికి మనం వెనకాడ తాం. అలాంటిది ఆ అమ్మాయి ఎంత చక్కగా చెప్పింది. నిజంగా ఆ అమ్మాయి ప్రకటన చూసి మన వాళ్లు కోపం తెచ్చుకోగలిగితే ఎంత బాగుంటుంది'' అంది.

"తెచ్చుకుంటారు. గానీ తెచ్చుకోవలసిన కోపం కాదు. కొంతమంది మనం తీయబోయే సినిమాకు ఆటంకాలు కల్పిస్తారేమో''

"ఎవడయ్యా వాడు కల్పించేది. ఈ సిని మా ఫీల్డ్ ఏ ఒక్కడిదీ కాదు. ఇదివరకటి రోజులు కావివి''

"అదిసరే మాస్టారూ మీకింతవరకూ చెప్ప లేదుకదా. మీరు మా సినిమాలో నటిస్తున్నా రు''

"నేనా?"

"అవును మీరే. విరగదీసేస్తారంతే'

"నిజమా?" అన్నాడు ఆయన నమ్మలేనట్లు గా.

"అవును... మీరు మా సంస్థని ఓ కంటితో చూడాలి'' అన్నాడు రాఘవ.

"ఇప్పుడు విరగదీశావయ్యా'' అన్నాడు బాలకృష్ణ.

"నీకు ఇంకో విషయం చెప్పాలయ్యా. ఇది మా మాస్టార్లమీద జోకే. ఓ మాస్టారు ప్ర తిరోజూ లేటుగా వస్తాడు. హెడ్‌మాస్టారి దగ్గర కెళ్ళి ఓరగా చూస్తూ ఏం చెప్పేవాడంటే...

అయ్యా క్షమించండి. ఈరోజు కూడా లేట్ అయిపోయింది. తప్పి చావటంలా. నాకు చాలా సమస్యలున్నాయి. నన్నోకంటితో చూ డాలి మీరు'' అని.

"ఇందులో విశేషం ఏముంది?" అంది ప్రేమ.

"ఆ హెడ్‌మాస్టారికి ఉంది ఒకటే కన్ను''

అందరూ పగలబడి నవ్వారు.

"మాస్టారూ మీ పాత్ర కూడా ఇలాంటిదే. ఇలానే హాయిగా నవ్విస్తూ, నవ్వుతూ, హడావు డి పడుతూ, విరగదీస్తూ.

"నీ ఇష్టం బాబూ... తమరు ఏం చేయ మంటే అది చేస్తాం. వెండితెరమీద మాత్రం నా పేరు రావాలి''

"అంతేకాదు మాస్టారూ... మనం దుర్గ ప్రకటనని ఆమోదించుదాం. ఈ సినిమాలో ప్రేమా, సరోజలు కూడా నటిస్తారు'' తాపీగా అన్నాడు రాఘవ.

ఇద్దరూ ఆశ్చర్యపోయారు.

"నేను... నాకేం వచ్చు?" అంది సరోజ.

"అదంతా నేను చూసుకుంటానుకదా'' అన్నాడు.

ప్రేమకయితే చాలా థ్రిల్లింగ్‌గా ఉంది.

"ఇంకా ఏమైనా బాంబులు పేల్చబోతున్నా వా?"

"మీ ఇద్దరిదే విశేషం- ఇంకా చంద్రం, డాక్టర్ భరద్వాజ కూడా నటిస్తారు. అయితే

మీవి దీర్ఘమైన పాత్రలు కాదు. మీరంతా కంగారు పడవలసిన అవసరంలేదు''

"కంగారేంపడం. నువ్వు ఎలాంటి పాత్ర ఇచ్చినా మాకేం భయంలేదు'' అంది ప్రేమ.

అందరూ ఒకరికేసి ఒకరు చూసుకుంటు న్నారు. గానీ ఎవరూ మాట్లాడటంలేదు.

"మనం చంద్రంగారిని పిలవాలి'' కాసేపాగి అన్నాడు రాఘవ.

"లెటర్ రాసేయ్''

"ఆయనతో పాటలు రాయించాలి. ఈలోగా నేను ఓసారి డాక్టర్ భరద్వాజని కలిసివస్తా ను'' అన్నాడు రాఘవ.

★ ★ ★

"అయిపోయిందా?" అన్నాడు భరద్వాజ.

"అయింది''

"కాన్ఫిడెన్స్ వచ్చిందా?"

"ఫర్వాలేదు. అదో మహాసముద్రం"

"ప్రారంభం ఎప్పుడు?"

"ఆ విషయం మాట్లాడుదామనే వచ్చాను. మీ దృష్టికి దుర్గ ప్రకటన వచ్చిందా?"

"అవును. చూశాను. మంచి టైంలో ఇచ్చిందా ప్రకటన"

"మనం ఈ సినిమా ఆరంభించేటప్పుడు మీకున్న పరిచయాల్ని వినియోగించుకోవాల నుకుంటున్నా''

"ఏవిధంగా''

"మీకు బెంగాల్‌కి చెందిన తారలు తెలుసు నంటున్నారుగా. వారిని ఆహ్వానించుదాం. ముందో సెమినార్ కండక్ట్ చేద్దాం. అది నేటి సినిమాకు చెందిన వివిధ విషయాలను చర్చి స్తుంది. అదేరోజు అంటే సెమినార్ పూర్తవగా నే. అందరి సమక్షంలో మన సినిమా తొలి షాట్ చిత్రీకరిస్తాం"

"బాగుంది''

"సో... మనం వారి డేట్స్ బట్టి కార్యక్రమా లు నిర్ణయించుకుందాం"

"మిగతావన్నీ పూర్తయినట్లేనా?"

"ఇంకాలేదు. ఆ విషయాలన్నీ దుర్గని ఫైన లైజ్ చెయ్యమని రాశాను. హడావుడి పడేవారె వరూ ఈ యూనిట్‌లో ఉండరు. తాపీగా ఆడుతూ, పాడుతూ తీసుకుంటూపోవటమే. అంతేకాదు... ఈ చిత్రంలో మీరు కూడా ఓ చిన్నపాత్రని పోషించాలి''

"అంటే డాక్టరిని యాక్టర్‌గా చేస్తున్నారన్న మాట"

"సినిమారంగానికి చెంది అది మామూలు విషయమేకదా'' అన్నాడు నవ్వుతూ.

"కథ తయారయిందా?"

"మొత్తం ట్రీట్‌మెంట్ కూడా రాసుకున్నా ముందే అనుకున్నట్లుగా ఇదేదో విప్లవాత్మక సినిమాకాదు. రొటీన్‌కి భిన్నంగా ఉంటుంది. అయితే స్త్రీకి చెందిన కొన్ని సమస్యలు వేదిక మీదికి తెస్తున్నాం. చిత్రీకరణలో కూడా పాత పద్ధతులుండవు. ముఖ్యంగా విజయం కోసం పాత్రల్ని మార్చటం అంటూ ఉండదు''

"ఎవరైనా అడిగితే ఇస్తారా?"

"ఆ విషయం గురించి ఆలోచించుదాం. మనం ముందు దాన్ని పూర్తి చేయగలగాలి. ఆ తర్వాత ఏం చేయాలా అనేది ఆలోచించు దాం"

"బాగానే ఉంది. నేను వెంటనే వారిని కాంటాక్ట్ చేస్తా. ముందు 16 ఎం.ఎం. స్క్రీన్... ప్రొజెక్టర్‌లాంటి వాటి గురించి కూడా వివరాలు సేకరిద్దాం"

"మొదటి సినిమాకు చెందినంతవరకూ వీడియో కెమేరాతోకాక, మామూలుగానే పోవా లనుకున్నాం"

"అలాగే''

"ఇకనుండి నేను రాను. ఫోన్ ద్వారా మీతో మాట్లాడతాను'' అన్నాడు రాఘవ.

"అలాగే. మనం మన కర్తవ్యం నిర్వ హించుదాం"

"మరి నేను బయలుదేరనా?"




భరద్వాజ ఆప్యాయంగా చేయినొక్కి వదిలాడు.



రాఘవ మద్రాసు వెళ్ళగానే ఇంటిదగ్గరే ఉంది దుర్గ.

"ఏమనుకుంటున్నారు?"

"నవ్వుకుంటారు. అంతే"

"అంతేనంటావా?"

"అంతకుమించి ఏం చేస్తారు?" అంటూ ఓ పత్రిక తీసింది.

"ఇది చదవండి'' అంది.

"సెక్సునటి అహంకారం" అని ఉంది.

"నేను చదవన్లేగానీ ఇంతకూ ఏమంటాడు?"

"చాలా మంచి సినిమాలు వస్తున్నాయంట. వాటికేసి చూడగలిగే ధైర్యం నాకు లేదంట. మనవాళ్ళందరూ చాలా గొప్ప దర్శకులంట. ఆ రకంగా రాసుకొచ్చాడు''

"మంచిదేకదా. ఇంక మనం కార్యక్రమం ఆరంభించాలి. టెక్నీషియన్స్ గురించి మనం నిర్ణయించుకుంటే బాగుంటుందని వచ్చాను''

"అలాగే' అంది దుర్గ.

"అది సరే. నీ ప్రకటన చదివి ఒక్కరయినా అభినందించలేదా?"

"ముందో దర్శకుడు ఫోన్‌చేసి బాగా చెప్పావమ్మా'' అన్నాడు.

"మీరేమైనా హర్ట్ అయ్యారా?" అన్నా.

"ఎందుకమ్మా హర్ట్ కావటం. ఉన్నమాటన్నావ్. మేం నాలుగురాళ్లు వెనకేసుకోవడంకోసమే వచ్చాం. అంత ఆవేశపడేంత గొప్పవాటిని మేం సృష్టించలేదు. సృష్టించినవాడు ఎటూ ఆవేశపడడు'' అన్నాడు.

"ఫర్వాలేదే''

"ఏమో ఎలా చెప్పటం. మనముందు అలానే చెబుతారు. ఏమో రేపు నేనే ఏదో సంచలనం సృష్టించవచ్చు. చూశావా నేను ముందే చెప్పానుకదా అనటానికి ఎప్పుడూ ఆస్కారం ఉంటుంది. మన వెనకాల రకరకాలుగా మాట్లాడవచ్చు. అందుకే ఇక్కడ మనం పొంగిపోనవసరంలేదు. కృంగిపోనవసరంలేదు. అయినా నేను ముందు ఈ పాత్రలు నటించను అన్నంతవరకే చెప్పి ఆగిపోవాలనుకున్నా. అయితే అతను తీగంతా లాగాడు. నన్ను కంట్రోల్ చేసుకోవటం నాకు సాధ్యం కాలా''

"ఇప్పుడేమైందిలే. మొత్తంమీద మంచికే జరిగింది. ఇంక ఇందులో నటించేవారి విషయం కూడా అనుకున్నాను. లోకల్ టాలెంట్‌ని వినియోగించుకుందామనుకున్నాను. ప్రేమా, సరోజా కూడా కొన్ని పాత్రలు పోషిస్తారు. అంతా అనుకున్నట్లుగా జరిగితే మనం ఇంక పూర్తిగా ఆ ప్రపంచంలోకి వెళ్లినట్లే''

"సరే. మనకి ప్రొడక్షన్ మేనేజర్ కావాలి. ఆ పని కూడా ఎవరికో అప్పచెప్పటం ఎందుకు. మన సరోజగారిని చూడమందాం. పైన మనం ఎటూ ఉంటాం. సాధారణంగా మనందరం ఎక్కడికైనా వెళ్తేసరి. లేకపోతే వంట కార్యక్రమం కూడా మనదే. అంతగా అయితే ఓ ఇల్లు అద్దెకు తీసుకుందాం. నెలరోజులపాటు హాయిగా కాలం గడపొచ్చుకదా''

"అలాగే''

"అంటే ఏంలేదు. ఇదేదో మహత్తరమైందనే భావన కలగకూడదు. ముందు మనం అది నమ్మాలి. వేసవికాలం శెలవులకు అందరూ

ఓచోట కలిసినట్లుగా మనందరం ఎవరి పనులు వారు విభజించుకోవాలి. ఆహారంగానీ, ఇతర విషయాల్లోగానీ మన పద్ధతులు ప్రత్యేకంగా ఉంటాయి. రేపు ఎవరన్నా మనల్ని చూసి మీరిదంతా ఎలా చేశారు అని అడిగేలా ఉండాలి. అంటే సాధ్యమైనంతవరకూ మనం ఆదర్శంగా వ్యవహరించాలి. మన టార్గెట్ అంతా అతితక్కువలో సినిమా నిర్మించటం. అంతా ఆశ్చర్యపోవాలంతే''

"అలానే చేద్దాం"

"మన కథ ప్రకారం సెట్టింగ్స్ లేవు. మనకు కావలసిన బిల్డింగ్స్ ఎక్కడ దొరికితే అక్కడకు వెళ్దాం. గ్రామాల్లో అయితే ఇంక చెప్పే పనిలేదు. వాళ్ళే సహకరిస్తారు. షూటింగ్ అయిపోయాక మొదటికాపీ వచ్చేంతవరకూ కూడా మనం చాలా జాగ్రత్తగా డీల్ చేయాలి. ఇంక కొన్ని అనుకోకుండా ఎదురౌవుతుంటాయి. వాటిని అప్పటికప్పుడు ఎదుర్కోవటమే''

"అంతేకదా. సో మనం ఇప్పటివరకూ సంతృప్తికరంగానే ఉన్నాం"

"అవును''

"ముందు ప్రారంభం ఎక్కడైతే బాగుంటుంది''

"మన ఊరుతో మొదలుపెడదామా?"

"వద్దండి'' అంది.

"సరే నీ ఇష్టం. బాలకృష్ణ మాస్టారింట్లోనే ప్రారంభిద్దాం"

"అవును. అలా చేద్దాం బాగానే ఉంటుంది''

"సో ఇకనుండి మిగతా ఏర్పాట్లు మొదలు పెడదాం. దుర్గ అంగీకారంగా తలూపింది.

★ ★ ★

సెమినార్ జరుగుతోంది.

పత్రికల వారంతా అక్కడ సమావేశం అయ్యారు. కళ్యాణమండపంలో నిర్వహించాలనుకున్నప్పుడు బాగా విశాలంగా ఉందికదా సరిపోతుందనుకున్నారు. అయితే వారు ఊహించిన దానికంటే చాలా ఎక్కువమంది వచ్చారు. అందుకు కారణం తారల ఎట్రాక్షన్ కాదు. ఆమాటకొస్తే అక్కడ అంత ప్రముఖతారలు కూడా లేరు''

ఓ రకంగా దుర్గ మాత్రమే ఎట్రాక్షన్.

తను వేదికమీదకు రానని ముందే చెప్పింది. తాను కూడా వింటానికి మాత్రమే వచ్చానని స్పష్టం చేసింది.

బెంగాల్‌నటి హాయిగా మాట్లాడింది.

"ఇండియన్ స్క్రీన్‌కి బెంగాల్ చాలా కంట్రిబ్యూట్ చేసింది. సత్యజిత్‌రేని ఇచ్చింది. 'మృణాల్‌దా' నిచ్చింది. ఎందరెందరో యువదర్శకులు ఈరోజున గొప్ప ఎక్స్‌పెరిమెంట్స్ చేస్తున్నారు. మరి ప్రొడక్షన్‌రీత్యా చూస్తే మీ తెలుగు పరిశ్రమ తక్కువదేం కాదు. సంవత్సరానికి నూటయాభై సినిమాలు వస్తున్నాయి. ఇక్కడ స్టార్‌డం బాగా ఉంది. కాబట్టి ఇక్కడ మంచి మార్పు రావాలి. ఆంధ్రాస్ అంటే మాకు అభిమానం ఉంది. కొన్ని కొన్ని రంగాల్లో ఇక్కడ మీరు చేసిన ఎక్స్‌పెరిమెంట్స్ మేం దృష్టిలోకి తీసుకున్నాం. రాజకీయంగా కూడా ఆంధ్రులది ప్రత్యేక శైలి. మీకిక్కడ ఎందరెందరో మహానుభావులున్నారు. అలాంటి గడ్డమీద ఈరోజు వస్తున్న పరిణామాలు మాకు విచారాన్ని కలిగిస్తున్నాయి. అయితే తిరిగి ఇక్కడ ఓ ప్రయోగం జరగబోతోందని తెలుసుకున్నాక నాకు చాలా సంతోషం కలిగింది.

సినిమా దగ్గరికి ప్రేక్షకులు వెళ్లటం కాదు. ప్రేక్షకుడి దగ్గరికి సినిమా వెళ్ళాలి. మీరిప్పుడు తీయబోయే సినిమా ఆశ్చర్యకరమైనరీతిలో స్వల్ప ఖర్చుతో తీయబోవాలనుకోవటం హర్షించదగింది.

ఇండియన్ సినిమా తన తలెత్తుకుంటుంది. తరచుగా ఈ రంగానికి చెందిన పెద్దలు ఎఫెక్ట్‌కోసం దృశ్యానికో కారు చొప్పున తగలబెడుతున్నాం. అని చెబుతుంటారు. ఇలా దేశంలో సంవత్సరానికి అన్ని భాషల్లో కలిపి




ఈ చలనచిత్ర నిర్మాణానికి ఎన్ని వందలకోట్లు ఖర్చుపెడుతున్నారో మనం లెక్కలు తీసుకుంటే ఓ ఆశ్చర్యకరమైన వాస్తవం తెలుస్తుంది.

ఆ డబ్బుతో సంవత్సరానికో అద్భుతమైన ప్రాజెక్ట్ తయారుచేసుకోవచ్చు. దానివలన లాంగ్ స్టాండింగ్‌లో ఎంతో ప్రొడక్ట్ అవుతుంది. అలా అంటే మనిషి మానసిక అవసరాలు తీర్చకూడదనికాదు. అంత విలువైన డబ్బుతో ఎంత చెత్త ప్రొడ్యూస్ చేస్తున్నారో అర్థం చేసుకుంటేనేగాని సొసైటీకి జరుగుతున్న డామేజ్ అర్థంకాదు.

సోషల్ ఎవేర్‌నెస్ అనేది ఈ రంగానికి కావాలి. అందుకే ఈ మంచి ప్రయత్నంపట్ల మేం మా ఆనందాన్ని వ్యక్తం చేస్తున్నాం.

అదే సమయంలో ఇంకో విషయం చెప్పాలి.

నాకు తెలిసినంతవరకూ తాము ఏరకంగా నటించినా కూడా 'మేమేం చేయాలి. మాకు అలాంటి పాత్రలే వస్తున్నాయి. వాళ్లు నటించమంటున్నారు. మేం నటిస్తున్నాం' అనవలసిన ఓ గ్లామర్ నటి, తనకింకా పుష్కలమైన అవకాశాలు ఉండగానే ఈ రకం పాత్రలు నేను నటించటంలేదు, అని ప్రకటించటం ఓ సంచలనంగానే భావిస్తున్నా. ఇలాంటి వార్తల్ని దేశవ్యాప్తంగా వెలుగులోకి తీసుకురావాలి.

లక్షలాది రూపాయలు తీసుకోవటమే మహత్తరమైన విషయంగా ప్రకటించుకునే నటులు, నటీమణులూ, బాక్సాఫీస్‌లు బ్రద్దలు చేద్దామనుకుంటున్నవారు, చేసినవారూ, చేస్తున్నవారూ అలాంటి వారందరికీ ఈ ప్రశ్న.

"ఈ ఛాలెంజ్‌ను మీరు స్వీకరించగలరా?"

మీరు మంచి పాత్రలు సృష్టించగలరా?

ఓ సెక్స్ చిత్రంతీసి డబ్బులు సంపాదించటంలోనే మీ మెదళ్లు తాకట్టుపెడితే రేపటితరానికి మీ కంట్రిబ్యూషన్ ఏమిటి? మీకు అండగా మేముంటాం. మీరు ఓ పని ప్రారంభించారు. ముందుకు వెళ్ళండి. అంతేకాదు మీతోపాటు మేమూ వస్తాం" అయిదు నిమిషాలదాకా చప్పట్లు ఆగలేదు.

ప్రేక్షకుల్లో ఉండి వింటున్న దుర్గ కళ్లు చెమర్చాయి.

తనకాక్షణం వాళ్ల అమ్మ గుర్తుకు వచ్చింది.

తనే బతికివుంటే ఎలా ఉండేదోగానీ, ఈ మధురక్షణాలు చూసి ఎంతగా మురిసిపోయి వుండేదో.

చాలామంది మాట్లాడారు. అక్కడ ఉన్నవారంతా అలాగే తమ తమ సీట్లకు అతుక్కుపోయారు. వారికాక్షణం ఎంతగా అనిపించిందంటే-

మనం ఎంత హీనమైన స్థితిలో ఉన్నాం. ఎంత చెత్తని ఆదరిస్తున్నాం.

ఎంత చెత్తని మెదళ్లనిండా నింపుకుంటున్నాం. ఎంత చీప్ క్రేజ్‌ని డెవలప్ చేస్తున్నాం. ఎంత నిర్వీర్యం అయ్యాం" అనుకోకుండా ఉండలేకపోయారు.

సభ అంతా అయిపోయాక బెంగాలీ నటి కొత్త సినిమాను ప్రారంభించింది.

తెల్లవారింది.

తెలుగు పత్రికలన్నీ చాలా ప్రముఖంగా ప్రచురించాయి ఈ వార్తని. వ్యాపార ప్రపంచం తలెత్తి చూసింది!

వారికేదో జరగబోతూందని అర్థం అయింది.

అయినా తాము గమనించనట్లుగా ఉండిపోయారు.

కొన్ని పత్రికల్లో అయితే-

"రానున్న అద్భుతం కోసం నిరీక్షించండి" అనే శీర్షికతో ఈ సినిమాపట్ల ఓ వ్యాసం రాయటం జరిగింది.

'దుర్గ'ను విమర్శిస్తూ ఆమె గత చిత్రాల తాలూకు కటింగ్స్ ప్రచురించినవారున్నారు.

ఈ సినిమా ప్రారంభమూ, గతచిత్రాల దృశ్యాలు పక్కపక్కనే వేసి కామెంట్ చేసినవారూ ఉన్నారు.

అదంతా ఓ వారంరోజులు.

అంతే...

తిరిగి పత్రికలన్నింటికీ షురో అద్భుత వార్తలందించింది.

కోట్లాదిరూపాయల బడ్జెట్‌తో తెలుగులో మరో రెండు చిత్రాల నిర్మాణం. ఈ వార్తను కూడా అన్ని పత్రికలూ ప్రచురించాయి.

★ ★ ★

అది 'సినిమా' కంపెనీలా లేదు.

ఆ పాత్రలకు అనవసరమైన మేకప్ లేదు.

ముందు రిహార్సల్స్ జరుగుతాయి. అందరూ డైలాగులు స్పష్టంగా చెబుతారు.

ఆ మాటకొస్తే అవి చాలా తక్కువగా ఉంటాయి.

అందరూ ఇంట్లో మాట్లాడినట్లు మాట్లాడుకుంటారు.

"ఈరోజు ఏం కూరలు వండుకుందాం" అంటుంది సరోజ.

"చారు పెట్టవోయ్'' అంటారు.

"రసం కావాలోయ్'' అంటారు.

"ఎంత హాయిగా ఉందో. ఆ మషాళాలు లేవు. ఆ తేన్పులు లేవు. ఏమైనా వచ్చినా డాక్టర్‌గారు తయారుగా ఉన్నారు. మందు అనే ప్రసక్తి లేదు.

ఆదివారం మాత్రం-

"ఈరోజు స్పెషలేంటి?"

"డబుల్ స్ట్రాంగ్ కాఫీ'' అంటాడు బాలకృష్ణ.

"బాబూ రక్షించండి. బాబ్బాబూ వాసనయినాసరే చూపించండి. లేదా కొంచెంసేపు మిల్ట్రీ హోటల్ వెనకాలకు వెళ్లి వాసన పీల్చుకువస్తాం'' అంటారు కొందరు.

"ఆదివారం గ్రాండెడ్ షో'

"ఏమిటి వాసన పీల్చటమా?"

"కాదు. కోడిని కాఫీలో పేల్చుతారు'' అంటాడు బాలకృష్ణ.

షూటింగ్‌లో ఆలస్యం కావటం ఉండదు.

భరించలేనంత టెన్షన్ ఉండదు.

బీ.పీలుండవు.

డూప్‌లుండరు.

స్టంట్‌మాస్టర్లుండరు.

నృత్యదర్శకులుండరు.

ఎప్పుడన్నా అవసరం అనుకుంటే అప్పుడు పిలిపించుకుంటారు.

ఓ నాటకం రిహార్సల్స్ చేసినట్లుంటుంది.

చకచకా నిర్మాణం జరిగిపోతూంది.

రాఘవకు ఓ పట్టాన సంతృప్తి కలగటంలా.

"చెప్పండి. మీ అందరికీ నచ్చకపోతే ఎలాంటి మార్పులకైనా అంగీకారమే'' అంటున్నాడు.

సినిమాను ఇంత హాయిగా, ఇంత బాధ్యతగా ఇంత అనుభూతితో తీయవచ్చును. అని జనం అనుకోవటం కాదు. ముందు టెక్నిషియన్స్ అనుకుంటున్నారు.

వారందరు కూడా పాత్రల్లో లీనం అయ్యారు.

వాటితోపాటు ఒకటి అయ్యారు.

బాలకృష్ణ నవ్విస్తున్నాడు. సినిమాలోనూ, బయటా...

ప్రేమను గౌరవిస్తున్నారు.

దుర్గను చూసి తన్మయత్వం చెందుతున్నారు.

కళ్ళవెంట నీళ్లు కారుస్తున్నారు.

మరో మహానటి పుట్టింది అనుకుంటున్నారు.

రాత్రిపూట వెన్నెల్లో కూర్చుంటారు. కబుర్లు... ఒకటే కబుర్లు.

దుర్గ మాత్రం రాదు.

తను గదిలో కూర్చుంటుంది.

ఆమె ముందు తన డైలాగ్స్ ఉంటాయి.

వాటిని పలుకుతుంటుంది.

"అమ్మా.... అమ్మా...

నన్నెందుకు పుట్టించావ్?

నీకు స్పృహ ఉందా? నేనంటూ ఈ




ప్రపంచంలోకి రాగలననే స్పృహ ఉందా?

నేను కూడా మంచి భోజనం కోసం కలలు గన్నా.

నేను కూడా సంచి భుజానికి తగిలించు కుని బడికిపోదామనుకున్నా.

నేను సైతం కొత్త గౌను తొడుక్కుందామను కున్నా.

ఎందుకిలా అయ్యాను. నేనెందుకిలా అయ్యాను?

అమ్మా... చెప్పు... ఒక్కసారి చెప్పు''

"సరోజా ఇలారా... బాగా చెప్పానా?"

"బాగానే ఉంది''

"అలా అంటే కాదు''

"మరేం అనాలి''

"చాలా బాగుంది. అనేంతవరకు చెబుతా ను''

"బాగుంది... చాలా బాగుంది''

"ఇక్కడ చూడు. ఈ డైలాగ్ బాగుందా?"

"చదువ్'

"కిటికీ తెరుస్తున్నా''

"వద్దు... వద్దు''

"ఎందుకని?"

"దోమలు వస్తాయి''

"వెలుతురూ వస్తుందిగా''

"బాగుంది'' అంటుంది సరోజ.

"ఏం బాగుంది?"

"అదే... ఇప్పుడు చదివింది''

"వెలుతురొస్తుందంటావా?"

"ఎందుకు రాదూ?"

దుర్గ హాయిగా నవ్వుతుంది.

ఇంకో దృశ్యం.

దుర్గ లేచి అటూ ఇటూ తిరుగుతూ.

చేతిలో కాయితం.

చదువుతుంటుంది.

"వద్దు... నాకీపెళ్ళి వద్దు''

"ఎందుకని? కారణం తెలుసుకుంటాను''

"నాకిష్టంలేదు''

"అదే ఎందుకు?"

"నాకిప్పుడు మోహంలేదు''

"అయితే''

"మోహంలేనిది పెళ్ళి ఎలా అవుతుంది? వ్యభిచారం అవుతుందిగాని''

"ఎంతకాలం ఇలా ఉంటావ్?"

"బతికినంతకాలం"

"అలా మాట్లాడకు''

"అవును... నాలో కోరిక చచ్చిపోయింది. నన్ను ఇలా ఉండనీయండి''

ఇంకో దృశ్యం...

ఈసారి ఎదురుగా రాఘవ కూర్చుంటాడు.

"రెడీనా'' అంటుంది.

"కానియ్''

ఆమె చేతిలో ఫొటోకేసే చూస్తుంది...

"నీకెలా చెప్పాలో అర్థంకావటంలేదు''

"నాకు పెళ్ళి చేస్తానంటూ కూర్చున్నావ్. నిజమే నన్ను చేసుకోవటానికి చాలామంది వస్తున్నారు. అయినాసరే నేను నిన్నటి పాపని కాదు. నాకిప్పుడు కావలసింది పెళ్ళికాదు... ఒకనాడయితే పెళ్ళిపందిట్లో సిగ్గుతో మొగ్గవు తూ తల వంచేదాన్ని. ఇప్పుడలా కాదు''

"అయినా నాకెందుకంటావ్ పెళ్ళి''

"చదువుతున్నావ్... కొంచెం ఆగి చెప్పాలి. ఆ ఎమోషన్ కళ్ళలో కనిపించాలి... కమాన్ చెప్పు''

"నీముందు నేను నోరు విప్పలేను... నా మనసు వివరించకుండా ఉండలేను. నేనిప్పు డు నాలోని భావాన్ని బయటకు పంపలేని నిస్సహాయురాల్ని... నిన్ను నా హృదయ మంతటా నింపుకున్నాననీ, గాఢంగా ప్రేమిస్తు న్నాననీ ఎలా చెప్పను''

"చాలా బాగుంది''

వెన్నెల..

అందరూ కూర్చుంటారు.

బాలకృష్ణ కంఠంనుండి పాట. అప్పటివ రకూ గూడుకట్టుకున్న నిశ్శబ్దం గాజులా బద్ద

లవుతుంది. పొట్టలు పట్టుకుని నవ్వు.

"సరోజమ్మా, కొంచెం కాఫీ''

"రాత్రిపూట నిషేధం మాస్టారూ''

"అది మద్యం తల్లీ''

"కాఫీ అంతే మాస్టారు''

"నటించినందుకు డబ్బులివ్వకపోతే పీడా బోయె, కాఫీ కూడానా''

"మాస్టారూ మీకు డబ్బులే ఇస్తాం"

రోజులు గడుస్తున్నాయి...

"అయిపోయింది. మన సినిమా షూటింగ్ అయిపోయింది''

"అప్పుడేనా?"

"అవును... ఇంక ఇక్కడినుంచి కార్యక్రమం మద్రాసుకు మారుతుంది''

"ఇంత త్వరగానా అయిపోవటం. రేపటి నుండి ఈ ఆనందం ఉండదా? రేపటినుండి మనం కలవటం ఉండదా? ఇదంతా కలేనా? అయ్యో... ఇంత త్వరగా తిరిగి పాత జీవితానికి వెళ్ళాలా?"

"నిరుత్సాహ పడకండి. ఇది ప్రారంభం మాత్రమే... మనం మరలా మరలా కలుస్తాం"

అందరూ కళ్ళు చెమర్చుతుండగా వీడ్కోలు తీసుకున్నారు.

"తిరిగి ఈసారి స్టేజీమీదే కలుద్దాం" అన్నాడు బాలకృష్ణ.

రాఘవ అందరికీ పేరుపేరున ధన్యవాదాలు అందజేశాడు.

వారి రంగం మద్రాసుకు మారింది.

★ ★ ★

రీరికార్డింగ్, మిక్సింగ్‌లాంటి కార్యక్రమాల్ని దుర్గా, రాఘవ దగ్గరుండి మరీ జరిపించారు. ఇద్దరూ తరచుగా చర్చించుకునేవారు అలా అయితే బాగుంటుందా అని. మొత్తంమీద ఇరువురికీ ఏకాభిప్రాయం కుదిరేంత వరకూ అదలా కొనసాగేది.

అప్పుడే రాఘవ మనసులో ఓ ఆలోచన రూపుదిద్దుకుంది. "దుర్గా ఇదంతా పూర్తయ్యాక నువ్వో సబ్జెక్ట్ తయారుచేయాలి. ఏం తీసుకుంటావో అనేది పూర్తిగా నీకే వదిలేస్తున్నా''

"మీరు తయారుచేయరా?"

"లేదు... నువ్వే తయారుచేస్తావు. అందుకు నా సహకారం ఉంటుందనుకో. అది వేరే విషయం. రేపటి సంచలనం ఏమిటంటే ఆ సినిమాకి దర్శకత్వం వహించేది నువ్వు''

"నేనా?"

"అవును... నువ్వే. ఈ సినిమాకి దర్శకత్వం వహించింది ఓరకంగా నువ్వే''

"అదిసరే... మొదటి కాపీ వచ్చాక మనం ప్రివ్యూ చూపించుదామా?"

"నన్నడిగితే మద్రాసులోగాక మరే నగరంలోగానీ వద్దు''

"మరెక్కడ"

"మనం ముందే అనుకున్నాం. మారుమూల ప్రాంతాలకు వెళ్దాం అని''

"మరి మిగతా ఏర్పాట్లు చూడాలికదా!"

"భరద్వాజ ఆ కార్యక్రమంలో ఉన్నారు''

"అయితే ఓపనిచేద్దాం. కనీసం టూరింగ్ టాకీస్ ఉన్నా చాలు''

"అవును అలానే చేద్దాం"

★ ★ ★

మొదటి కాపీ వచ్చింది. సెన్సార్ కార్యక్రమం పూర్తిచేసుకుంది. భరద్వాజ తనకు తెలిసిన ఆఫీసర్‌ని కలిశాడు.

"ఎలా ఉంది సినిమా?"

"ముందా యాక్టర్స్ ఎవరు చెప్పు''

"బాగా చేశారా?"

"ఎంత బాగా చేశారు. ఇంతకుముందు ఎప్పుడూ నేను చూడలేదు''

"వారిలో ఎక్కువమంది నటులు కాదు. అందుకే బాగా చేశారు''





"ముచ్చటేసింది''

"ఇంకా..."

అతను ముందుకు వంగి చెప్పాడు - "జనంలోకి పంపించండి. మీరేం ఫీల్ అవుతున్నారో తెలియదు. నగరాల్లోనూ సక్సెస్ అవుతుంది''

"నిజమా?"

"నాకా నమ్మకం ఉంది''

"మాకిప్పుడు చాలా సంతోషంగా ఉంది''

మొట్టమొదటిసారిగా ప్రివ్యూని అనుకున్న రీతిలో ఓ గ్రామంలో ప్రదర్శించారు. ముందుగా అక్కడ ప్రచారంచేశారు. దాంతో చాలా ఉత్సాహంగా జనం వచ్చారు.

వారందరి అభిప్రాయాలు స్వీకరించారు. ముఖ్యంగా మహిళల్ని చాలా ప్రశ్నలు అడిగారు. సమాధానాలు చెప్పటానికి మొదట్లో సిగ్గుపడ్డారు. తర్వాత వారు హాయిగా సమాధానాలు చెప్పారు.

ఏ సినిమాలు ఎందుకు నచ్చుతాయో అర్థం అయింది కొంతవరకు. ముందు వారందరూ ఆ సినిమాలో నటించిన తారలే. తమముందు నిలబడి, తమతో ఇంత హాయిగా మాట్లాడగలరని ఊహించలేదు. వారంతా తమ అభిప్రాయాలకోసం చూస్తారనీ, తమతో మాట్లాడతారనీ అనుకోలేదు. ఆ గ్రామంలో చదువుకున్న ఓ యువకుడు చాలా ఉత్తేజంతో వచ్చి చెప్పాడు-

"నాకు ఇదో కొత్త అనుభవం. నాకేకాదు మా ఊరికే ఓ కొత్త అనుభవం. ఇప్పటివరకూ సినిమా తారలంటే దేవతలతో సమానం, ఎవరిదాకా ఎందుకు నావరకు నేనే నా అభిమాన నటుడి సినిమాకోసం బ్లాకులో టిక్కెట్లు కొనుక్కొని వెళ్ళాను. వాళ్ళని చూడటంకోసం లాఠీదెబ్బలు తిన్నాను. వారిని దూరంనుండి చూస్తేనే నాకు వెర్రి ఆనందం కలిగేది. అలాంటిది మీరందరూ వచ్చి మాతో ఉండి, ఇక్కడ జనంతో కలిసిపోవటం ఈ ఊరు మరచిపోదు. అంతేకాదు ఇంతవరకు విడుదల కాని సినిమాను ముందుగా మేం చూడగలిగాం అనే విషయం తలుచుకుంటేనే చాలా థ్రిల్లింగ్‌గా ఉంది. ఇంక మిగతావారి సంగతి చెప్పాలా? వారు మిమ్మల్ని తాకి, చర్చించి ఆనందం పొందారు. అదంతా ఓ ఎత్తయితే సినిమావారికి అర్థమయింది, ఇప్పుడు ఎక్కడ చూసినా ఈ సినిమా గురించే మాట్లాడుకుంటున్నారు''

దుర్గావాళ్ళందరూ ఈ అనుభవంతో పరవశించారు.

"మేం ఆకాశంలో మెరిసే తారలంకాదు. మీలోనివాళ్ళం. మీరు మాకోసం పంటలు పండిస్తున్నారు. మాకోసం అన్నీ సృష్టిస్తున్నారు. మరి మీ ఆనందంకోసం మేమూ చేయాలి. ఇదంతా మన ఆనందంకోసమేకాదు, మనం ఇంకా ముందుకు పోవటానికి కూడా'' అన్నారు.

ఈ విషయాలన్నీ పత్రికల్లో వచ్చాయి. ప్రజలందరితో కలిసిపోయినవారి చిత్రాలు ప్రచురించారు. పత్రికలవారు తలుచుకుంటే ఏముంది? వారు ఎంతైనా చేయగలరు.... చేశారు. ఆ ప్రభావం బాగా పడింది.

"ఏమ్మా మాకు నీ సినిమాని చూపించవా?" అని అడగటం మొదలుపెట్టారు.

"ఎందుకు చూపించం? అందరూ చూడటానికే ఈ సినిమా'' అంటూ-

"త్వరలోనే చూపిస్తాం" అంది.

భరద్వాజ ప్రయత్నంమీద బెంగాల్‌లో రెండుచోట్ల ప్రదర్శించారు. మొదటిది తెలుగువారికోసం, రెండవది బెంగాలీయులకోసం. వారందరూ ఈ ప్రయత్నాన్ని హర్షించారు.

"ఇదో మహాద్భుతం అని మేం చెప్పం. కానీ సూటిగా వచ్చి హృదయాల్ని తాకింది. ఈ సినిమా చూసి ఎంతగా నవ్వుకున్నాం - ఎంతగా కన్నీళ్ళు కార్చాం - ఒక్కసారిగా ఆ బాల్యంలోకి జారిపోయాం. ఇదంతా అద్భుతం కాదా అనవచ్చు. కాదు... చాలా సహజంగా ఉంది... ఇదంతా మనదిలా

ఉంది. మీకు మా అందరి సహకారం ఉంటుంది. ఈ చిత్రాల నిర్మాణంలో మా వంతుగా మేం కొంత డొనేట్ చేస్తాం" అన్నారు తెలుగువారు.

"మంచి ప్రయత్నం... ఆ పాట చాలా బావుంది. అందులో మీరు ఏ ఇన్‌స్ట్రుమెంట్ ఉపయోగించలేదు. అయినా కూడా చాలా బాగుంది. మేం బెంగాల్‌లోకి అనువదించాలనుకుంటున్నాం ఆ పాటని'' అన్నారు.

ఆ సినిమామీద జాతీయ పత్రికల్లో సమీక్షలు వచ్చాయి. కెమేరా దుర్గమీదకు ఫోకస్ అయింది.

ఎవరీమె? ఎక్కడినుండి వచ్చింది? ఇంత అద్భుతంగా ఎలా నటించగలిగింది? అందిరిలోనూ ప్రశ్నలు...

చర్చలు... ఎటుచూసినా చర్చలు. కొన్ని సంస్థలు ఈ యూనిట్‌ని ఆహ్వానించి సన్మానం చేస్తానన్నాయి.

"మాకు కావలసింది సన్మానాలు కాదు, మీ అభిప్రాయాలు. మేం ఇదంతా ఎందుకు చేశామో మీరు గ్రహించండి. మాకు అదేచాలు. వీలయితే ఇలాంటి చిత్రాల నిర్మాణాన్ని ప్రోత్సహించండి'' అన్నారు.

"మీ సినిమాను నేను విడుదలచేస్తాను'' అంటూ ముందుకొచ్చాడు ఓ డిస్ట్రిబ్యూటర్.

"ఇదేమంత లాభాలు తెచ్చే సినిమా కాదు''

"చూడండి... ఈ సినిమాతో లాభాలు తినాలని నేను అనుకోవటంలేదు. లాభాలు తినే చాలా సినిమాలు నేను కొన్నాను. ముందు మీ డబ్బు వచ్చినాకే నేను నా గురించి ఆలోచిస్తాను''

అందరూ కూర్చుని ఆలోచించారు. అదే బాగుందనుకున్నారు. సబ్సిడీ పోను ఈ సినిమాకు ఎంత ఖర్చయిందో అంతా ఓ పుస్తకంలో రాసి ఉంచారు. ఓ ప్రముఖ నిర్మాత కోరికమీద ఆ పుస్తకం అందించారు. అతను ఆశ్చర్యంతో నోరు తెరిచాడు.

"ఇదంతా నిజమేనా?"

"అవును... ఎకానమీ ఆఫ్ థాట్స్. ఎకానమీ ఆఫ్ వర్డ్స్. ఇంకా చాలా విషయాల్లో కావాలి. మన పరిశ్రమ మాత్రం ఒక్క విషయంలో ఎకానమీ పాటిస్తోంది. అది ఎకానమీ ఆఫ్ క్లాత్' అన్నాడు బాలకృష్ణ.

పరిశ్రమ నివ్వెరపోయింది.

"ఇదేం సినిమా. దుర్గతో సినిమానా? దానికి చీరకట్టడమా, దాంతో పాడించటమా! పాటకి మ్యూజిక్ వద్దా? ఈ సినిమాకి ప్రేక్షకులూ వద్దు కాబోల్సు''

ఇలాంటి రకరకాల కామెంట్ల నడుమ సినిమా విడుదలయ్యింది చాలా తక్కువ ప్రింట్లతో. విడుదలైన చోట్లన్నీ రాఘవ తిరిగినవే. అంతా అభిరుచిగలవారే.

సినిమా చూసి బయటకు వచ్చేటప్పుడు వారి ముఖాల్లో ఓ రకమైన గంభీరత్వం చోటుచేసుకుంది.

"ఎలా ఉంది?"

తలలూపుతారుగానీ చెప్పరు''

"బాగుండలేదా?"

"ఎవరన్నారు?"

"మరేమిటి?"

"ఒక్కమాటలో చెప్పేది కాదు... ఆలోచించాలి''

★ ★ ★

సరోజా, దుర్గా, రాఘవా కూర్చున్నారు.

"మన స్వప్నం నిజమైంది'' అన్నాడు.

"అవును''

"మనం ఊహించని విజయం లభించింది. మన పెట్టుబడి మనకు వస్తే చాలనుకున్నాం ఒకరోజు. ఈరోజు డబ్బులు అలా వస్తూనే ఉన్నాయి''

"అంతే జీవితం అంతే. ఒక్కోసారి అలానే వస్తుంటాయి. చాలాకాలంకిందట ' మనమందరం ఈ డబ్బులేక అల్లాడిపోయాంక




దూ''

"అవును. ఆరోజులెలా మరిచిపోతాం"

"ఇప్పుడే మనం జాగ్రత్తపడాలి. విజయం మనిషిని ఎంతగానో ప్రభావితం చేస్తుంది. మనలో అహాన్ని పెంచుతుంది. మనమీద మనకు అతి ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. ముఖ్యంగా మనచుట్టూ భజనపరులు చేరతారు. నాశనానికి ప్రారంభం అదే. సినిమా ప్రపంచంలోకి కొంతమంది మంచి ఆరాటంతోనే వచ్చారు. తమ మొదటిరోజుల్లో మంచి సినిమాలే తీశారు. అయితే విజయాలతో వారు తమకంటూ ఓ వర్గం ఉండవలసిన అవసరాన్ని మరిచిపోయారు. ఎప్పుడైతే తాము తీసిందంతా అద్భుతం అని పక్కవారంటుంటే సద్విమర్శతో ఆమోదించారో వారందరూ కాలం పుటల వెనక్కి వెళ్ళారు.

జీవితాన్ని శోధించాలనుకునేవారికి విజయం ప్రధానంకాదు.. అపజయం అనేది వారినీ మరింత దృఢంగా నిలబడేట్లు చేస్తుంది. అందుకే మనం మనల్ని ప్రశ్నించే, నిలదీసే నేస్తాల్ని ఎప్పుడూ ఉంచుకోవాలి''

ఫోన్లు... ఫోన్లు... ఇంటిముందు నిర్మాతలు...

"దుర్గాజీ మీరు అంగీకరిస్తే చాలు. పాత్ర విషయం గురించి మీరు ఆలోచించవద్దు. మీకోసం రూపొందిస్తున్నాం. మీరు మాత్రమే పోషించగల గొప్ప పాత్ర అది. అంతేకాదు కావాలంటే మీరు ఈ సినిమాలో కూడా పాడవచ్చు''

"సారీ అండీ... నేను గాయకురాలిని కాదు. ఆ సినిమాలో పాడానంటే అది వేరు''

"మీ ఇష్టం. కనీసం మా సినిమాలో నటించండి. హీరోయిన్ ఓరియెంటెడ్ సినిమా''

"మీరు నన్ను సరిగ్గా అర్థంచేసుకోవటంలేదు. నేను హీరోయిన్‌ని కావటంకోసం చేయలేదిదంతా. నా దృష్టిలో వ్యక్తిత్వం అంటూ ఉన్న చిన్నపాత్రయినా గొప్పదే. అలాంటి పాత్రలు పోషించడానికి నాకు అభ్యంతరంలేదు. హీరోయిన్ ఓరియెంటెడ్ పేరుతో కథ మొత్తం నా చుట్టూ తిరగటాన్ని కూడా నేను ఆమోదించను''

"మీఇష్టం, పోనీ కథ మీరే రాయించుకోండి''

"అది కూడా సాధ్యంకాదు. చూడండి. నేను నటిస్తేనే డబ్బులు వస్తాయనుకోకండి. మంచికథకోసం ప్రయత్నించండి. నిజాయితీగా ట్రీట్‌మెంట్ అందించండి. అప్పుడు తప్పకుండా మనం విజయం సాధించవచ్చు. నన్నింతగా మీరు ప్రాధేయపడనవసరంలేదు. మీరు అంటున్న పాత్ర అంత మంచిదే అయితే నేనే మిమ్మల్ని ఆ పాత్ర నాకివ్వమని అడుగుతాను''

★ ★ ★

"మిస్టర్ రాఘవా! మాకోచిత్రం చేసిపెట్టాలి''

"చూద్దాం"

"చూద్దాం అంటేకాదు. అడ్వాన్స్ ఇస్తాను''

"ఆలూలేదు చూలూలేదు అడ్వాన్స్ ఎందుకండి''

"మీకు తెలియదు. మీ పేరుతో సినిమా ప్రకటిస్తాం"

"అలాంటి పాత పద్ధతులు మనకొద్దండి''

"ఇదంతా నాకు అనవసరం. మీరు నాకో చిత్రం చేసిపెడుతున్నారు... ఓ.కే."

"చూద్దాంలెండి''

"సంతోషం మిస్టర్ రాఘవా..."

★ ★ ★

"దుర్గా అంతా నువ్వు చెప్పినట్లుగానే జరుగుతోంది. మనమీద వత్తిడి ఆరంభం అయింది''.

"నిజమే... మనం ఎంత బాగా తీసినా, ఎంత అద్భుత కళాఖండం అయినా కూడా మనకేసి చూడరు. మన చిత్రానికి డబ్బులు

వచ్చాయి, చూస్తున్నారు''

"ఈ ప్రపంచానికి కావలసింది డబ్బేనంటావా దుర్గా''

"అంతేకదా! మన అనుభవం అంతే''

"ఇదంతా లేకపోతే అప్పుడేం జరుగుతుంది?"

"అది ఇప్పుడెలా చెబుతాం"

"అదిసరే... మనం తిరిగి రెండో కార్యక్రమానికి పూనుకోవాలి''

"అవును... తిరిగి ఆరంభమే''

"అన్నట్లు నిన్ను ఆలోచించమన్న విషయం..."

"ఏమిటి? పెళ్ళా?!" అంది దుర్గ మౌనరాగం ఆలపిస్తున్నట్లుగా.

"ఆలోచించావా?" నిశ్శబ్దాన్ని చీల్చాడు.

"ఆలోచించాను. అంతేకాదు మాస్టారూ! ఓ ప్రముఖ వ్యక్తి నన్ను ప్రేమిస్తున్నానన్నాడు''

"నువ్వేమన్నావ్?"

"నవ్వి ఊరుకున్నాను''

"అతని గురించి నీ అభిప్రాయం ఏమిటి?"

"ఏ విషయంలో''

"అతను అడిగిన విషయం గురించి''

"మాస్టారూ! నేను పెళ్ళి చేసుకోవాలనుకోవటంలేదు''

"ఎందుకని?"

"ఎంత ఆలోచించినా అలా అనిపించడంలేదు''

"నీలో తప్పు చేసిన భావన ఉందా?"

"లేదు''

"అని నువ్వనుకుంటున్నావ్''

"మరెందుకని పెళ్ళి చేసుకోవు. అసలిప్పుడు ఏమైందని?"

"మాస్టారూ..." అంది దుర్గ.

రాఘవ ఆవేశం తగ్గించుకుని చూశాడు.

"ఒకనాడు అలాంటి భావం నాలో ఉండేది. దాన్నుండి బయటపడటానికి నేను చాలా కష్టపడాల్సి వచ్చింది. అంతేకాదు, ఒకనాడు మీకు నేను నా గురించి చెప్పినప్పుడు ఇప్పుడేమయిందని వెంటనే మీరు అనలేకపోయారు''

రాఘవ ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

"ఆరోజున మీరు వెంటనే ఓ నిర్ణయానికి రాలేకపోయారు. ఈరోజున మీరు ఆ భావాన్ని అధిగమించారు. నేను చేసినదానికంటే నా ప్రస్తుతం నన్ను ఈ గౌరవానికి అర్హురాల్ని చేసింది. ఆనాడు మీలో గిల్టీనెస్ ఉందని నేను అనను. అది అప్పటి మీ మానసిక పరిస్థితి''

"అవును'' అంగీకరించాడు.

"మనిషి జీవించడంకోసం పడే పాట్లు ఇవన్నీ. అందుకే ఓ దశదాకా మనం ఎన్ని తప్పులు చేసినా అంగీకరిస్తారు''

"తప్పులా?"

"పోనీ అవసరాలు. లేదా బలహీనతలు. వీటన్నింటికంటే మనం కంట్రిబ్యూట్ చేయగలిగింది గొప్పగా ఉంటే వాటిని క్షమిస్తారు''

"అవును''

"నేను తప్పుచేశానని ఎప్పుడూ అనుకోలేదు. జీవితం అలా ఫోర్స్ చేసింది. ఎంత పెనుగులాడినా దాన్నుండి నేను బయటకు రాలేకపోయాను. కొంతకాలం నిస్సహాయంగా ఊరుకున్నాను. తిరిగి రెట్టించిన బలంతో ఎదురుతిరిగాను. ఫలితం మీకు తెలుసు''

నిశ్శబ్దం...

"స్త్రీ-పురుషులు కామంతో, అంటే స్వేచ్ఛతో కూడిన కామంతో అంటే ఒకరినొకరు కోరుకుంటూ కలవటం సెక్స్. రెండు కండరాల నడుమ రాపిడి సెక్స్‌కాదు. అది పెళ్ళి ముసుగులో ఉన్నా, ఇంకే బంధంలో ఉన్నా అంతే. ప్రేమలేనిది పైకి మాత్రమే గౌరవాన్ని నటిస్తుంది. అందుకే నేననుకుంటాను... తప్పంటూ ఉంటే అది సెక్స్‌లో లేదు. అంతరాల్లో ఉంది. సమాన భాగస్వామ్యం లేని దాంపత్యం అయినా అవసరమే. అక్కడా





డబ్బు పాత్ర ఉంది''

మౌనం...

"అందుకే నేను తప్పు చేసిన భావనలేదు... అమ్మలాగా బతకలేకపోయానే అనే బాధ ఉంది. అమ్మ జీవితం గురించి మీకు చెప్పాను. అదంతా పైకి ఓ విషాదంగా కనిపించవచ్చు. కానీ ఏకాంతంలో కూర్చుని ఆలోచిస్తే అదో మధురమైన గానం. నాన్నతో ఉన్నప్పుడు ఎంత తన్మయత్వంతో గానంచేసిందో. ఆయన లేనప్పుడూ అంతే. ఆమె ఒంటరిగా వెన్నెల్లో కూర్చుని తనలో తాను పాడుకునేది. ఆమె నాన్నను ప్రేమించింది. ఆమె కష్టాల్ని ప్రేమించింది. ఆమె అపనిందల్నీ, అవమానాల్నీ అన్నింటినీ అధిగమించింది. ఆమె ఆరోగ్యం బాగుండి మరికొన్ని దశాబ్దాలు జీవిస్తే జీవితాన్ని ఎలా ఎదుర్కొనేదో మనం చెప్పలేం. కానీ అమ్మ ఓ మరపురాని జ్ఞాపకం. అందుకే అమ్మలాగా ప్రేమకోసం బతకాలనేదే నా ఆరాటం. కానీ నా అనుభవం నిర్మలంగా లేదు. శ్రీశ్రీ చెప్పిన రాక్షస రతి నాకు తెలుసు. భయంకర బాధల పాటల పల్లవిని ఈ పెదవులు ఎన్నిసార్లో పాడాయి. నలిగిపోయింది నా శరీరంమాత్రమే కాదు. నా మనసు! వాడిపోయింది పూలేకాదు, నా కలలు. ఈ ప్రపంచంలో ఇంక అంతా ఇంతేననుకుని కుమిలిపోయిన క్షణాలున్నాయి. నాకెప్పుడూ ఓ తోడు కావాలనే ఆలోచన రాలేదు. నాకు భయం. నా శరీరాన్ని చూస్తే భయం. నాకు ఆనందం కూడా నా శరీరాన్ని చూసుకునే. ఇది ఇతరులకు ఉపయోగపడినంతగా నాకు ఉపయోగపడలేదు. ఏవేవో నీతులు నన్ను లోబరుచుకోలేదు. నేను ఇంకెవరితోనో పోలికలు పెట్టుకోవాలని కూడా అనుకోవటంలేదు. నా అనుభవాలు నన్ను రాటుదేల్చాయి. నాక్కావలసింది పెళ్ళికాదు...

ప్రేమ...

కేవలం ప్రేమ. నమ్మగలరా? ఈ శరీరానికి సుఖం అవసరంలేదు. మీకు తెలియదు, నా శరీరమంతా గాయాలు, గాయాల జ్ఞాపకాలు. రేపు ఎవరి చెయ్యి నా శరీరంమీద పడ్డా కదలిక ఉండదు. నిర్లిప్తత... జుగుప్స... ఇంకా రకరకాల భావాలు. నేను ఇంకో ప్రపంచంలో బతకటంలేదు. అందుకే చెబుతున్నాను. నాకయితే ప్రేమ కావాలి. శరీరంతో సంబంధం లేని ప్రేమ. కానీ అది రియాలిటీ కాదు. నాతో పురుషుడు ఉంటే అతనికి నా శరీరం కూడా కావాలి. ఈ గాయాల శరీరాన్ని అతని చేతుల్లో ఎలా ఉంచటం? తిరిగి గాయపడుతున్నా నవ్వు పులుముకునే ఓపిక నాలోలేదు. అందుకే నాకు పెళ్ళి అవసరంలేదు. అయితే ప్రేమ కావాలి... నిజం మాస్టారూ నాకు ప్రేమ కావాలి''

నిశ్శబ్దం... నిశ్శబ్దం.

"ఈ ప్రపంచంలో నాకు అమ్మే ప్రేమను అందించింది. జీవితం నాకు ప్రేమను అందించింది. మీరు నాకు ప్రేమను అందించారు. నా వృత్తి నాకు ప్రేమను అందించింది. మాస్టారూ! ఓ విషయం అడుగుతాను చెప్పండి - మీరు నన్ను ప్రేమించలేదా?"

మౌనం!

"నాకు తెలుసు. మీరు చెప్పరు. మీరు వెంటనే చెప్పలేరు. తిరిగి ఏదోరోజున అంటారు 'అవును దుర్గా నిన్ను నేను ప్రేమించాను' అని.

మాస్టారూ! మీరు నన్ను స్పర్శించారు. నాకప్పుడు జుగుప్స కలగలేదు. మా అమ్మ గుర్తొచ్చింది. మనబాల్యం గుర్తొచ్చింది. అది బాల్యమేనా? అలా అనవచ్చా? నాకప్పుడు గాయాలకు మందు రాసినట్లుగా అనిపించింది. మీరలా శాశ్వతంగా నా శరీరాన్ని స్పర్శిస్తే నా గాయాలు నయం అవుతాయనిపించింది. మనని గురించి కొన్ని పత్రికల రాతలు తెలుసు. అనేకమంది గుసగుసలు తెలుసు. అయినా కూడా నాకు తెలుసు మీ స్పర్శలోని అనుభూతి. మీతో నాకు శారీరక

మైనది కాదు కావాల్సింది, దగ్గరతనం. కోర్కెకు అతీతమైన దగ్గరతనం. ఒకచోట అలాంటి కోర్కె లేకపోతే విలువ ఉండదు. ఇక్కడ కోర్కె ఉంటే ఆ అనుబంధం కుళ్ళిపో యినట్లే. అందుకే మాస్టారూ నాకు కావల సింది తోడు. అయితే మీరున్నారు. మీతోపాటు సరోజ ఉంది. అంతేకాదు మాస్టారూ - మాన వుడి ప్రపంచమంతా ఏ ఒక్కదానితోనో ముడి పడిలేదు. మనిషికి ప్రేమ కావాలి. తోడు కావాలి. అదే ప్రపంచం కాదు. అది లేకుండా ఉండే ప్రపంచమూ కావాలి. అందుకే నాకు నా ఆరాటమే ఓ ప్రపంచం.

తిరిగి నేను నా కళని ఆరాధిస్తా... దాంతో మమేకం అవుతా... దాని లోతులు తెలుసు కుంటా. అది ఎవరికోసమో వారికి అందిస్తా.

అలా వచ్చే ఆనందం, తన్మయత్వం, అనుభూతి... ఇంతకుమించి నాకు అవసరంలే దు. ఈ జీవితాన్ని ఇలా కొనసాగనీయండి.

ఏదో ఒక బిందువు దగ్గర ఆగిపోయేంతవ రకూ నన్నీరకంగానే శ్వాసించనీయండి..."

చాలాసేపటి తర్వాత రాఘవ కదిలాడు.

దుర్గ రెండు చేతులూ అందుకున్నాడు. "దుర్గా..." అతని రెండు పెదవులూ కది లాయి.

"మాస్టారూ!"



"కాదు... నాకిప్పుడు నీలో మా అమ్మ కనిపిస్తోంది. తను ఇప్పుడు లేదు. కానీ ఆమె కళ్ళలో కురిపించిన ప్రేమ నాకు తెలుసు.

అలాంటిదేనా... అలాంటి ప్రేమేనా... అలాంటి తోడేనా నువ్వు కోరుకుంటోంది...?

నేను జ్వరంతో కాలిపోతున్నప్పుడు నన్ను స్పర్శించే సరోజలోనూ అమ్మే... నాకు అమ్మే కనిపిస్తుంది. నేనింకా సొంతం మనిషిని కాన ప్పుడు నాకింకా ఈ ప్రపంచం గురించి ఏమీ తెలియనప్పుడు...

నాకింకా శబ్దానికీ, నిశ్శబ్దానికీ అర్థం తెలియనప్పుడు... నన్ను కదిలించి ఉంటుందా రాగం...

అదే... ఆ పాట... అమ్మ పాడిన పాట. ఆ చిన్న మనసులో ముద్రించుకుపోయి ఉంటుంది ఆ గానం. మెదడు పొరలనిండా ఆ గానమే. దశాబ్దాలు గడిచిపోయాయి. తిరిగి నేను శబ్దాలలోకి జారిపోతున్నప్పుడు, మెదడు పొరల కదలికలు జరిగి... అవును ఆ రాగమే... అదే గుర్తొచ్చింది.

నువ్వంటావ్
అది మీ అమ్మదని-
అది మా అమ్మది, మీ అమ్మది.
ఈ ప్రపంచం శబ్దించడం గురించి తెలుసుకున్నాక పుట్టిన రాగం అది...
అందుకే మనిషి కరుగుతాడు...
రాళ్ళు కరుగుతాయి.
దుర్గా....
మీ అమ్మగారు లేరు.
నా అమ్మ లేదు.
వారి జ్ఞాపకాలున్నాయి.
వారి గుర్తులున్నాయి.
నువ్వున్నావ్...
ఎప్పుడో నేను చెబుతానని-
కాదు
ఇప్పుడే...
ఈక్షణమే చెబుతున్నా...
దుర్గా-
నిన్ను నేను ప్రేమిస్తున్నా...
నిన్ను నేను ప్రేమిస్తున్నా..."
మౌనం...
తన్మయత్వం...
కళ్ళు మూసుకుంది.

"అలానే ఉండు...
మీ అమ్మను సాక్షాత్కరింపచేసుకో...
మా అమ్మను సాక్షాత్కరింపచేసుకో...
దుర్గా...
ఇప్పుడు వాళ్ళు లేరు
నువ్వున్నావ్...
నీ పాట ఉంది...
పాడు... నాకోసం పాడు...
అమ్మా...
పాడు... నాకోసం పాడు"
దుర్గ మెల్లగా కళ్ళు తెరిచింది.
ఆమె పెదవులు మెల్లమెల్లగా కదిలాయి.
అప్పుడు ఊపిరి పోసుకుందా రాగం...
రాఘవ కళ్ళు మూసుకున్నాడు.
అతనిప్పుడు...
మెల్లగా... మెల్లగా...
ఆ పాటలో కరిగిపోతూ...
కలిసిపోతూ...
ఆ పాట అలా వినిపిస్తూనే ఉంది.



## అంకితం

"సినీ జనారణ్యం" చదివాక ఇంక సినిమారంగంమీద నవల రాయకూడదనుకున్నాను-

"అలా కాదు, మీరు రాయాలి" అన్నారు యన్.ఆర్. నంది.

"రాయటం అంటూ జరిగితే అది మీకే అంకితం" అన్నాను-

ఈ నవలను ఆయనకు అంకితం చేస్తున్నాను-

నిండుహృదయంతో-

-పి. చంద్రశేఖర అజాద్



# 'ప్రతీకారం'పై సమీక్షలు.

ఏప్రిల్ చతురలో ప్రచురితమైన వసంతలక్ష్మి 'ప్రతీకారం' నవలపై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఐదింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం.

## 'ఫాక్ట్ వర్సస్ ఫిక్షన్'

*(ప్రథమ బహుమతి రూ: 100/- పొందిన సమీక్ష)*

పిల్లలకి పన్నెండో యేటనే స్వంత వ్యక్తిత్వానికి పునాది ఏర్పడి 'నేను, నా జీవితం' అనే రూపాలు బలంగా రూపుదిద్దుకొనడం మొదలవుతాయి. సరిగ్గా ఈ స్టేజ్‌లో ఓ యవ్వని తన ఏకాంత జీవితాన్ని ప్రభావితం చేసిన ఓ రక్త సంబంధీకుడితో అయిష్టంగానే సంబంధం పెట్టుకోవటం ఒక్కటే 'ప్రతీకారం' నవలలోని చెప్పుకోవలసిన అంశం. కథలోని మిగిలిన మలుపులూ, మార్పులూ అన్నీకూడా మంచి, చెడు... ప్రేమ, ద్వేషంలాంటి విరుద్ధ భావనలతో కూడిన సన్నివేశాల సముదాయమే తప్ప రచయిత్రి మొదటే ఎంచుకొన్న ఇతివృత్తం చుట్టూ తిరిగే సెంటిమెంటల్ ఎటాచ్‌మెంట్స్ కాదు.

పదిహేనేళ్ళ మనోహిత ముప్పైఅయిదేళ్ళ డాక్టర్ మోహితగా ఎదిగేదాకా పుస్తకాలే ప్రపంచంగా గడపటం కేవలం పాత్రోచితం. ఓ స్నేహితుణ్ణి కానీ, స్నేహితురాలిని కానీ... పోనీ ఆమెలో భావుకత్వం అధికం కాబట్టి ఓ కవయిత్రిని కానీ, కవిని కానీ ఆప్తురాలిగా ఎందుకు సంపాదించుకోలేకపోయింది?

ఇలా ఎందుకు జరిగిందీ అంటే తనకి చీకటిలో చీకటిని చవిచూపించిన మనోహర్ కూతురితో ప్రేమలో కూరుకుపోయి బయటపడ్డ, మంచి అభిరుచులున్న చక్రవర్తిని పెళ్లి చేసుకొనటం కోసమే అని చెప్పాలి.

ఓ మామూలు వ్యక్తి మంత్రి అవటం ఆ తరువాత ముఖ్యమంత్రి అవటం... చిట్టచివరికి ప్రాణభయంతో గత చరిత్ర వెల్లడిచేయటం ఇవన్నీ కూడా హీరో, విలన్ సినిమాలోలా ఉన్నాయి.





వసంతలక్ష్మిగారు నిజం, కల్పన అనే రెండు పడవలపైనా కాళ్లు (కలం) ఉంచకుండా ఏదో ఒక మార్గాన్నే ఎంచుకొంటే ఆమె రచనా ప్రపంచంలో ఇంకా చక్కటి ముగింపులు తళుక్కుమంటాయి.

-ఎన్. రవి
కాకినాడ

## 'ప్రతీకారం కాదు పరివర్తన కావాలి'

*(ద్వితీయ బహుమతి రూ: 75/- పొందిన సమీక్ష)*

ఉమ్మడి కుటుంబాలలోని జీవనశైలికి, వ్యక్తుల మనస్తత్వానికి అద్దం పట్టిన నవల 'ప్రతీకారం'. అందరికీ కాకపోయినా చాలావరకు ఉమ్మడి కుటుంబాలలోని పిల్లల భావాలు, బాధలకు ప్రతినిధి 'మనోహిత'. తనను ఎవ్వరూ పట్టించుకోరనీ, తనంటే అందరికీ నిర్లక్ష్యం అనీ భావించుకొనే 'మనోహిత'లను తమ దారిలోకి తెచ్చుకోవడానికి 'మనోహర్'లు పెద్దగా కష్టపడనక్కరలేదు. కొద్దిగా అభిమానిస్తే చాలు పొంగిపోతారు.

ఇక్కడ జరిగిన తప్పుకు బాధ్యుడు కేవలం మనోహరే కాదు... పిల్లలకు మనం ఇవ్వగలిగేది ఆస్తులు, అంతస్తులే అనుకొని, ఆదివారాలు, పుట్టినరోజులు కలిసి భోజనం చేస్తే చాలనుకొనే తాతగారు, అంతా అమ్మపోలికే, అమ్మలాగే తన సమస్యలు తానే పరిష్కరించుకోగలదనుకొనే తండ్రిలాంటివాళ్లు కూడా అందుకు బాధ్యత వహించవలసి ఉంటుంది. అలాగే "అదే నిజమైతే ఆ నిజం పోలీసులకు నేనే చెపుతా" నన్న కామేశ్వరి, మనోహితను కొంచెం ముందుగా అర్థం చేసుకోగలిగితే సమస్య ఇంతవరకూ వచ్చేదేకాదు.

పాత్రధారులను ఓ క్రమంలో ప్రవేశపెట్టి, చక్కగా కథ నడిపిన రచయిత్రి, ముగింపు విషయంలో కొంచెం తొందరపడ్డారేమో అనిపిస్తుంది.

మనోహర్ మీద పగతీర్చుకోవడం కాకుండా అతనిలో పరివర్తన కలుగచేస్తే బాగుండేది. తాతగారి పరోక్ష సహకారంతోనే డాక్టరైన మనోహితకు, మనోహర్ మీద పగతీర్చుకొనే అవకాశం కలిగింది యాదృచ్ఛికంగానే.

బాలలమీద జరుగుతున్న అత్యాచారాలీనాడు తక్కువేమీకాదు. వీరందరికీ పగతీర్చుకొనే అవకాశంరాదు. కనీసం పిల్లల బంగారు భవిష్యత్‌ను నలిపి నాశనం చేసే కొందరికైనా ఈ కథ కనువిప్పు కలిగిస్తే బాగుంటుంది. చక్కని కథ, కథనం ఉన్నా ప్రయోజనం లేని నవలగా తయారు చేశారీ 'ప్రతీకారం'ను రచయిత్రి!

-కృష్ణమోహన్
అమలాపురం

## 'చిన్నచూపు'

*(మూడవ బహుమతి రూ: 50/- పొందిన సమీక్ష)*

వసంతలక్ష్మిగారి 'ప్రతీకారం' నవలలో యదార్థత వున్నా పరితుల సానుభూతి మనోహిత పాత్రకు చెందాలని కాబోలు అనవసరంగా పొడిగించినట్లుగా వుంది. రచయిత్రి మనోహితను ప్రత్యేక వ్యక్తిత్వంగల పాత్రగా చిత్రించారు. ధైర్యం, ఆలోచనాశక్తి విచక్షణా జ్ఞానం కలబోసిన వ్యక్తిత్వంగల మనోహితకు పినతండ్రి చెరనుండి తప్పించుకోవడానికి రెండేళ్లు కావాలా? మొదటి సంఘటన ఒక్కటి చాలదా అతనిపై ప్రతీకారం తీర్చుకోవడానికి? అలాగే మనోహర్ లాంటి భయంకరమైన వ్యక్తిత్వంగల మనిషిని ఎంతగా శిక్షించినా తక్కువే. కానీ మనోహిత ప్రతీకారంలో అంత తీవ్రత కనిపించలేదు. మనోహర్‌లాంటి అవినీతిపరులే రాజకీయ నాయకులవుతారని రచయిత్రి భావంలా అనిపిస్తోంది కథలోని కొన్ని వాక్యాలను చదువుతుంటే. కానీ రాజకీయనాయకులందరూ అవినీతి పరులుండరు, అవకాశవాదులూ, మనీ ప్రియులుంటారుగానీ. మనోహిత జీవితంలోని మలుపు, మరికొన్ని సంఘటనలు ఉమ్మడి కుటుంబంలోని సాధకబాధకాలను తెలియచేస్తున్నాయి. అందరూ కలిసిమెలిసి ఉండాలనీ, మమతానురాగాలు పంచుకోవాలనీ కృష్ణమూర్తిగారి భావన అయితే, ఆయన పెద్దరికాన్ని గౌరవించి కలిసి వున్నారేగాని ఎవరి వ్యక్తిత్వం వారిదే అన్న యదార్థం మనోహర్ ప్రవర్తన ఋజువు చేస్తుంది. మొత్తం మీద నవల చక్కని వ్యవహారిక శైలితో నడిచిందనే చెప్పాలి.

చక్రవర్తి పాత్ర బాగానేవున్నా మనోహితకి, అతనికి వివాహం జరపడం బాగాలేదు. మనోహర్ కుమార్తెను అంతగా ప్రేమించి ఆమెకోసం ఎదురు చూసిన చక్రవర్తి మనోహితను కోరుకోవడం మనోహిత అతన్నే పెళ్లి చేసుకోవడం అంతగా నచ్చలేదు. మహోన్నత వ్యక్తిత్వంగల మనోహితని మొదటినుంచి రచయిత్రి కొంచెం చిన్నచూపు చూసారనే అనిపిస్తుంది.

-ఎన్.ఎల్.ప్రసూనాదేవి
దయానందనగర్

## 'అపరాజిత'

*(నాలుగవ బహుమతి రూ: 50/- పొందిన సమీక్ష)*

పదమూడేళ్ల బాలికపై ఆమె బాబాయి ఒకసారి పొరపాటున కాదు, అనేకసార్లు అలవాటుగా అత్యాచారం జరపటం సాధారణం కాకపోయినా, అసంభవంకాదు. ఆధునిక కాలంలో ఎన్నో వికృత చర్యలు జరగటం చూస్తున్నాం. విపులాచ పృధ్వీ! బాల్యంలో మనోహిత ఒంటరిగా తోటలలో విహరించటం, గాలితో, ధూళితో మాట్లాడటం ఆమె భావి విశిష్టవ్యక్తిత్వానికి పరిపోషకాలు.

"భవిష్యత్ ఎదురుగా ఉంది. దాన్ని అందంగా మలచుకొనేటందుకే వర్తమానం" అనే సూక్తిసామాన్యమైనదేకాని, సందర్భోచితంగా మనోహర్ పాత్రలో ప్రయోగించటం వలన బలంగా ఉంది. "నువ్వు ముఖ్యమంత్రివా?" అని ఒక కుమార్తె తన తండ్రితో వ్యతిరేక ధోరణిలో ప్రశ్నించటం, ఆ తండ్రి ధూర్తతకు పరాకాష్ట.

"నీ ఆలోచన, నీ జ్ఞాపకాలు కాలం క్రింద సమాధి చేశాను'' అని మనోహిత చెప్పటం "తొణుకూ, బెణుకూ లేని ఆమె స్థితప్రజ్ఞత"ను సూచిస్తున్నది.

పాశ్చాత్య నాగరికతలో పెరిగిన కరోల్ పాత్ర చిన్నదయినా, మన సంస్కృతికి గౌరవం తెచ్చింది. జీవితంలో ఆడవాళ్లను చూడకూడదు అనుకొన్న చక్రవర్తి నిర్ణయాన్ని మనోహిత తల క్రిందులు చెయ్యడం, అభిలషణీయమైన పరిణామం. అంతటి విద్యావేత్త కళాప్రియుణ్ణి ఆకర్షించగలిగేటంత ఉన్నతంగా మనోహిత పాత్రను



చిత్రీకరించటంలో వసంతలక్ష్మిగారు సాఫల్యత సాధించారు. ఏమైనా సరే మనోహిత అపరాజిత.

శత్రువును భౌతికంగా చంపటంకంటే, అతని లోని దౌష్ట్యాన్ని చంపటమే నిజమైన విజయం. ఇతివృత్తానికి సార్ధకతను చేకూర్చింది. 'ప్రతీకారం' అనే పేరు. ఆమె వైద్యసేవ, పక్కగదిలో పాత్రికే యులూ, సినిమాటిక్‌గా ఉంది.

సునిశితమైన సత్యదృష్టిగల పెద్దమనిషిగా, కృష్ణమూర్తిగారు కనిపించారు. అయితే అతని మరణానంతరం అభిలాష్ 'మనవరాలు (మీనాక్షి)తో పెళ్లికి ఒప్పుకున్నాకే అపాయింట్‌మెంట్ ఇచ్చాడు' అనుకుంటాడు. ఈ రకమైన లౌక్యం కృష్ణమూర్తిగారిలో ఎక్కడా ఋజువు చెయ్యలేకపోయాడు అభిలాష్. ఈ స్వగతంతో అతని పాత్రే తెరమరుగయింది. ఇది రచయిత్రి గమనించినట్లు లేదు.

"తెలుగు రైటర్స్‌కి ఇంగ్లీష్ యూసేజ్ వెరీకామన్' అనేది కూడా తెలుగు వాక్యమే అని భ్రమించేటంతగా ఆంగ్లపదాల్ని కొందరు రచయిత(త్రు)లు వాడుకున్న ఈ రోజుల్లో ఆర్కియాలజిస్టు, ట్రాన్స్‌పరెంట్‌జార్స్, కంటెయినర్, పిల్లర్స్, రూఫ్ మొదలైన మాటలు అంతగా ఆక్షేపణీయాలు కాదు. ఎదుటివాడికి తెలుగులో భాష తెలియనప్పుడూ, తెలుగు అంతటి స్ఫూర్తిదాయకమైన పదం లేనప్పుడూ మాత్రమే ఇతర భాషలు ఉపయోగించాలని కీ.శే. పానుగంటివారి సలహా!

**–దేశరాజు సుబ్బారావు**
మెట్టక్కివలస

# 'సందేశాత్మకం'

***(అయిదవ బహుమతి రూ: 50/- పొందిన సమీక్ష)***

ఏప్రిల్ నెల నవల 'ప్రతీకారం' ప్రథమార్థం ఉత్కంఠతో చదివించి, ద్వితీయార్థం కొద్ది విసుగును, ముగింపు అసంతృప్తిని కలిగించింది. నవల ప్రారంభం బాగుంది. మనోహిత ఇంటినుంచి ఎందుకు పారిపోయిందన్నది తెలుసుకోవడానికి పాఠకులు ఆసక్తితో ముందుకు సాగుతారు. దానికిగాను రచయిత్రి చూపిన కారణం చాలా బలంగా ఉండి నవలకు మంచి గ్రిప్‌నిచ్చింది.

స్వంత బాబాయి అయిన మనోహర్, పసితనం ఛాయలు వీడని పూవులాంటి మనోహితను బుజ్జగించి, భయపెట్టి వశం చేసుకున్న తీరు అసహజంగా ఉంది. బాబాయికి ఎదురు చెప్పనూలేక, తన అయిష్టతను వ్యక్తీకరించనూలేక మనోహిత అనుభవించిన మానసిక సంఘర్షణను రచయిత్రి చక్కగా చూపించగలిగారు.

డాక్టర్‌గా తిరిగి వచ్చిన మనోహిత ఫ్లాష్‌బ్యాక్ తెలుసుకునేంతవరకు నవల మంచి టెంపోతో నడిచింది. తరువాతనుంచి మనోహర్ రాజకీయ రంగ ప్రవేశం, మనోహితను చంపించడానికి ప్లాన్ చేయడం సినిమాటిక్‌గా ఉండి మంచి నవల చదువుతున్న ఫీలింగ్‌ను రొటీన్ చేసేశాయి.

ఒంటరితనంతో అలమటిస్తూ, ప్రేమ కోసం పరితపిస్తూ సతమతమయ్యే బాలికగా పరిచయమైన మనోహిత, బాబాయి పశుప్రవృత్తికి బలయి మానసిక సంఘర్షణ అనుభవిస్తూ చెప్పలేక, చెప్పలేక ఆ విషయం బయట పెడితే పట్టించుకోని తనవాళ్లను చూసి మనసు ముక్కలై చెప్పాచేయకుండా పారిపోయి డాక్టర్‌గా వచ్చేంతవరకు ఆమె కారెక్టర్ చాలా విశిష్టతతో మలచబడింది. అయితే తరువాత చక్రవర్తికి చేరువై ప్రేమలోపడి, అతన్ని పెళ్లాడ్డంతో సాదాసీదాగా తయారయింది.

నవలకు మరొక డ్రాబ్యాక్ ముగింపు చాలా కృతకంగా, అసంపూర్తిగా ఉంది. నవలకు పెట్టిన పేరు కూడా సజెస్టివ్‌గాలేదు. మనోహర్ చేసిన తప్పులు అతని ద్వారా బయటపెట్టించడమే ప్రతీకారమా?

ఏదేమైనా మంచి నవలగా రూపుదిద్దుకోవలసిన 'ప్రతీకారం' నప్పని టైటిల్‌తో, అసంపూర్తి ముగింపుతో సాదాసీదా నవలగా తయారయింది. అయితే మనోహర్‌లాంటి కామాంధులకు మనోహితలాంటి కన్నెపిల్లలు ఎలా బలవుతున్నారో తెలుసుకొని జాగ్రత్తపడమని, అలా బలయిన ఆడపిల్లలు పిరికిగా వ్యవహరించక ధైర్యంగా జీవితాన్ని ఎలా ఎదుర్కోనాలో సందేశాత్మకంగా తెలియ బరచడంలో రచయిత్రి సఫలీకృతురాలయ్యారు.

**-ఎన్. శివనాగేశ్వరరావు**
మునగపాక

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 290328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

CHATURA Telugu Monthly Hyderabad - 500 482 Regd. No. H/HD/402

# రత్నం రెసిడెన్షియల్ ఎడ్యుకేషనల్ కాంప్లెక్స్




**రత్నం నగర్ - పిడతాపోలూరు - నెల్లూరు - 524 346**

రత్నం రెసిడెన్షియల్ జూనియర్ కాలేజి

రత్నం రెసిడెన్షియల్ మహిళాకళాశాల

రత్నం రెసిడెన్షియల్ హైస్కూలు

రత్నం రెసిడెన్షియల్ గర్ల్స్ హైస్కూలు

**1994 - '95 విద్యా సంవత్సరానికి**

**పై విద్యా సంస్థల అడ్మిషన్లు జరుగుచున్నవి.**

రూ.50/- లు డి.డి. లేదా ఎం.ఓ. పంపి అప్లికేషన్, ప్రాస్పెక్టస్ పొందవచ్చును. చేరదలచిన వారు రూ. 1,000/- లు డి.డి. లేదా ఎం.ఓ. పంపి సీటు రిజర్వు చేసుకొనగలరు.

హైస్కూలు : స్టేటు సిలబస్ననుసరించి 6 వ తరగతి నుండి 10 వ తరగతి వరకు ఇంగ్లీషు, తెలుగు మీడియంలో బోధన.......

జూనియర్ కళాశాల : M.P.C., Bi.P.C., గ్రూపులకు ఇంగ్లీషు, తెలుగు మీడియంలో శిక్షణ.

C.B.S.E., I.C.S.E., 10 వ తరగతి ప్రథమశ్రేణిలో పాసయినవారు ప్రవేశార్హులు.

ఇంత వరకు పలుమార్లు రాష్ట్రస్థాయిలో ర్యాంకులను సాధించి
జయకేతనం ఎగురవేసిన ఏకైక ఉన్నత విద్యాసంస్థ
**రత్నం రెసిడెన్షియల్ జూనియర్ కాలేజి**

## SOME OF OUR GEMS WHOM WE HELPED TO SHINE



**P.Guru Prasad**
1988 I.P.E. 9th Rank



**Abdul Roshan**

1993. 448 marks out of 470 in the Junior Intermediate M.P.C. Expecting a good rank in 1994 I.P.E.



**V. Satish Chandra**
1990 I.P.E. 5th Rank



**M.Basavaraju**
1990 I.P.E. 3rd Rank.

*„Genius is often but the capacity for receiving and improving by discipline„*
— George Eliot



**Karimullah Khan**
1992 I.P.E. 4th Rank